అన్నమాచార్య సంకీర్తనలు

ధర : 116/-

సేకరణ : మైథిలీ వెంకటేశ్వరరావు

ప్రథమ ముద్రణ :
మే 2008

500

# అన్నమాచార్య సంకీర్తనలు



సేకరణ : మైథిలీ వెంకటేశ్వరరావు

# సంకీర్తనల సూచిక

| | | | |
|---|---|---|---|
| 170. | పేరంటాండ్లు పాడరే | ................................. | హిందోళం |
| 171. | పొడగంటిమయ్య | ................................. | మోహన |
| 172. | ఫాలనేత్రానల | ................................. | శ్రీరాగం |
| 173. | బ్రహ్మ కడిగిన | ................................. | ముఖారి |
| 174. | భక్తికొలదీ వాడె | ................................. | మలయమారుతం, రామక్రియ |
| 175. | భవరోగ వైద్యుడవు | ................................. | సాళంగనాట |
| 176. | భావములోన | ................................. | శుద్ధధన్యాసి |
| 177. | ఆది పురుషా | ................................. | సింధుభైరవి |
| 178. | భావించి చూడరే | ................................. | సావేరి |
| 179. | మనుజుడై పుట్టి | ................................. | అభోగి |
| 180. | మంగాంబుధి హనుమంత | ................................. | ధర్మవతి |
| 181. | మాధవకేశవ | ................................. | కాఫీ |
| 182. | మాధవునకు మంగళము | ................................. | కేదార గౌళ, సురటి |
| 183. | మించి దేవాంగనలిట్టే | ................................. | రామక్రియ |
| 184. | ముద్దుగారే యశోద | ................................. | కురంజి |
| 185. | ముద్దులుమోమున | ................................. | హిందోళం |
| 186. | మూసిన ముత్యానకేలే | ................................. | మోహన |
| 187. | మేడలెక్కినిన్నుజూచి | ................................. | రేవతి |
| 188. | మేదిని జీవులఁగావ | ................................. | భౌళి |
| 189. | మొత్తకురే అమ్మలాల | ................................. | కాంభోజి |
| 190. | రమణుడ ఇంతట | ................................. | కల్యాణవసంతం |
| 191. | రంగరంగ రంగపతి | ................................. | సింధుభైరవి |
| 192. | రాజీవ నేత్రాయ | ................................. | నటభైరవి |
| 193. | రామచంద్రుడితడు | ................................. | ద్విజావంతి |
| 194. | రాముడు రాఘవుడు | ................................. | కానడ |
| 195. | రాముడు లోకాభి రాముడు | ................................. | ముఖారి |
| 196. | లాలనుచు నూచేరు | ................................. | మధ్యమావతి |
| 197. | వందే వాసుదేవం | ................................. | శ్రీరాగం |
| 198. | వాడె వేంకటాద్రి మీద | ................................. | వసంత |
| 199. | విచ్చేయవమ్మా | ................................. | మోహన |
| 200. | వినరో భాగ్యము | ................................. | శుద్ధధన్యాసి |
| 201. | విన్నపాలు వినవలె | ................................. | భౌళి |
| 202. | విశ్వప్రకాశునకు | ................................. | హంసనాదం |
| 203. | విశ్వరూప మిదివో | ................................. | శుద్ధ ధన్యాసి |
| 204. | వింటిమి నీ కథలు | ................................. | హిందోళం |
| 205. | వెట్టివలపు చల్లకు | ................................. | శ్రీరాగం |
| 206. | వేడుకొందామా | ................................. | జంఝూటి |
| 207. | శరణు శరణు | ................................. | ఝుంఝూటి |
| 208. | శిరుత నవ్వులవాడు | ................................. | మోహన |
| 209. | శ్రీమన్నారాయణ | ................................. | మాళవిగౌళ |
| 210. | షోడశ కళానిధికి | ................................. | లలిత |
| 211. | సకలలోకేశ్వరులు | ................................. | రతిపతిప్రియ |
| 212. | సకలాపరాధములు | ................................. | చక్రవాకం |

| | | | |
|---|---|---|---|
| 213. | సతులాలాచూడరే | ................................. | కాఫీ |
| 214. | సర్వాంతరాత్ముడవు | ................................. | కానడ |
| 215. | సహజ వైష్ణవాచార వర్తనుల | ................................. | సామంతం |
| 216. | సందెకాడ బుట్టినట్టి | ................................. | రామక్రియ |
| 217. | సువ్విసువ్వి సువ్వాలమ్మా | ................................. | శుద్ధధన్యాసి |
| 218. | సేవింపరో జనులాల | ................................. | హిందోళం |
| 219. | హరినామము కడు | ................................. | జోన్పురి |
| 220. | హరి నీవే సర్వాత్మకుడవు | ................................. | దేశి |
| 221. | హరి శరణాగతి | ................................. | కల్యాణి |
| 222. | హరి సర్వాత్మకుడు | ................................. | హంసధ్వని |
| 223. | హరి హరి నీ మాయా మహిమ | ................................. | బృందావని |
| 224. | అతడే రక్షకుడు | ................................. | తిలంగ్ |
| 225. | అనిశముదలచరో | ................................. | నాటకురంజి |
| 226. | అన్నివిభవముల | ................................. | రీతిగౌళ |
| 227. | అనుచు లోకము లెల్ల | ................................. | మధ్యమావతి |
| 228. | అపరాధిని నేనైనాను | ................................. | మేఘరంజని |
| 229. | అప్పులవారే | ................................. | ఆరభి |
| 230. | అమరాంగన | ................................. | మాండు |
| 231. | అమరెగదె నేడు | ................................. | దేవగాంధారి |
| 232. | అమ్మమ్మ ఏమమ్మ | ................................. | భైరవి |
| 233. | అయ్యో పోయన | ................................. | శివరంజని |
| 234. | అరసినన్ను గాచిన | ................................. | దేశ్ |
| 235. | అలివేణిని | ................................. | వలజ |
| 236. | అహోబలేశ్వరుడు | ................................. | బిలహరి |
| 237. | అందరి బతుకులు | ................................. | ఖమాస్ |
| 238. | ఆడరమ్మ పాడరమ్మ | ................................. | అమృతవర్షిణి |
| 239. | ఆదిమ పూరుషుడు | ................................. | దేశ్ |
| 240. | ఆలించు పాలించు | ................................. | ఆనందభైరవి |
| 241. | ఆహా! నమోనమో | ................................. | బృందావని |
| 242. | ఇటునిను తెలియగ | ................................. | శ్రీరంజని |
| 243. | ఇతనికంటె ఘనులికలేరు | ................................. | శ్రీరాగం |
| 244. | ఇతని కంటె మరి | ................................. | మోహన |
| 245. | ఇతరులకు నిను నెఱగతరమా | ................................. | శ్రీరాగం |
| 246. | ఇదియెనాకు మతము | ................................. | మోహనకల్యాణి |
| 247. | ఇదియే సులభము | ................................. | అభేరి |
| 248. | ఇదివో వున్నారము | ................................. | శుద్ధధన్యాసి |
| 249. | ఇదె శిరసు మాణిక్య | ................................. | రామక్రియ |
| 250. | ఇన్నియు చదువనేల | ................................. | వకుళాభరణం |
| 251. | ఇరువగు వారికి | ................................. | కళ్యాణి |
| 252. | ఇహపరసాధనమిది | ................................. | మలయమారుతం |
| 253. | ఇంతకంటే ఘనమికలేదు | ................................. | సురటి |
| 254. | ఇందిర నామము | ................................. | హంసానంది |
| 255. | ఈతడే ఈతడే | ................................. | సాలంగనాట |

| | | |
|---|---|---|
| 256. | ఈ రూపమై వున్నాడు | శుద్ధధన్యాసి |
| 257. | ఉదయాద్రి తెలుపాయె | చంద్రిక (మిశ్ర) |
| 258. | ఎదుట ఎవ్వరు లేరు | హిందోళం |
| 259. | ఎన్ని మహిమల వాడే | కళ్యాణి |
| 260. | ఎటిగితి | కానడ |
| 261. | ఎండగాని నీడగాని | నీలాంబరి |
| 262. | ఎంత విభవము కలిగె | శుద్ధసావేరి |
| 263. | ఏడకేడ నీ చరితము | కాంభోజి |
| 264. | ఏడ వలపేడ | రేవతి |
| 265. | ఏదితుద దీనికేది | గోరక్ కల్యాణ్ |
| 266. | ఏమి చెప్పేది | రంజని |
| 267. | ఓహో నిలిచిన దొకటిదియే | శ్రీరాగం |
| 268. | కటా కటా యిటు చేసె | రేవతి |
| 269. | కడు నడుచు | ముఖారి |
| 270. | కన్నుల పండుగలాయ | బిలహరి |
| 271. | కలదు తిరుమంత్రము | దేవగాంధారి |
| 272. | కలశాపురముకాడ | వసంత |
| 273. | కలిగె మాకిదే | లలిత |
| 274. | కలియుగ మెటులైన | హింధోళం |
| 275. | కందర్ప జనక | వలజి (మిశ్ర) |
| 276. | కాదనకు నామాట | మోహన |
| 277. | కొనరో కొనరో | మోహన |
| 278. | కొమ్మలు చూడరే | మోహన |
| 279. | కొలిచిన వారల కొంగు | కాంభోజి |
| 280. | కొండ వేల | కేదార గౌళ |
| 281. | గతులన్నిఖిలమైన | మోహన |
| 282. | గరుడ ధ్వజం బెక్కె | మోహన |
| 283. | ఘోర విదారణ | రాగమాలిక |
| 284. | చాటెద నిదియే | శుద్ధసావేరి |
| 285. | చూడుడిందరికి | భైరవి |
| 286. | జపియించరె | బిలహరి |
| 287. | జయము జయము ఇక | సావేరి |
| 288. | తలచి చూడ | మోహన |
| 289. | తలపు లోపలి | వసంతం |
| 290. | తానె తానె ఇందరి | శుద్ధధన్యాసి |
| 291. | త్రికరణశుద్ధిగా | చక్రవాకం |
| 292. | తొల్లియును మట్టాకు | రాగమాలిక |
| 293. | దీనరక్షకుడు | మధువని |
| 294. | దేవ దేవోత్తమ తే | యదుకులకాంభోజి |
| 295. | దేవ యీాతగవు | మలహరి |
| 296. | నగుమొగముతోడి | మాళవి |
| 297. | నటనల భ్రమయకు | లలిత |
| 298. | నడవరో జడియక | ఆదితాళము |
| 299. | నమో నమో జగదేకనాథ | సారమతి |
| 300. | నమోనమో దశరథ | ద్విజావంతి |
| 301. | నమో నమో లక్ష్మీనరసింహా | పూర్ణచంద్రిక |
| 302. | నమో నారాయణాయ నమః | మోహన |
| 303. | నారాయణా నిను | జయంత శ్రీ |
| 304. | నారాయణుడీతడు | మోహన |
| 305. | నిత్యాత్ముడై యుండి | హిందోళం |
| 306. | నీకే శరణంటి | సింహేంద్రమధ్యమం |
| 307. | నీటముంచు పాలముంచు | శహన |
| 308. | నీదాసుల భంగములు | మలయమారుతం |
| 309. | నీవు జగన్నాథుడవు | భైరవి |
| 310. | నీవు దేవుడవు | సింధుభైరవి |
| 311. | అజ్ఞానులకివి | దేశి |
| 312. | అడుగరె ఈమాట | బేగడ |
| 313. | అతని పాడెదను | సరస్వతి |
| 314. | అదెచూడరయ్య | భౌళి |
| 315. | అదెలంక సాధించె | కీరవాణి |
| 316. | అపుడేమనె నేమను | అభోగి |
| 317. | అప్పులేని సంసారము | మిశ్రమలహరి |
| 318. | అహోబలేశ్వరుడు | శ్రీరాగం |
| 319. | అంతరంగమెల్ల శ్రీహరికి | హుసేని |
| 320. | అందరికి నెక్కుడైన | కన్నడ |
| 321. | అందరిలోనా నెక్కుడు | నాట |
| 322. | ఆడరమ్మ పాడరమ్మ | ఖరహరప్రియ |
| 323. | ఆణికాడవట | దుర్గ |
| 324. | ఆదిదేవ పరమాత్మా | సింధుభైరవి |
| 325. | ఇతడే యతడు | ఖమాస్ |
| 326. | ఇదిగాక సౌభాగ్యమిదిగాక | కాంభోజి |
| 327. | ఇందిర వడ్డించ | కళ్యాణి |
| 328. | ఈడగుపెండ్లి | మధ్యమావతి |
| 329. | ఈతడు తారక బ్రహ్మ | హిందోళం |
| 330. | ఈపెకు ఇతడు తగు | కళ్యాణి |
| 331. | ఉన్నమంత్రా లిందు సరా | అభోగి |
| 332. | ఎటువంటి మోహమో | సామ |
| 333. | ఎదుటనున్నాడు వీడె | భుజంగిణి |
| 334. | ఎంత కాలమో కదా | శ్రీరాగం |
| 335. | ఎంతనేరుపరి ఈ లేమ | కళ్యాణి |
| 336. | ఒక్కడే ఏకాంగ వీరుడుర్వికి | తోడి |
| 337. | కడుపెంత తాకుడుచు | గుండక్రియ |
| 338. | కానరటేపెంచరటే | ఆఠాణా |
| 339. | కేశవదాసి నైతి | సింధుభైరవి |
| 340. | కొలనిలోన | ముఖారి |

| No. | | |
|---|---|---|
| 341. | ఘుమ్మనియెడి శ్రుతి | పూర్వీకల్యాణి |
| 342. | చాలుఁజాలును | శుద్ధ ధన్యాసి |
| 343. | చిత్తజ గురుడ ఓ | మధ్యమావతి |
| 344. | చిరంతనుడు శ్రీవరుడు | ముఖారి |
| 345. | చూడచూడ నింతలోనె | ఆనంద భైరవి |
| 346. | చూడ పిన్నవాడు గాని | ఆనందభైరవి |
| 347. | చూడవయ్య నీ సుదతి | నాటకురంజి |
| 348. | జవ్వాది మెత్తినది | శంకరాభరణం |
| 349. | తగుదువమ్మ | బృందావని |
| 350. | తత్తాతిగుడి ధింధిం | మోహన |
| 351. | తనకేడ | సామ |
| 352. | తలమేల కులమేల | సావేరి |
| 353. | తానే కాకెవ్వరు | సామంతం |
| 354. | తిరువీధు లేగీని | మోహన |
| 355. | తిరొతిరొ జవరాల | గంభీరనాట |
| 356. | తుద సమస్తమును | ఆదితాళము |
| 357. | తెలియ చీకటికి | నీలాంబరి |
| 358. | తొల్లింటి వలెగావు తుమ్మెదా | శ్రీరాంగం |
| 359. | దిబ్బలు వెట్టుచు | ఖరహరప్రియ |
| 360. | దేవదుందుభులతోడ | ఖరహరప్రియ |
| 361. | దేహినిత్యుడు | తోడి |
| 362. | దొరకునా యితని కృప | సామంతం |
| 363. | ధారుణీ పతికిని | మధ్యమావతి |
| 364. | నమామ్యహం | కేదారగౌళ |
| 365. | నందనందన వేణునాద | అభేరి |
| 366. | నాటికినాడే నాచదువు | వలజ |
| 367. | నానా దిక్కుల నరులెల్లా | ఆహిరి |
| 368. | నారాయణాయ నమో నమో | మిశ్రదేశ్ |
| 369. | నాలం వా తవ | బృందావని |
| 370. | నిద్దిరించీ పాల జలనిధి | మధ్యమావతి |
| 371. | నిమిషమెడతెగక | మాళవిగౌళ |
| 372. | నీ కథామృతము | బేగడ |
| 373. | నీడల చూపులు | మధ్యమావతి |
| 374. | నీవనగ నొకచోట | సామంతం |
| 375. | నీవు తురగము మీద | అఠాణా |
| 376. | నీవె మాకు దిక్కు | వలజ |
| 377. | నీవేమి సేతువయ్యా | భైరవి |
| 378. | నేడే నాగవెల్లి | భైరవి |
| 379. | నేడె పెళ్ళివేళ | అభేరి |
| 380. | నేనెందువోయే | తెలుగు కాంభోజి |
| 381. | నేనే పో ఘనుడను | దేసాళం |
| 382. | నే నొక్కడ లేకుండితే | భౌళిరామక్రియ |
| 383. | నేలమిన్ను ఒక్కటైన | గౌళ |
| 384. | పదియారు వన్నెల | వరాళి |
| 385. | పరమ పాతకుడ | హంహానంది |
| 386. | పరమయోగీశ్వరుల | ఖరహరప్రియ |
| 387. | పరమాత్ముని | కేదారగౌళ |
| 388. | పరుల సేవలు చేసి | బేగడ |
| 389. | పలుమరు వుట్ల | ముఖారి |
| 390. | పలువిచారములేల | షణ్ముఖప్రియ |
| 391. | పంకజాక్షులు | కళ్యాణి |
| 392. | పాడైన ఎరుకతో | లాస్యవతి |
| 393. | పాపపుణ్యముల | కామవర్ధని |
| 394. | పాపినైన నాపాల గలిగి తోవ | సామంతం |
| 395. | పాలదొంగవద్ద వచ్చి | మోహన |
| 396. | పుట్టు భోగులము | భైరవి |
| 397. | పుట్టెది దింతా | శివరంజని |
| 398. | పుడమి నిందరి | వరాళి |
| 399. | పులకల మొలకల పున్నమ | వసంత |
| 400. | పూజలందరుచేసేదే | హంసనాదం |
| 401. | పెట్టని కోటిందరికి | ఆనందభైరవి |
| 402. | పెరిగినాడు చూడరో | మోహన |
| 403. | పొలయలుక | భూపాళం |
| 404. | బండి విరిచి పిన్నపాపలతో | ధన్యాసి |
| 405. | బంగారు మేడలలోన | మధ్యమావతి |
| 406. | భారకు డతడే | యమన్ |
| 407. | భారమై వేపమాను | సామ |
| 408. | భోగీంద్రులనుమీరు | ఆనందభైరవి |
| 409. | మతంగ పర్వతమాడ | శంకరాభరణం |
| 410. | మత్స్య కూర్మ వరాహ | కాఫీ |
| 411. | మనసిజ సముద్ర | శంకరాభరణం |
| 412. | మరలి మరలి జయమంగళము | మధ్యమావతి |
| 413. | మఱి యెందూ గతిలేదు | సారమతి |
| 414. | మర్దమర్ద | నాట |
| 415. | మఱచితిమంటే | లలిత |
| 416. | మంగళము గోవిందునకు | సురటి |
| 417. | మందరధర మధుసూదన | బిలహరి |
| 418. | మాధవ భూధవ | శివరంజని |
| 419. | మాయా మోహము | దేవగాంధారి |
| 420. | మిన్నకవేసాలుమాని | కీరవాణి |
| 421. | మూడే మాటలు | హిందోళవసంతం |
| 422. | మూలమూల నమ్ముడు | శ్రీరాగం |
| 423. | మెరుగువంటిది | ఖమాస్ |
| 424. | మేలుకొనవే | భౌళి |

425. మేలుకో శృంగారరాయ ................................ మలయమారుతం
426. మొక్కరో పరుషలు ................................ మోహన
427. యజ్ఞమూర్తి యజకర్త ................................ ఖమాస్
428. యోగి భోగి నటనం ................................ భౌళి
429. రచ్చ కెక్కివితివి ................................ దేశ్
430. రమణుడు పిలిచీని ................................ నటహిందోళం
431. రాధా మాధవ ................................ హిందోళం
432. రామభద్ర రఘువీర ................................ ఆనందభైరవి
433. రామ రామ రామకృష్ణ ................................ కల్యాణ
434. రామా ధశరథరామా ................................ విశారద
435. రారా చిన్నన్న ................................ ఝుంఝూటి
436. రావే కోడల ................................ యదుకల కాంభోజి
437. లక్ష్మీ కళ్యాణము ................................ మధ్యమావతి
438. లెండో లెండో ................................ చారుకేశి
439. వచ్చెను అలమేలుమంగ ................................ హిందోళం
440. వట్టి లంపటాల ................................ శంకరాభరణం
441. వద్దేగొల్లెత ................................ మధ్యమావతి
442. వన నిధి కురిసిన ................................ హమీర్ కళ్యాణి
443. వలచి వచ్చితి నేను ................................ హంసానంది
444. వలదన నొరులకు ................................ కల్యాణి
445. వలపుల సొలపుల ................................ మోహన
446. వలపులు వలపులు ................................ శంకరాభరణం
447. వలెననువారిదె ................................ మలయమారుతి
448. వందేహం జగద్వల్లభం ................................ హంసధ్వని
449. వాడల వాడల వెంట ................................ శ్రీరాగం
450. వాడల వాడల వెంట ................................ మధ్యమావతి
451. వాడివో కంటిరటరే ................................ హిందోళం
452. వాడె వేంకటేశుడనే వాడే వీడు ................................ రసికరంజని
453. వాడెవో ప్రహ్లాద వరదుడు ................................ గౌళ
454. విజాతులన్నియు వృధా వృధా ................................ మిశ్రమలహరి
455. విడువుము మనసా ................................ భాగేశ్వరి
456. విభుడ వింతటికి ................................ శహన
457. విభుని వినయములు ................................ ధర్మవతి
458. విరహపురాజదె ................................ తోడి
459. వీడుగదె శేషుడు ................................ నాగగాంధారి
460. వీడెవో యిదె ................................ మోహన
461. వీధుల వీధుల ................................ శుద్ధసావేరి
462. వెదకిన నిదియే ................................ షణ్ముఖప్రియ
463. వెనకేదో ముందరేదో ................................ హుసేని
464. వేదములు నుతించగ ................................ మోహన
465. వేదములే నీ నివాసమట ................................ మధ్యమావతి
466. వేదం బెవ్వని ................................ రేవతి

467. వేవేలచందాల వాడు ................................ హమీర్ కల్యాణి
468. శరణం బితడే ................................ హమీర్ కళ్యాణి
469. శ్రీపతి పురనాయక ................................ భౌళి
470. శ్రీహరి నిత్యశేషగిరీశ ................................ భైరవి
471. శ్రీహరి చేసిన చిహ్నాలివి ................................ సింధుభైరవి
472. శోభనమే శోభనమే ................................ రీతిగౌళ
473. సకల బలంబులు ................................ మోహన
474. సకలము చదివిన ................................ శుద్ధ ధన్యాసి
475. సకలశాంతి కరము ................................ బహుదారి
476. సకల సంగ్రహము ................................ వసంత
477. సకలం హేసఖి ................................ విధుమణి
478. సచరా చర మిదే ................................ ఖరహరప్రియ
479. సముఖ ఎచ్చరిక ................................ కాంభోజి
480. సర్వేశ్వరుడే ................................ ఖణ్ముఖ ప్రియ
481. సందడి సొమ్ముల తోడి ................................ కాఫీ
482. సామాన్యమా పూర్వసంగ్రహంబగు ................................ ధన్యాసి
483. సిరితొడపైనిడి ................................ మోహన
484. సింగార మూరితివి ................................ ఖమాస్
485. సుగ్రీవ నారసింహ ................................ తోడి
486. సుముఖ మంగళము ................................ కానడ
487. సువ్వి సువ్వి సువ్వని ................................ కేదారగౌళ
488. సోదించిరిదియే ................................ శుద్ధ సావేరి
489. హరి గొలిచియు మరి ................................ అభేరి
490. హరినిన్ను పిలిచీని ................................ ఖరహరప్రియ
491. హరీ నీప్రతాపమున ................................ హిందోళం
492. హరి నీ మయమే ................................ దర్బార్ కానడ
493. హరి నీ యనుమతో ................................ మోహన
494. హరియే ఎరుగును ................................ హంసధ్వని
495. హరి రసమ విహరి ................................ హిందోళం
496. హరికృష్ణే మేలుకొను ................................ భౌళి

శరణంటి మాతని ................................ లలిత
దినముద్వాదశి ................................ శ్రీరాగం
హరియవతారమీతడు ................................ మాళవిగౌళ
హరియవతారమె ................................ సౌరాష్ట్రం
అప్పని వరప్రసాది ................................ తిలంగ్



నిత్యాయ నిరవద్యాయ సత్యానంద చిదాత్మనే
సర్వాంతరాత్మనే శ్రీమద్వేంకటేశాయ మంగళమ్ 4
శ్రీ వైంకుఠవిరక్తాయ స్వామిపుష్కరిణీతటే
రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళమ్ 5
శ్రీమత్సుందరజామాతృ మునిమానసవాసినే
సర్వలోక నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ 6
మంగళాశాసనపరైః మదాచార్యపురోగమైః
సర్వైశ్చ పూర్వై రాచార్యైః సత్కృతాయాస్తు మంగళమ్ 7

శ్రీ పద్మావతీ సమేత శ్రీశ్రీనివాస పరబ్రహ్మణే నమః







## 1. అంగన లీరె ఆరతులు

అంగన లీరె ఆరతులు
అంగజ గురునకు నారతులు ॥
శ్రీదేవి తోడుత చెలగుచు నవ్వే
ఆదిమ పురుషుని కారతులు
మేదినీ రమణి మేలము లాడేటి
ఆదిత్య తేజున కారతులు ॥
సురలకు నమృతము సొరిది నొసంగిన
హరి కిదివో పసిడారతులు
తరమిది దుష్టుల దనుజుల నడచిన
అరిభయంకరున కారతులు ॥
నిచ్చలు కల్యాణ నిధియై యేగేటి
అచ్చుతునకు నివె యారతులు
చొచ్చి శ్రీ వేంకటేశుడు నలమేల్మంగ
యచ్చుగ నిలిచిరి యారతులు ॥

## 2. అణురేణు పరిపూర్ణ

అణురేణు పరిపూర్ణమైన రూపము
అణిమాది సిరి అంజనాద్రి మీది రూపము ॥
వేదాంతవేత్తలెల్లా వెదకేటి రూపము
ఆదినంత్యములేని ఆ రూపము
పాదు యోగీంద్రులు భావించురూపము
ఈ దశనిదివో కోనేటిదరి రూపము ॥
పాలజలనిధిలోన బవళించే రూపము
కాలసూర్యచంద్రాగ్ని గల రూపము

మేలిమి వైకుంఠాన మెరసిన రూపము
కీలైనదిదే శేషగిరిమీది రూపము ॥

ముంచిన బ్రహ్మాదులకు మూలమైన రూపము
కొంచని మఱ్ఱాకు మీది గొనరూపము
మంచి పరబ్రహ్మమై మమ్మునేలిన రూపము
ఎంచగ శ్రీ వేంకటాద్రి నిదెరూపము ॥

## 3. అతడే పరబ్రహ్మా

అతడే పరబ్రహ్మమతడే లోకనాయకుడు
అతని కంటే మరి అధికులు వేరయ్యా !

కమలవాసిని లక్ష్మి కలదా యెవ్వరికైనా
కమలనాభునికి ఒక్కనికే గాక
కమలజుడైన బ్రహ్మ కలడా యెవ్వని నాభి –
నమరవంద్యుడు మా హరికే గాక

అందరు నుండెడి భూమి అన్యులకు గలదా
అందపు గోవిందునికే ఆలాయగాక
చెందిన భాగీరథి శ్రీపాదాల గలదా
మందర ధరుడయిన మాధవునికి గాక

నిచ్చలు అభయమిచ్చే నేరుపు యెందుగలదా
అచ్చుగ నారాయణునియందేగాక
రచ్చల శరణాగతరక్షణ మెందు గలదా
తచ్చిన శ్రీ వేంకటాద్రి దైవానికేకాక

## 4. అదివో అల్లదివో

అదివో అల్లదివో హరివాసము
పదివేలు శేషుల పడగలమయము ॥





అదె వేంకటాచల మఖిలోన్నతము
అదివో బ్రహ్మాదుల కపురూపము
అదివో నిత్యనివాస మఖిలమునులకు
అదె చూడుడదె మ్రొక్కుడానందమయము ॥

చెంగట నల్లదివో శేషాచలము
నింగినున్నదేవతల నిజవాసము
ముంగిట నల్లదివో మూలనున్నధనము
బంగారు శిఖరాల బహు బ్రహ్మమయము ॥

కైవల్యపదము వేంకటనగమదివో
శ్రీ వేంకటపతికి సిరులైనది
భావింప సకల సంపదరూపమదివో
పావనములకెల్ల పావనమయము ॥

## 5. అదె చూడరే మోహన

అదె చూడరే మోహన రూపం
పది కోట్లు గల భావజరూపం ॥

వెలయగ పదారువేల మగువలను
అలమిన ఘనమోహన రూపం
వలచిన నందవ్రజము గొల్లెతల
కులుకు చూపులకు గురియగు రూపం ॥

ఇందిరా వనిత నెప్పుడు తన వుర –
మందు నిలిపిన మోహన రూపం
కందువ భూసతి కౌగిటి సొంపుల
విందులు మరిగిన వేడుక రూపం ॥

త్రిపుర సతుల బోధించి రమించిన
అపురూపపు మోహనరూపం

కపురుల శ్రీ వేంకటపతియై ఇల
ఉపమించగరాని వున్నత రూపం ॥

## 6. అనంత మహిముడవు

అనంత మహిముడవు అనంత శక్తివి నీవు
ఎనలేని దైవమా ! నిన్నేమని నుతింతును ?
అన్ని లోకములు నీ యందునున్న వందురు నీ
వున్నలోక మిట్టిదని వూహించరాదు
ఎన్ననీవు రక్షకుఁడ విందరిపాలిటికి
నిన్ను రక్షించేటివారి నే నెవ్వరినందును
తల్లివి దండ్రివి నీవు తగు బ్రహ్మాదులకు
ఎల్లగా నీ తల్లిదండ్రు లెవ్వరందును
ఇల్లిదె వరములు నీ విత్తు విందరికిని
చెల్లఁబో నీ కొకదాత చెప్పఁగఁజోటేది
జీవుల కేలికవు శ్రీ వేంకటేశుఁడవు నీ
వేవలఁజూచిన నీకే యేలికే లేఁడు
వేవేలు మునులును వెదకేరు నిన్నును
నీ వెవ్వరి వెదకేవు నిర్మలమూరితివి

## 7. అనరాదు వినరాదు

అనరాదు వినరాదు ఆతని మాయలు నేఁడు
దినదిన క్రొత్తలాయ ద్రిష్టమిదే మాకు ॥
ఆడెడి బాలుల హరి అంగిలి చూపుమని
తోడనే వాండ్ల నోర దుమ్ములు చల్లి
యీడ మాతోఁజెప్పఁగాను యిందరముఁ గూడిపోయి
చూడఁబోతే పంచదారై చోద్యమాయనమ్మా ॥





తీఁట తీగెలు సొమ్మంటా దేహము నిండాఁగట్టె
తీఁటకుఁగాక బాలులు తెగి వాపోఁగా
పాటించి యీసుద్ది విని పారితెంచి చూచితేను
కోటి కోటి సొమ్ములాయ కొత్తలో యమ్మా ॥
కాకిజున్ను జున్ను లంటా గంపెఁడేసి తినిపించి
వాకొలిపి బాలులెల్ల వాపోవఁగా
ఆకడ శ్రీవెంకటేశుఁడా బాలుల కంటి నీరు
జోకగ ముత్యాలు సేసెఁజూడఁగానే నేము ॥

## 8. అనియానతిచ్చె

అనియానతిచ్చె కృష్ణుడర్జునునితో
విని యాతని భజించు వివేకమా ॥
భూమిలోను చొచ్చి సర్వభూత ప్రాణులనెల్ల
దీమసాన మోచేటి దేవుడ నేను
కామించి సస్యములు కలిగించి చంద్రుడనై
తేమల పండించేటి దేవుడ నేను ॥
దీపనాగ్నినై జీవదేహముల అన్నములు
తీపుల నరగించేటి దేవుడ నేను
ఏపున నిందరిలోని హృదయములోన నుందు
దీపింతు తలపు మరపై దేవుడ నేను ॥
వేదము లన్నిటిచేత వేదాంతవేత్తలచే
ఆది నే నెరగతగిన ఆ దేవుడను
శ్రీదేవితో గూడి శ్రీ వేంకటాద్రి మీద
పాదైన దేవుడను భావించ నేను ॥

## 9. అన్నిటా భాగ్యవంతుడ

అన్నిటా భాగ్యవంతుడ వవుదువయ్యా
పన్నినందుకల్లా వచ్చు భామ నీ కిపుడు ॥

పడతి మోహరసము పన్నీటి మజ్జనము
కడలేని ఆపె సిగ్గు కప్పురకాపు
నిడుదకన్ను చూపులు నించిన తట్టుపునుగు
తొడిబడ సులభాన దొరకె నీ కిపుడు ॥

కామిని కెమ్మోవికాంతి కట్టుకొనే చంద్రకావి
ఆముకొన్న మోముకళలు ఆభరణాలు
దోమటి మాటలవిందు ధూపదీప నైవేద్యాలు
కామించినటువలెనే కలిగె నీ కిపుడు ॥

అలమేలు మంగనవ్వులు అంగపు పువ్వుదండలు
కలసి వురాన నీకె కట్టిన తాళి
చలపట్టి ఈకె రతి సకలసంపదలు
ఇలనబ్బె శ్రీ వేంకటేశ నీకు నిపుడు ॥

## 10. అన్నిటికినిది

అన్నిటికి నిది పరమౌషధము
వెన్నుని నామమే విమలౌషధము ॥

చిత్తశాంతికిని శ్రీపతినామమె
హత్తిన నిజ దివ్యౌషధము
మొత్తపు బంధ విమోచనంబునకు
చిత్తజగురుడే సిద్ధౌషధము ॥

పరిపరి విధముల భవరోగములకు
హరిపాదజలమె ఔషధము
దురిత కర్మముల తొలగించుటకు
మురహర పూజే ముఖ్యౌషధము ॥

యిల నిహపరముల ఇందిరా విభుని
అలరి భజింపుటె ఔషధము





కలిగిన శ్రీ వేంకటపతి శరణమే
నిలిచిన మాకిది నిత్యౌషధము ॥

## 11. అన్నిమంత్రములు

అన్ని మంత్రములు ఇందే ఆవహించెను
వెన్నతో నాకు కలిగె వేంకటేశుమంత్రము ॥

నారదుడు జపియించె నారాయణ మంత్రము
చేరె ప్రహ్లాదుడు నారసింహమంత్రము
కోరి విభీషణుడు చేకొనె రామమంత్రము
వేరెనాకు గలిగె వేంకటేశుమంత్రము ॥

రంగగు వాసుదేవమంత్రము ధ్రువుడు జపియించె
అంగవించె కృష్ణమంత్రము అర్జునుడు
ముంగిట విష్ణుమంత్రము మొగి శుకుడు పఠించె
వింగడమైనాకు నబ్బె వేంకటేశుమంత్రము ॥

ఇన్ని మంత్రములకెల్ల ఇందిరానాథుడే గురి
పన్నిన దిదియే పరబ్రహ్మమంత్రము
నన్ను కావ గలిగెపో నాకు గురుడియ్యగాను
వెన్నెల వంటిది శ్రీ వేంకటేశుమంత్రము ॥

## 12. అభయదాయకుడ

అభయదాయకుడ వదె నీవే గతి
యిభరక్షక నను నిపుడు గావవే ॥

భయహర దైతేయభంజన కేశవ
జయజయ నృసింహ సర్వేశ్వరా
నియతము మాకిదె నీపాదములే గతి
క్రియగా మమ్మేలి కింక లుడుపవే ॥

బంధవిమోచన పాపవినాశన
సింధురవరదా శ్రితరక్ష
కంధరవర్ణుడ గతి నీనామమె
అంధకారముల నణచి మనుపవే ॥
దైవశిఖామణి తతచక్రాయుధ
శ్రీ వేంకటగిరి శ్రీ రమణా
సావధాన నీశరణ్యమే గతి
వేవేలకు నావిన్నప మిదియే ॥

## 13. అయమేవ అయమేవ

అయమేవ అయమేవ ఆదిపురుషో
జయకరం తమహం శరణం భజామి ॥
అయమేవ ఖలుపురా అవనీధరస్తు సో –
ప్యయమేవ వటదళాగ్రాధిశయనః
అయమేవ దశవిధైరవతార రూపశ్చ
నయమార్గ భువిరక్షణం కరోతి ॥
అయమేవ సతతం శ్రియఃపతిర్దేవేషు
అయమేవ దుష్టదైత్యాంతకస్తు
అయమేవ సకల భూతాంతరేష్వాక్రమ్య
ప్రియభక్త పోషణం ప్రీత్యాతనోతి ॥
అయమేవ శ్రీ వేంకటాద్రౌ విరాజతే
అయమేవ వరదోపి యాచకానాం
అయమేవ వేదవేదాంతైశ్చ సూచితో
అయమేవ వైకుంఠాధీశ్వరస్తు ॥

## 14. అరసి వేరొకచో

అరసి వేరొకచో ముక్తడుగఁగవలదు
సారపులౌకిక విమోచనమే ముక్తి





మొగిఁబుణ్య పాపవిముక్తియే ముక్తి
వెగటుఁబ్రపంచపు విముక్తే ముక్తి
తగులు సంసారబంధవిముక్తే ముక్తి
జగములోఁ గలుగుయాశాముక్తే ముక్తి
కామక్రోధాదిసంగ విముక్తే ముక్తి
వేమారు రుచులపై విముక్తే ముక్తి
నాముల దేహాభిమానపుముక్తే ముక్తి
పామెడి కోరికల సంపదముక్తే ముక్తి
ముందువెనకల కర్మమోచనమే ముక్తి
అంది సుఖదుఃఖభయముక్తే ముక్తి
కందువ శ్రీ వేంకటేశుఁగని యందే శరణని
విందుల నితరసేవావిముక్తే ముక్తి

## 15. అరుదీకపీంద్రుని

అరుదీకపీంద్రుని అధిక ప్రతాపము
సురలకు నరులకీసుద్దు లెందు గలవా ॥
ఉదయాచలము మీదినొక్కజంగ చాచుకొని
ఉదుటున నపరాద్రి నొక్కజంగ చాచుకొని
తుద సూర్యమండలము తోడ మోము దిప్పుకొంటా
పెదవు లెత్తి చదివె పెద్దహనుమంతుడు ॥
వొక్కమొలగంట చంద్రు డొక్క మొలగంట రవి
చుక్కలు మొలపూసలై చూపట్టగా
నిక్కిన వాలాగ్రమందు నిండిన బ్రహ్మలోకము
పిక్కటిల్ల పెరిగెను పెద్దహనుమంతుడు ॥
పిడికిలించిన చేత బిరుదులపండ్లగొల
తడయక కుడిచేత దశదిక్కుల

జడియక శ్రీవేంకటేశ్వరుని మన్ననబంటు
బెడిదపు మహిమల పెద్దహనుమంతుడు ॥

## 16. అలమేలుమంగ

అలమేలుమంగ నీ వభినవ రూపము
జలజాక్షు కన్నులకు చవులిచ్చేవమ్మా ॥
గరుడాచలాధీశు ఘనవక్షమున నుండి
పరమానంద సంభరితవై
నెరతనములు చూపి నిరంతరము నాథుని
హరుషించగ జేసితి గదమ్మా ॥
శశికిరణములకు చలువల చూపులు
విశదముగా మీద వెదచల్లుచు
రసికతపెంపున కరగించి యెప్పుడు నీ
వశము చేసుకొంటి వల్లభు నోయమ్మా ॥
రట్టడి శ్రీ వేంకట రాయనికి నీవు
పట్టపురాణివై పరగుచు
వట్టి మాకు లిగిరించు వలపుమాటల విభు –
జట్టిగొని వురమున సతమైతివమ్మా ॥

## 17. అలమేలుమంగా

అలమేలుమంగా హరియంతరంగా
కలితనాట్య రంగా కరుణాపాంగా
అలినీలవేణి అంబుజపాణి
వెలయుగ జగదేక విభునిరాణి
స్మితచంద్రవదనా సింగార సదనా
చతుర దాడిమ బీజచయసనా





హితవైన శ్రీ వేంకటేశుడిదే ననుగూడె
పతి తలపోతల సమకూడె కూడె

## 18. అలరచంచలమైన

అలర చంచలమైన ఆత్మలందుండ నీ
అలవాడు సేసె నీ వుయ్యాల
పలుమారు నుచ్ఛ్వాస పవనమందుండ నీ
భావంబు దెలిపె నీ వుయ్యాల ॥
ఉదయాస్తశైలంబు లొనర కంబములైన
వుడుమండలము మోచె వుయ్యాల
అదన ఆకాశపదము అడ్డదూలంబైన
అఖిలంబు నిండె నీ వుయ్యాల ॥
పదిలముగ వేదములు బంగారు చేరులై
పట్టవెరపై తోచె నుయ్యాల
వదలకిటు ధర్మదేవత పీఠమై మిగుల
వర్ణింప నరుదాయె వుయ్యాల ॥
మేలుకట్లయి మీకు మేఘ మండలమెల్ల
మెరుగునకు మెరుగాయ నుయ్యాల
నీలశైలమువంటి నీ మేనికాంతికి
నిజమైన తొడవాయె వుయ్యాల ॥
పాలిండ్లు కదలగా పయ్యదలు రాపాడ
భామినులు వడినూచు నుయ్యాల
వోలి బ్రహ్మాండములు వొరగునోయని భీతి ...
నొయ్యనొయ్యన వూచిరుయ్యాల ॥
కమలకును భూసతికి కదలు కదలుకు మిమ్ము
కౌగిలింపగ జేసె నుయ్యాల

అమరాంగనలకు నీ హావ భావ విలాస ...
మందంద చూపె నీ వుయ్యాల ॥
కమలాసనాదులకు కన్నులకు పండుగై
గణుతింప నరుదాయె వుయ్యాల
కమనీయ మూర్తి వేంకటశైలపతి నీకు
కడువేడుకై యుండె నుయ్యాల ॥

## 19. అలరులు కురియగ

అలరులు కురియగ నాడెనదే
అలకల కులుకుల నలమేల్మంగ ॥
అరవిరి సొబగుల నతివలు మెచ్చగ
అరతెర మరుగన నాడెనదే
వరుసగ పూర్వదువాళపు తిరుపుల
హరి కరగింపుచు నలమేల్మంగ ॥
మట్టపు మలపుల మట్టెల కెలపుల
తట్టెడి నడపుల దాటెనదే
పెట్టిన వజ్రపు పెండెపుతళుకులు
అట్టిటు చిమ్ముచు నలమేల్మంగ ॥
చిందుల పాటల సిరిపొలయాటల
అందెల మ్రోతల నాడెనదే
కందువ తిరు వేంకటపతి మెచ్చగ
అందపు తిరుపుల నలమేల్మంగ ॥

## 20. అలవటపత్రశాయివైన

అలవటపత్రశాయివైన రూపము ఇట్టిదని
కొలువై పొడచూపేవా గోవిందరాజా ॥





పడతు లిద్దరి మీద పాదములు చాచుకొని
ఒడికపు రాజసాన నొత్తిగిలి
కడలేని నిజనాభికమలమున బ్రహ్మను
కొడుకుగా కంటివిదె గోవిందరాజా ॥
సిరుల సొమ్ములతోడ శేషునిపై పవళించి
సొరిది దాసుల కృప జూచుకొంటాను
పరగు దైత్యుల మీద పాముదవిషములే నీవు
కురియించితివిగా గోవిందరాజా ॥
శంకు చక్రములతోడ చాచినకరముతోడ
అంకెల శిరసుకింది హస్తముతోడ
తెంకిని శ్రీ వేంకటాద్రి దిగువతిరుపతిలో
కొంకక వరములిచ్చే గోవిందరాజా ॥

## 21. అలుకలు చెల్లవు హరి

అలుకలు చెల్లవు హరిపురుషోత్తమ
నలి నిందిర నీతో నవ్వినది ॥
ఆదిలక్ష్మి మోహన కమలంబున
వేదమాత నిను వేసినది
ఆదెస నీపై నభయహస్తమును
సాదరమున గడు చాచినది ॥
సిరి తనకన్నుల చింతామణులను
పొరి నీపై దిగబోసినది
వరద హస్తమున వలచెయి వట్టుక
అరుదుగ నిను మాటాడించినది ॥
జలధికన్య తన సర్వాంగంబుల
పిలిచి నిన్ను నిటు పెనగినది

అలముక శ్రీ వేంకటాధిప నిను రతి -
నెలమి నీవురం బెక్కినది ॥

## 22. అంగనకునీవే

అంగనకు నీవే అఖిలసామ్రాజ్యము
శృంగార రాయ నీకు శ్రీసతి నిధానము ॥

కమలాలపానుపు కాంతకు నీవురము
ప్రమదపు నీమనసు పాలజలధి
అమరు నీభుజాంతర మట్టె తీగ పొదరిల్లు
రమణీయ హారాలు రతనాల మేడలు ॥

సతికినీ మెడరతి సాముసేసే కంబము
ప్రతి లేని వయ్యాళి బయలు నీవు
మతించిన కౌస్తుభమణి నిలువుటద్దము
మితిలేని శ్రీ వత్సము మించు బండారు ముద్ర ॥

నెమ్మి నలమేల్మంగ నీకాగిలి పెళ్లిపీట
చిమ్ముల చందన చర్చ సేసపాలు
వుమ్మడి మెడనూళ్ళా ఉయ్యాల సరపణులు
పమ్మి శ్రీ వేంకటేశ నీ భావమే భాగ్యము ॥

## 23. అంతయు నీవే హరి

అంతయు నీవే హరి పుండరీకాక్ష
చెంత నాకు నీవే శ్రీ రఘురామా

కులమును నీవే గోవిందుడా, నా -
కలిమియు నీవే కరుణానిధీ,
తలపును నీవే ధరణీధరా, నా -
నెలవును నీవే నీరజనాభా ॥

తనువును నీవే దామోదరా, నా -
మనికియు నీవే మధుసూదనా,





వినికియు నీవే విట్ఠలుడా, నా -
వెనకముందు నీవే విష్ణుదేవుడా ॥

పుట్టుగు నీవే పురుషోత్తమా కొన
నట్టనడుము నీవే నారాయణా,
యిట్టె శ్రీ వేంకటేశ్వరుడా నాకు
నెట్టన గతి యింక నీవే నీవే ॥

## 24. అంతర్యామి అలసితి

అంతర్యామి అలసితి సొలసితి
యింతట నీ శరణిదే చొచ్చితినీ

కోరిన కోర్కులు కోయని కట్లు
తీరవు నీవవి తెంచక
భారపు పగ్గాలు పాపపుణ్యములు
నేరుపులబోవు నీవు వద్దనకా

జనుల సంగముల జక్కరోగములు
వినువిడువవు నీవు విడిపించక
వినయము దైన్యము విడువని కర్మము
చనదది నీ విటు సంతపరచకా

మదిలోచింతలు మయిలలు మణుగులు
వదలవు నీవవి వద్దనకా
యెదటనే శ్రీ వేంకటేశ్వర నీవదె
అదనుగాచితివి అట్టిట్టనకా

## 25. అందరికాధారమైన

అందరికాధారమైన ఆదిపురుషుడీతడు
విందైమున్నారగించె విదురునికడ నీతడు

సనకాదులు కొనియాడెడి సర్వాత్మకుడీతడు
వనజభవాదులకును దైవంబైనతడీతడు

యినమండలమున చెలగే హితవైభవుడీతడు
మునుపుట్టిన దేవతలకు మూలభూతి యీతడు
సిరులొసగి యశోదయింట శిశువైన తడీతడు
ధరనావుల మందలలో తగచరించె నీతడు
సరసతలను గొల్లెతలకు జనవులొసగె నీతడు
అరసి కుచేలుని అటుకులు ఆరగించె నీతడు
పంకజభవునకు బ్రహ్మ పదమొసగెను యీతడు
సంకీర్తనాద్యులచే జట్టిగొనియె నీతడు
తెంకిక నేకాలము పరదేవుడైన యీతడు
వేంకటగిరి మీద ప్రభల వెలసినఘను డీతడు

## 26. ఆకటివేళల

ఆకటి వేళల అలపైన వేళలను
తేకువ హరినామమే దిక్కుమరి లేదు ॥
కొఱమాలి యున్న వేళ కులము చెడినవేళ
చెఱవడి వొరుల చేజిక్కినవేళ
వొఱపైన హరినామమొక్కటే గతిగాక
మఱచి తప్పిననైన మఱిలేదు తెరగు ॥
ఆపద వచ్చిన వేళ ఆరడిబడిన వేళ
పాపపు వేళల భయపడినవేళ
వోపినంత హరినామమొక్కటే గతిగాక
మాపుదాకా పొరలిన మరిలేదు తెరగు ॥
సంకెల బెట్టిన వేళ చంపబిలిచిన వేళ
అంకిలిగా నప్పుల వారాగిన వేళ
వెంకటేశు నామమే విడిపించగతిగాక
మంకుబుద్ధి పొరలిన మరిలేదు తెరగు ॥





## 27. ఆడరో పాడరో

ఆడరో పాడరో ఆనందించరో
వేడుక మొక్కరో విజ్ఞానులు
హరి రక్షకుడై యందరి కుండగ
పరగగ బతికేరు బ్రహ్మాదులు
గరిమ నతడే చక్రము చేపట్టగ
సురిగి పారిరదె చూడు దసురులు
పదిలపు విష్ణుడై ప్రాణమై యుండగ
యిదివో మెలగేరు యీ జీవులు
మొదలు యితడే మూలమై యుండగ
పొదలె నీతని పంపున లోకములు
శ్రీ వేంకటాద్రిని శ్రీపతి యుండగ
తావుల నిలిచెను ధర్మములు
యీ వల నితడే యిచ్చేటి వరములు
పావను లైరిదే ప్రపన్నులు

## 28. ఆనంద నిలయ

ఆనంద నిలయ ప్రహ్లాద వరదా
భాను శశినేత్ర జయ ప్రహ్లాద వరదా
పరమ పురుష నిత్య ప్రహ్లాద వరదా
హరి యచ్యుతానంత ప్రహ్లాద వరదా
పరిపూర్ణ గోవింద ప్రహ్లాద వరదా
భరితకల్యాణ గుణ ప్రహ్లాద వరదా
భవరోగ సంహరణ ప్రహ్లాద వరదా
అవిరళ కేశవ ప్రహ్లాద వరదా
పవమాన నుత కీర్తి ప్రహ్లాద వరదా
భవపితామహ వంద్య ప్రహ్లాద వరదా

బలయుక్త నరసింహ ప్రహ్లాద వరదా
లలిత శ్రీ వేంకటాద్రి ప్రహ్లాద వరదా
ఫలిత కరుణారస ప్రహ్లాద వరదా
బలివంశ కారణ ప్రహ్లాద వరదా

## 29. ఆరగించి కూచున్నాడు

ఆరగించి కూచున్నా డల్లవాడె
చేరువనే చూడరె లక్ష్మీ నారసింహుడు ॥
ఇందిరను తొడమీద నిడుకొని కొలువిచ్చీ
అందపు నవ్వులు చల్లీ నల్లవాడె
చెందిన మాణికముల శేషుని పడగమీద
చెంది వరాలిచ్చీ లక్ష్మీ నారసింహుడు ॥
బంగారు మేడలోన పచ్చల గద్దియల మీద
అంగనల ఆట చూచీ నల్లవాడె
రంగగు సొమ్ముల తోడ రాజసపు విభవాల
చెంగట నున్నాడు లక్ష్మీనారసింహుడు ॥
పెండెపు పాదము చాచి పెనచి ఒకపాదము
అండనే పూజలుగొనీ నల్లవాడె
కొండల శ్రీ వేంకటాద్రి కోరి అహోబలమున
మెండుగాను మెరసీ లక్ష్మీనారసింహుడు ॥

## 30. ఆరగింపవో మాయప్పయివే

ఆరగింపవో మాయప్పయివే
పేరిన నేతులు పెరుగులును ॥
తేనెలు జున్నులు తెంకాయపాలును
ఆనవాలు వెన్నట్లును





నూనెబూరెలును నురుగులు వడలును
పానకములు బహు ఫలములను ॥
పరమాన్నంబులు పంచదారలును
అరిసెలు గారెలు నవుగులును
కరజి కాయలును ఖండమండెగలు
పరిపరివిధముల భక్షములు ॥
కడుమధురంబగు కమ్మబూరణపు
కుడుములు నిడ్డెన కుడుములును
సుడిగొనునప్పాలు సుగినప్పాలును
పొరిబెల్లముతో బొరటుచును ॥
కాయపురుచులకు గనియగుమిరియపు
కాయలు నేలకికాయలును
పాయరాని అంబాళపుకాయలు
నాయతమౌ దద్ధ్యన్నములు ॥
ఒడికపుకూరలు ఒలుపు పప్పులును
వడియాలపు రాజాన్నములు
బడిబడి కనకపు పళ్ళెరములతో
కనువేడుక వేంకటరమణా ॥

## 31. ఆర్తుడ నేను

ఆర్తుడ నేను నీకడ్డమెందును లేదు
మూర్తి త్రయాత్మక మొగి కరుణించవే
సర్వ సాక్షవి నీవు సర్వాంతరంగుడవు
సర్వ సర్వం సహా చక్రవర్తి
నిర్వాణ మూర్తి నిగమాంత కీర్తి
సర్వాపరాధములను క్షమియించవే

పరమాత్ముడవు నీవు పరంజ్యోతివి నీవు
పరమ పరానంద పరమ పురుషా
కరిరాజ వరదా కారుణ్య నిలయా
శరణా గతుడ నన్ను సరిగావవే
అణువు లోపలినీవు ఆది మహత్తువునీవు
ప్రణుత శ్రీ వేంకట ప్రచుర నిలయ
అణి మాది విభవా ఆద్యంత రహితా
గణుతించి నాపాల గలుగ వే నీవు

## 32. ఇట్టి ముద్దులాడి

ఇట్టిముద్దులాడి బాలు దేడవాడు వాని
పట్టితెచ్చి పొట్టనిండ పాలువోయరే ॥
గామిడై పారితెంచి కాగెడి వెన్నలలోన
చేమపూవు కడియాల చేయిపెట్టి
చీమ కుట్టెనని తన చెక్కిట కన్నీరు జార
వేమరువాపోవు వాని వెట్టు వెట్టరే ॥
ముచ్చువలెవచ్చి తన ముంగామురువులచేయి
తచ్చెడి పెరుగులోన తగబెట్టి
నొచ్చెనని చేయితీసి నోరనెల్లఁజొల్లుగార
వొచ్చెలి వాపోవువాని నూరడించరే ॥
ఎప్పుడు వచ్చెనో మాయిల్లుచొచ్చి పెట్టెలోని
చెప్పరాని వుంగరాల చేయిపెట్టి
అప్పడైన వేంకటాద్రి అసబాలకుడు గాన
తప్పకుండ పట్టి వాని తలకెత్తరే ॥

## 33. ఇటుగరుడని

ఇటు గరుడని నీ వెక్కినను
పటపట దిక్కులు బగ్గన బగిలె ॥





ఎగసినగరుడని యేపున 'ధా' యని
జిగిదొలక చబుకుచేసినను
నిగమాంతంబులు నిగమసంఘములు
గగనము జగములు గడగడ వడకె ॥
బిరుసుగ గరుడని పేరెము దోలుచుఁ
బెరసి నీవు కోపించినను
సరుస నఖిలములు జర్జరితములై
తిరుపున నలుగడ దిరదిర దిరిగె ॥
పల్లించిన నీ పసిడి గరుడనిని
కెల్లున నీ వెక్కి నయపుడు
ఝుల్లనె రాక్షససమితి నీ మహిమ –
వెల్లి మునుగుదురు వేంకటరమణా ॥

## 34. ఇతడే పరబ్రహ్మా

ఇతఁడే పరబ్రహ్మా మిదియే రామకథ
శతకోటి విస్తరము సర్వపుణ్యఫలము
ధరలో రాముఁడు పుట్టె ధరణిజఁబెండ్లాడె
అరణ్యవాసులకెల్లా నభయమిచ్చె
సొరిది ముక్కుఁజెవులు చుప్పనాతిని గోసె
ఖరదూషణులను ఖండించి వేసె
కినిసి వాలిఁజంపి కిష్కింధ సుగ్రీవు కిచ్చె
వనధి బంధించి దాఁటె వానరులతో
కనలి రావణకుంభకర్ణాదులను జంపి
వనితఁజేకొని మళ్ళి వచ్చె నయోధ్యకును
సౌమిత్రియు భరతుఁడు శత్రుఘ్నుఁడుఁ గొలువఁగ
భూమి యేలె కుశలవపుత్రులఁగాంచె

శ్రీ మంతుఁడై నిలిచె శ్రీ వేంకటాద్రిమీఁద
కామించి విభీషణ లంకకుఁబట్టము గట్టె

## 35. ఇతడొకడే సర్వేశ్వరుడు

ఇతడొకడే సర్వేశ్వరుడు
సితకమలాక్షుడు శ్రీ వేంకటేశుడు ॥
పరమయోగులకు భావనిధానము
అరయ నింద్రాదుల కైశ్వర్యము
గరిమ గొల్లెతల కౌగిటి సౌఖ్యము
సిరులొసగే ఈ శ్రీ వేంకటేశుడు ॥
కలికి యశోదకు కన్నమాణికము
తలచిన కరికిని తగుదిక్కు
అలద్రౌపదికిని ఆపద్బంధుడు
చెలరేగిన ఈ శ్రీ వేంకటేశుడు ॥
తగిలిన మునులకు తపముల సత్ఫలము
ముగురు వేల్పులకు మూలము
ఒగి నలమేల్మంగ కొనరినపతి యితడు
జిగిమించిన ఈ శ్రీ వేంకటేశుడు ॥

## 36. ఇతర మెరుగగతి

ఇతర మెరుగగతి ఇదియె శరణ్యము
సతత పూర్ణునికి శరణ్యము ॥
సర్వలోకముల సాక్షిగాచిన
సర్వేశ్వరునకు శరణ్యము
ఉర్వికి మింటికి వొక్కటి చెలగిన
సార్వభౌమునకు శరణ్యము ॥





శ్రీకాంతనురము చెంగట నిలిపిన
సాకారునకు శరణ్యము
పైకొని వెలిగేటి పరంజ్యోతియై
సౌకుమారునకు శరణ్యము ॥
తగనిహ పరములు దాసులకొసగెటి
జగదీశ్వరునకు శరణ్యము
నగశ్రీ వేంకట నాధుడనీకు
సుగుణ మూర్తికిదె శరణ్యము ॥

## 37. ఇదివో సుద్దులు

ఇదివో సుద్దులు ఈరేపల్లెను
కదిపి ఇందరివి గైకొనవయ్య ॥
పలుచని రెప్పల పగటులు నెరపుచు
సొలసి నిన్నొకతె చూచెనట
తళుకుల గోళ్ళదండె మీటి యిదె
పలికి నిన్నొకతె పాడెనట ॥
చనవులు నెరపుచు సన్నసేయుచును
ననుపున నొక్కతె నవ్వెనట
చెనకి యొక్కతె అదె చిగురు గేదగుల
వెనక నుండి నిను వేసెనట ॥
అదన నీవు నన్ను అలమి పట్టంగా
కొదలి యొక్కతె కని గొణిగెనట
ఎదురనె శ్రీ వేంకటేశ యొకతె నీ
చెదరిన అలుకలు చెరిగెనట ॥

## 38. ఇన్నిటా నింతటా

ఇన్నిటా నింతటా నిరవొకటే
వెన్నుని నామమె వేదంబాయె ॥

నలినదళాక్షుని నామకీర్తనము
కలిగి లోకమున కలదొకటే
యిల నిదియే భజియింపగపుణ్యులు
చెలగి తలప సంజీవని ఆయె ॥

కోరిక నచ్యుత గోవిందా యని
ధీరులు తలపగ తెరువొకటే
ఘోర దురితహర గోవర్ధనధర
నారాయణ యని నమ్మగ కలిగె ॥

తిరువేంకటగిరి దేవుని నామము
ధరతలపగ ఆధారమిదే
గరుడధ్వజుని సుఖప్రద నామము
నరులకెల్ల ప్రాణము తానాయె ॥

## 39. ఇన్నిరాసుల

ఇన్నిరాసుల యునికి యింతి చెలువపు రాశి
కన్నె నీరాశి కూటమి గలిగిన రాశి

కలికిబొమవిండ్లు గల కాంతకును ధనురాశి
మెలయు మీనాక్షికిని మీనరాశి
కులుకు కుచకుంభముల కొమ్మకును కుంభరాశి
చెలగు హరిమధ్యకును సింహరాశి

చిన్ని మకరాంకపు య్యెదచేడెకు మకరరాశి
కన్నెప్రాయపు సతికి కన్నెరాశి
వెన్నెయై పైడితుల తూగు వనితకు తులారాశి
తిన్నది వాడి గోళ్ళ సతికి వృశ్చికరాశి

ఆముకొను నొరపుపు మెరయు నతివకు వృషభరాశి
గామిడి గుట్టు మాటలసతి కర్కాటకరాశి





కోమలపు చిగురుమోవి కోమలికి మేషరాశి
ప్రేమ వేంకటపతి గలసె ప్రియ మిధునపురాశి

## 40. ఇప్పుడిటు కలఁగంటి

ఇప్పుడిటు కలఁగంటి నెల్ల లోకములకు –
నప్పడగు తిరు వేంకటాద్రీశుఁగంటి ॥

అతిశయంబైన శేషాద్రి శిఖరముగంటి
ప్రతిలేని గోపుర ప్రభలు గంటి
శతకోటి సూర్య తేజములు వెలుగగ గంటి
చతురాస్యు పొడగంటి చయ్యన మేలుకొంటి ॥

కనకరత్నకవాటకాంతు లిరుగడఁగంటి
ఘనమైన దీపసంఘములు గంటి
అనుపమ మణిమయమగు కిరీటము గంటి
కనకాంబరము గంటి గ్రక్కన మేలుకొంటి ॥

అరుదైన శంఖచక్రాదు లిరుగడ గంటి
సరిలేని యభయహస్తముఁగంటి
తిరు వేంకటాచలాధిపునిఁజూడగఁగంటి
హరిఁగంటి గురుఁగంటి నంతట మేలుకొంటి ॥

## 41. ఇలయును నభమును

ఇలయును నభమును నేక రూపమై
జల జగోళ్ళు జళిపించితివి

ఎడసిన నలముక హిరణ్య కశిపుని
దొడికి పట్టి చేతుల బిగిసి
కెడపి తొడలపై గిరి గొన నదుముక
కడుపు చించి కహ కహ నవ్వితివి

రొప్పుల నూర్పుల రొచ్చుల కసరులు
గుప్పుచు లాలలు గురియుచును
కప్పిన బెబ్బులి కసరుహుంకృతుల
దెప్పల వసురల ధృతి యణచితివి
పెళ పెళ నార్చుచు బెడ బొబ్బలిడుచు
ఛళ ఛళ మెఱువగ దంతములు
ఫళ ఫళ వీర విభవ రస రుధిరము
గుళ గుళ దిక్కుల గురియించితివి
అహోబలమున అతిరౌద్రముతో
మహా మహిమల మలయుచును
తహ తహ మెదుపుచు తగు వేంకటపతి
యిహము పరము మాకిపుడొసగితివి

## 42. ఇహపరసాధన

ఇహపర సాధన మీతలపు
సహజ జ్ఞానికి సతమీతలపు ॥
సిరులు ముంగిటను జిగిదడబడగా
హరిని మరువనిది అదితలపు
సరిగాంత లెదుట సందడి గొనగా
తిరమని భ్రమయనిదే తలపు ॥
వొడలి వయోమదముప్పతిల్లినను
అడచి మెలంగుట యదితలపు
కడcగుచు సుఖదుఃఖములు ముంచినను
జడియని నామస్మరణమే తలపు ॥
మతి సంసారపు మాయగప్పినను
అతికాంక్షజొరనిదది తలపు





గతియై శ్రీ వేంకటాపతిగాచిన
సతతము నితని శరణమే తలపు ॥

## 43. ఇందరికి నభయంబులిచ్చు

ఇందరికి నభయంబు లిచ్చుచేయి
కందువగు మంచి బంగారు చేయి ॥
వెలలేని వేదములు వెదకి తెచ్చినచేయి
చిలుకు గుబ్బలి కింద చేర్చు చేయి
కలికి యగు భూకాంత కౌగిలించినచేయి
వలనైన కొనగోళ్ళ వాడిచేయి ॥
తనివోక బలిచేత దానమడిగిన చేయి
ఒనరంగ భూదాన మొసగు చేయి
మొనసి జలనిధి యమ్ముమొనకు దెచ్చిన చేయి
ఎనయ నాగేలు ధరియించు చేయి ॥
పురసతుల మానములు పొల్లసేసినచేయి
తురగంబుబరపెడి దొడ్డచేయి
తిరువేంకటాచలాధీశుడై మోక్షంబు...
తెరువు ప్రాణులకెల్ల తెలిపెడి చేయి ॥

## 44. ఇందిరారమణుదెచ్చి

ఇందిరారమణు దెచ్చి యియ్యరో మా కిటువలె
పొంది యీతని పూజించ పొద్దాయ నిపుడు ॥
ధారుణి మైరావణు దండించి రాముదెచ్చి
నేరుపున మించిన అంజనీతనయా
ఘోర నాగపాశముల కొట్టివేసి యీతని
కారుణ్య మందినట్టి ఖగరాజ గరుడా ॥

నానా దేవతలకు నరసింహు కంభములో
పానిపట్టి చూపినట్టి ప్రహ్లాదుడా
మానవుడై (డొ?) కృష్ణమహిమల విశ్వరూపు
పూని బండి నుంచుకొన్న పోటుబంట అర్జునా ॥
శ్రీవల్లభునకు అశేషకైంకర్యముల
శ్రీవేంకటాద్రివైన శేషమూరితీ
కైవసమైనయట్టి కార్తవీర్యార్జునుడా
దేవుని నీవేళ నిట్టె తెచ్చి మాకు నియ్యరే ॥

## 45. ఈతడువో రాముడు

ఈతడువో రాముడు ఏకాంగవీరుడు
ఏతలజూచినా తానె ఇరవుకొన్నవాడు ॥
చిరుతప్రాయమునాడు శివుని విల్లువిరచి
మెరసి సీతను పెండ్లాడి మించినవాడు
తరి పదునాలుగు వేల దానవుల నిమిషాన
జరసి తానొక్కడే చదిపినవాడు ॥
ఓడక విల్లెక్కు పెట్టి ఊరకే ఒక్కమ్మున
ఏడు తాళ్లు ధరను కూలవేసినవాడు
జాడగా కొండలచేత జలనిధిఁగట్టించి
వేడుకతో లంకమీద విడిసినవాడు ॥
రావణ కుంభకర్ణాది రాకాసుల పరిమార్చి
ఈవల అయోధ్యాపట్నమేలిన వాడు
శ్రీ వేంకటాద్రిమీదఁజేరి మాల్యవంతమున
వేవేలు చందములను వెలసినవాడు ॥

## 46. ఈతడే హరుడు

ఈతడే హరుడు యీతడే యజుడు
ఈతనికి నీ చేతలెంత ఘనమటుగాన ॥




కడు పెక్కు బ్రహ్మాండకటకములు సుడివడిన
కడుపులో నిడుకొన్నఘనుడు
వెడలి పూతకిచంటి విషము తాగిన యంత
వడిఁదనకు నేమాయ వట్టిబూమెలుగాక ॥
ఎల్లజలధులు మిగిలి యేకమై పబ్బినపు
డుల్లసిల్లుచు నీతడుండు
మల్లాడి యొక రెండు మద్దులు విరచినట్టి
బల్లిదుదవని నిన్ను పరిణమింతురు గాన ॥
తిరువేంకటేశ్వరుడు దేవ దేవోత్తముడు
పరిపూర్ణుడచ్యుతు డభవుడు
శరణాగతుల రక్షసేయువా డనుమాట
గురుతుగా తలపోసి కొనియాడగా వలసె ॥

## 47. ఈ పాదమే కదా

ఈ పాదమే కదా యిలయెల్ల గొలిచినది
ఈ పాదమే కదా యిందిరా హస్తముల కితవైనది ॥
ఈ పాదమే కదా ఇందరును మ్రొక్కెడిది
ఈ పాదమే కదా యీ గగనగంగ పుట్టినది
ఈ పాదమే కదా యెలమి పెంపొందినది
ఈ పాదమే కదా యిన్నిటికిని యెక్కుడైనది ॥
ఈ పాదమే కదా యిభరాజు దలచినది
ఈ పాదమే కదా యింద్రాదులెల్ల వెదకినది
ఈ పాదమే కదా యీ బ్రహ్మ కడిగినది
ఈ పాదమే కదా యెగసి బ్రహ్మాండమంటినది ॥
ఈ పాదమే కదా యిహపరము లొసగెడిది
ఈ పాదమే కదా యిల నహల్యకు కోరికైనది

ఈ పాదమే కదా యీక్షింప దుర్లభము
ఈ పాదమే కదా యీ వేంకటాద్రిపై నిరవైనది ॥

## 48. ఉగ్గువెట్టరే ఓయమ్మా

ఉగ్గువెట్టరే వోయమ్మా చె -
య్యెగ్గినిదె శిశు వోయమ్మా ॥
కడుపులోని లోకమ్ములు గదలీ -
నొడలూచకురే వోయమ్మా
తొడికెడి సరుగన తొలగదీయరే
వుడికెడి పాలివి వోయమ్మా ॥
చప్పలు వట్టుక సన్నపు బాలుని
నుప్పర మెత్తకురోయమ్మా
అప్పుడె సకలము నదిమీనోరనె
వొప్పదు తియ్యరె వోయమ్మా ॥
తొయ్యలు లిటు చేతుల నలగించక
వుయ్యల నిడరే వోయమ్మా
కొయ్యమాటలను కొండల తిమ్మని
నొయ్యన తిట్టకురోరమ్మా ॥

## 49. ఉన్నతోన్నతుడు

ఉన్నతోన్నతుడు ఉడయవరు
ఎన్ననంతుడే ఈ ఉడయవరు ॥
సర్వలోకముల శాస్త్ర రహస్యములు
ఉర్విపొడమె నీ ఉడయవరు
పూర్వపు వేదాంత పుణ్య శాస్త్రములు
నిర్వహించెనన్నిట ఉడయవరు ॥





కదిసె మోక్ష సాకారము తానై
ఉదుటున నిలిచెనీ ఉడయవరు
ఇదివో శ్రీ వేంకటేశ్వరుని ఈడై
పొదలుచున్నాడు భువిని ఉడయవరు ॥

## 50. ఉప్పవడము

ఉప్పవడము గాకున్నా రిందరు
యెప్పుడు రేయి నీకెప్పుడు పగలు
కన్నుల చంద్రుఁడును కమలమిత్రుఁడును
వున్నతి నివి నీకుండఁగను
వెన్నెలయెండలు వెలయఁగ మేల్కొను
టెన్నఁడు నిద్దుర యెన్నఁడు నీకు
కందువ సతికనుఁగలువలు ముఖార
విందము నిదివో వికసించె
ముందర నిద్దుర మొలవదు చూచిన
విందగునీ తెలివికిఁదుద యేది
తమము రాజసము తగుసాత్వికమును
నమరిన నీ మాయారతులు
కమలాధిప వేంకటగిరీశ నిన్ను
ప్రమదము మఱపునుఁబైకొనుటెట్లా

## 51. ఉయ్యాల బాలునూచెదరు

ఉయ్యాల బాలునూచెదరు కడు
నొయ్య నొయ్య నొయ్యనుచు ॥
బాల యవ్వనలు పసిడి ఉయ్యాల
బాలుని వద్దపాడేరు
లాలి లాలి లాలి లాలెమ్మ
లాలి లాలి లాలనుచు ॥

తమ్మిరేకు కనుదమ్ముల నవ్వుల
పమ్ముజూపులఁబాడేరు
కొమ్మల మట్టెల గునుకుల నడపుల
ధిమ్మి ధిమ్మి ధిమ్మనుచు ॥
చల్లుచూపులఁజవరాండ్లు రే -
పల్లె బాలుని పాడేరు
బల్లిదు వేంకటపతి జేరందెలు
ఘల్లు ఘల్లు ఘల్లనుచు ॥

## 52. ఎక్కడి మానుషజన్మం

**(పెద తిరుమలాచార్యుల రచన)**

ఎక్కడి మానుషజన్మం బెత్తిన ఫలమేమున్నది
నిక్కము నిన్నే నమ్మితి నీ చిత్తంబికను ॥
మరువను ఆహారంబును మరువను సంసార సుఖము
మరువను ఇంద్రియభోగము మాధవ నీమాయ
మరచెద సుజ్ఞానంబును మరచెద తత్త్వ రహస్యము
మరచెద గురువును దైవము మాధవ నీమాయ ॥
విడువను పాపము పుణ్యము విడువను నాదుర్గుణములు
విడువను మిక్కిలి యాసలు విష్ణుడ నీమాయ
విడిచెద షట్కర్మంబులు విడిచెద వైరాగ్యంబును
విడిచెద నాచారంబును విష్ణుడ నీమాయ ॥
తగిలెద బహు లంపటముల తగిలెద బహుబంధంబుల
తగులను మోక్షపు మార్గము తలపున యెంతైనా
అగపడి శ్రీ వేంకటేశ్వర అంతర్యామివై
నగినగి నను నీవేలితి నాకా యీ మాయ ॥

## 53. ఎటువంటి యాగ డీడే

ఎటువంటి యాగ డీడే యీ కృష్ణుడు
జొట జొట గారగానీ జుట్టీ మీగడలు





కొట్టె కృష్ణుడు వాడె కోలలెత్తి వుట్ల పై
దట్టముగ గొల్లెతలు దాచిన పాలు
చుట్టిన చక్కిలములు చొక్క పునురుగులును
బెట్టిన కాగుల తోనె పెంచలుగ జేసేనే
దొంతులు దించి దించి దొరకొనీ కృష్ణుడు
బంతి చక్కెర వెట్టి గోపాలుల కెల్ల
మంతనానా వద్దని మానుపబోతే తాను
కొంతవారీ నోర పెరుగులు చమరీనే
వీధులెల్లా తానే శ్రీ వేంకటాద్రి కృష్ణుడు
ఆది గొని మెసగీని అటుకు లెల్ల
కాదని పెనగి తేను కాగిలించీ గొల్లెతల
సోదించి కుచములంటీ సొంపుగా కూడేనే

## 54. ఎత్తరె ఆరతు లీమెకు

ఎత్తరె ఆరతు లీమెకు ఇంతులాలా
హత్తెను శ్రీ వేంకటేశు కలమేలుమంగ ॥
హరివురమ్ముపై సొమ్ము అరుతగట్టిన తాళి
సరిలేని దేవుని సంసార ఫలము
సిరులకుఁపుట్టి నిల్లు సింగారములవిత్తు
మెరుగు బోడి యలమేలు మంగ ॥
పరమాత్మునికి నాత్మ భావములో కీలుబొమ్మ
కెరలుచు నితడు భోగించు మేడ
సరసపు సముద్రము సతమైన కొంగు పైడి
అరిది సంపదలది యలమేలు మంగ ॥
శ్రీ వేంకటేశు దేవి చిత్తజుగన్న తల్లీ
యీ విభుని కౌగిటిలో యేచిన కళ

బూవపు పెళ్లిమేలు పొందిన నిధానము
ఆవల నీవల నీమె యలమేలు మంగ ॥

## 55. ఎన్నడు విజ్ఞానమిక

ఎన్నడు విజ్ఞానమిక నాకు
విన్నప మిదె శ్రీ వేంకటనాథా ॥
పాసిన పాయవు బంధములు
ఆస దేహమున్నన్నాళ్ళు
కోసిన తొలగవు కోరికలు
గాసిలి చిత్తము కలిగినన్నాళ్లు ॥
కొచ్చిన గొరయవు కోపములు
గచ్చుల గుణములు గలనాళ్ళు
తచ్చిన తలగవు తహతహలు
రచ్చల విషయపు రతులన్నాళ్ళు ॥
వొకటి కొకటికిని వొడబడవు
అకట శ్రీ వేంకటాధిపుడ
సకలము నీవే శరణంటే యిక
వికటములణగెను వేడుకనాళ్ళు ॥

## 56. ఎవ్వరెవ్వరివాఁడో

ఎవ్వరెవ్వరివాఁడో యీ జీవుఁడు
ఎవ్వరికి నేమౌనో యీ జీవుఁడు
ఎందరికిఁ గొడుకుగాడీ జీవుఁడు వెనక
కెందరికిఁ దోబుట్టఁడీ జీవుఁడు
ఎందరికి భ్రమయించడీ జీవుఁడు దుఃఖ -
మెందరికిఁ గావింపడీ జీవుఁడు





ఎక్కడెక్కడఁ దిరుగడీ జీవుఁడు, వెనక
కెక్కడో తనజన్మ మీ జీవుఁడు
ఎక్కడి చుట్టము తనకు నీ జీవుఁడు, ఎప్పు -
డెక్కడికినేగునో యీ జీవుఁడు
ఎన్నడును జేటులే నీ జీవుఁడు, వెనక
కెన్ని తనువులు మోవఁడీ జీవుఁడు
ఎన్నఁగల తిరువేంకటేశు మాయలఁదగిలి
యెన్ని పదవులఁబొందఁడీ జీవుఁడు

## 57. ఎంతచదివిన

ఎంత చదివిన ఏమివినిన తన -
చింత ఏలమాను సిరులేల కలుగు ॥
ఇతర దూషణములు ఎడసిన గాక
అతి కాముకుడు కానియప్పుడు గాక
మతి చంచలము కొంతమానినగాక
గతియేల కలుగు దుర్గతు లేలమాను ॥
పరధనముల యాస పాసినగాక
అరిది నిందలు లేనియప్పుడు గాక
విరసవర్తనము విడిచిన గాక
పరమేల కలుగు నాపద లేలమాను ॥
వేంకటపతి నాత్మవెదకిన గాక
కింక మనసున తొలగిన గాక
బొంకుమాట లెడసి పోయినగాక
శంక యేల మాను జయమేల కలుగు ॥

## 58. ఎంత పుణ్యమో

ఎంత పుణ్యమో యిటు మాకు కలిగె
చెంతనె నీకృప సిద్దించ బోలు

శ్రీపతి నీకథ చెవులను వింటిమి
పాపములణగెను భయముడిగె
తీపుగ తులసీ తీర్థము గొంటిమి
శాపము దీరెను సఫలంబాయ
గోవిందా మిము కనుగొంటి మిప్పుడే
పావనమైతిమి బ్రతికితిమి
తావుల మీ పాదములకు మొక్కితి
వేవేలు కలిగెను వేడుకలాయ
శ్రీ వేంకటేశ్వర సేవించితి మిము
ధావతి తీరెను తనిసితిమి
వావిరి ముమ్మారు వలగొని వచ్చితి
నీవారమైతిమి నిలిచితి మిపుడు

## 59. ఎంతమాత్రమున ఎవ్వరు

ఎంతమాత్రమున ఎవ్వరు దలచిన అంత మాత్రమే నీవు
అంతరాంతరము లెంచి చూడ పిండంతే నిప్పటి యన్నట్లు ॥
కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుడని
పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మంబనుచు
తలతురు మిము శైవులు తగిన భక్తులును శివుడనుచు
అలరి పొగడుదురు కాపాలికు లాదిభైరవుండనుచు ॥
సరి నెన్నుదురు శాక్తేయులు శక్తిరూపు నీవనుచు దరి
దరిశనములు మిము నానావిధులను తలపుల కొలదుల భజింతురు
సిరుల మిమునే యల్పబుద్ధి దలచిన వారికి అల్పబవుదువు
గరిమల మిము నే ఘనమని దలచిన ఘన బుద్ధులకు ఘనుడవు
నీవలన కొరతే లేదు మరి నీరు కొద్దిగామెరవు
ఆవల భాగీరథి దరి బావుల ఆ జలమే ఊరివయట్లు





శ్రీ వేంకటపతి నీవైతే మము చేకొని వున్నదైవమని
ఈవలనే నీ శరణననెదను ఇదియే పరతత్త్వమునాకు ॥

## 60. ఏకులజుడేమి

ఏకులజుడేమి యెవ్వడైననేమి
ఆకడ నాతడె హరినెఱిగినవాడు ॥
పరగిన సత్యసంపన్నుడైన వాడే
పరనిందసేయ తత్పరుడు కాని వాడు
అరుదైన భూతదయానిధి యగువాడే
పరులు తానేయని భావించువాడు ॥
నిర్మలుడై యాత్మనియతి గలుగువాడే
ధర్మతత్పర బుద్ధి తగిలినవాడు
కర్మమార్గములు కడవనివాడే
మర్మమై హరిభక్తి మఱవనివాడు ॥
జగతిపై హితముగా చరియించువాడే
పగలేక మతిలోన బ్రదికినవాడు
తెగి సకలము నాత్మ తెలసినవాడే
తగిలి వెంకటేశు దాసుడయినవాడు ॥

## 61. ఏడ సుజ్ఞానము

ఏడ సుజ్ఞానము యేడ తెలివి నాకు
బూడిదలో హోమమై పోయ కాలము
ఇదె మేలయ్యేడి నాకదె మేలయ్యేది నని
కదిసిన యాసచే గడవలేక
యెదురు చూచి చూచి యెలయించి మెలయించి
పొదచాటు మృగమై పోయ కాలము
ఇంతట దీరెడి దుఃఖ మంతట దీరెడినని
వింత (వింత) వగలచే వేగి వేగి

చింతయు వేదనల చిక్కువడుచు నగ్ని
పొతనున్న వెన్నయై పోయకాలము
యిక్కడ సుఖము నాకక్కడ సుఖంబని
యెక్కడికైనా నూర కేగి యేగి
గక్కన, శ్రీ తిరువేంకటపతి గానక
పుక్కి పురాణమై పోయకాలము

## 62. ఏపురాణముల

ఏపురాణముల నెంత వెదకినా
శ్రీ పతిదాసులు చెడ రెన్నడును ॥
హరివిరహితములు అవిగొన్నాళ్లకు
విరసంబులు మరి విఫలములు
నరహరి గొలిచిటు నమ్మినవరములు
నిరతము లెన్నడు నెలవులు చెడవు ॥
కమలాక్షుని మతి గాననిచదువులు
కుమతంబులు బహు కుపథములు
జనులి నచ్యుతుని సమారాధనలు
విమలములేకాని వితథముగావు ॥
శ్రీ వల్లభుగతి జేరనిపదవులు
దావతులు కపట ధర్మములు
శ్రీవేంకటపతి సేవించు సేవలు
పావనము లధికభాగ్యపు సిరులు ॥

## 63. ఏమని పొగడుదు ఇట్టి

ఏమని పొగడుదు ఇట్టి నీ మహిమలు
యీమహిమకు ప్రతి యితరులు కలరా
నిండెను జగముల నీ ప్రతాపములు
చెండిన భానుని చేతలతో





కొండలంతలై కుప్పలు వడియెను
ఉండగ తగు రావణు తలలయి
పూడెను జలధులు పోరి కోపించిన
తోడ బ్రహ్మాండము తూటాయ
చూడ పాతాళము చొచ్చె బలీంద్రుడు
కూడిన కౌరవ కులములు నడగె
యెత్తితివి జగము లీడేరు నొకపరి
యిత్తల నభయంబిచ్చితివి
హత్తిన శ్రీ వేంకటాధిప నీకృప
నిత్తె మాయనీ నిజదాసులకు

## 64. ఏమని పొగడుదుమే

ఏమని పొగడుదుమే యిక ని (న్ను) ను
ఆమని సొబగుల అలమేల్మంగ ॥
తెలికన్నుల నీ తేటలే కదవే
వెలయుగ విభునికి వెన్నెలలు
పులకల మొలకల పొదులివికదవే
పలుమరు పువ్వుల పానుపులు ॥
తియ్యని నీమోవి తేనెలే కదవే
వియ్యపు రమణుని విందులివి
ముయ్యక మూసిన మొలక నవ్వుకదె
నెయ్యపు కప్రపు నెరిబాగాలు ॥
కైవసమగు నీ కౌగిలే కదవే
శ్రీ వేంకటేశ్వరు సిరినగరు
తావుకొన్న మీ తమకములే కదే
కావించిన మీ కల్యాణములు ॥

## 65. ఏమొకో చిగురుటధరమున

ఏమొకో చిగురుటధరమున యెడనెడ కస్తూరినిండెనో
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదు కదా ॥
కలికి చకోరాక్షికి కడకన్నులు కెంపైతోచిన
చెలువం బిప్పుడిదేమో చింతింపరె చెలులు
నలువున ప్రాణేశ్వరుపై నాటిన యా కొనచూపులు
నిలువున పెరుకగ నంటిన నెత్తురు కాదుకదా ॥
పడతికి చనుగవ మెఱుగులు పైపై పయ్యెదవెలుపల
కడు మించిన విధమేమో కనుగొనరే చెలులు
ఉడుగని వేడుకతో ప్రియుడొత్తిన నఖశశిరేఖలు
వెడలగ వేసవికాలపు వెన్నెల కాదు కదా ॥
ముద్దియ చెక్కుల కెలకుల ముత్యపు జల్లుల చేర్పుల
వొద్దికలాగు లివేమో వూహింపరే చెలులు
గద్దరి తిరువేంకటపతి కామిని వదనాంబుజమున
అద్దిన సురతపు చెమటల అందము కాదు కదా ॥

## 66. ఏలవయ్యు

ఏలవయ్యు లోకమెల్ల యిట్టెరాము దీవెనచే
నీలవర్ణ హనుమంతా నీవు మాకు రక్ష
మొదల నింద్రుడు నీ మోమునకెల్లా రక్ష
యిదెనీ శిరసునకు నినుడు రక్ష
కదిసి నీ కన్నులకు గ్రహతారకాలు రక్ష
చెదరని నీ మేనికెల్ల శ్రీ రామరక్ష
వడి నీ పాదములకు వాయుదేవుడు రక్ష
తొడలకు వరుణుండు తొడుగు రక్ష
విడువని మతికిని వేదరాసులే రక్ష
చెడని నీ యాయువునకు శ్రీ రామరక్ష





అంగపు నీ తేజమున కగ్నిదేవుడు రక్ష
శృంగారమునకెల్ల శ్రీసతి రక్ష
మంగాంబుధి హనుమంత నీకే కాలము
చెంగట శ్రీ వేంకటాద్రి శ్రీ రామరక్ష

## 67. ఏలే ఏలే మరదలా

ఏలే ఏలే మరదలా
చాలు చాలు చాలును
చాలు నీతోడి సరసాలు బావ ॥
గాటపు గుబ్బలు కదలగ కులికేవు
మాటల తేటల మరదలా
చీటికి మాటికి చెనకేవు వట్టి
బూటకాలు మాని పోవే బావ ॥
అందిందె నన్ను అదలించి వేసేవు
మందమేలపు మరదలా
సందుకో తిరగేవు సటకారి ఓ బావ
పొందుకాదిక పోవే బావా ॥
చొక్కపు గిలిగింత చూపుల నన్ను
మక్కువ సేసిన మరదలా
గక్కున నను వేంకటపతి గూడితి
దక్కించుకొంటివి తగువైతి బావ ॥

## 68. ఏవం శ్రుతిమత మిదమేవ

ఏవం శ్రుతిమత మిదమేవ త –
ద్భావయితు మతఃపరం నాస్తి ॥
అతులజన్మభోగాసక్తానాం
హితవైభవసుఖ మిదమేవ

సతతం శ్రీహరిసంకీర్తనం త -
ద్వ్యతిరిక్తసుఖం వక్తుం నాస్తి ॥
బహుళ మరణపరిభవచిత్తానా -
మిహపరసాధన మిదమేవ
అహిశయనమనోహరసేవా త -
ద్విహరణం వినా విధిరపి నాస్తి ॥
సంసారదురితజాడ్యపరాణాం
హింసావిరహిత మిదమేవ
కంసాంతక వేంకటగిరిపతేః ప్ర -
శంసైవా పశ్చా దిహ నాస్తి ॥

## 69. ఒకపరి కొకపరి

(పెద తిరుమలాచార్యుల రచన)

ఒకపరి కొకపరి కొయ్యారమై
మొకమున కళలెల్ల మొలచినట్లుండె ॥
జగదేకపతిమేన చల్లిన కర్పూరధూళి
జిగికొని నలువంక చిందగాను
మొగి చంద్రముఖి నురమున నిలిపెగాన
పొగరు వెన్నెల దిగబోసి నట్లుండె ॥
పొరిమెరుగు చెక్కుల పూసిన తట్టుపునుగు
కరగి ఇరుదెసల కారగాను
కరిగమన విభుడు గనుక మోహమదము
తొరిగి సామజసిరి తొలికినట్లుండె ॥
మెరయ శ్రీ వేంకటేశుమేన సింగారముగాను
తరచైన సొమ్ములు ధరియించగా
మెరుగు బోడి అలమేలు మంగయు తాను
మెరుపు మేఘము గూడి మెరసినట్లుండె ॥





## 70. ఓపవనాత్మజ

ఓపవనాత్మజ ఓ ఘనుడా
బాపు బాపనగా పరగితిగా ॥
ఓ హనుమంతుడ ఉదయాచల ని -
ర్వాహక నిజ సర్వప్రబలా
దేహము మోచిన తెగువకు నిటువలె
సాహస మిటువలె చాటితిగా ॥
ఓ రవి గ్రహణ ఓదనుజాంతక
మారులేక మతి మలసితిగా
దారుణపు వినతా తనయాదులు
గారవింప నిటు కలిగితిగా ॥
ఓ దశముఖ హర ఓ వేంకటపతి -
పాదసరోరుహ పాలకుడా
ఈ దేహముతో ఇన్నిలోకములు
నీదేహమెక్క నిలిచితిగా ॥

## 71. ఔనయ్యా జాణడవ్వు

ఔనయ్యా జాణడవు ప్రహ్లాద వరద
ఆనలు వెట్టకుము ప్రహ్లాద వరద ॥
వేసరక శ్రీ సతితో వేడుక నవ్వులు నవ్వి
ఆసలు చూపేవు ప్రహ్లాద వరద
సేస వెట్టిన చేతుల చెరగు వట్టి తీసేవు
ఆ సుద్దులె చెప్పేను ప్రహ్లాద వరద ॥
నంటున తొడమీదను నలినాక్షి నెక్కించుక
అంటేవు సిగ్గులు ప్రహ్లాద వరద
గెంటక ఏ పొద్దును కేలు కేలు కీలించుక
అంటువాయ వదివో ప్రహ్లాద వరద ॥

కందువతో కాగిలించి కైవసము సేసుకొంటి
వందముగ నీకేను ప్రహ్లాద వరద
పొంది శ్రీవేంకటమున పొంచి ఔభళములోన
అంది వరాలిచ్చేవు ప్రహ్లాద వరద ॥

## 72. కట్టెదుర వైకుంఠము

కట్టెదుర వైకుంఠము కాణాచయినకొండ
తెట్టెలాయ మహిమలే తిరుమల కొండ ॥
వేదములే శిలలై వెలసినదికొండ
యేదెస పుణ్యరాసులే యేరులైనదికొండ
గాదిలి బ్రహ్మాది లోకముల కొనలకొండ
శ్రీదేవుడుండేటి శేషాద్రి యీకొండ ॥
సర్వదేవతలు మృగజాతులై చరించేకొండ
నిర్వహించి జలధులే నిట్టచరులైన కొండ
వుర్వి తపసులే తరువులై నిలిచిన కొండ
పూర్వపు టంజనాద్రి యీపొడవాటి కొండ ॥
వరములు కొటారుగా వక్కణించి పెంచేకొండ
పరగు లక్ష్మీకాంతు సోబనపుకొండ
కురిసి సంపదలెల్ల గుహల నిండిన కొండ
విరివైన దిదివో శ్రీవేంకటపుకొండ ॥

## 73. కడలుడిపి నీరాడగా

కడలుడిపి నీరాడగా తలచువారలకు
కడలేని మనసుకు కడమ యెక్కడిది ॥
దాహ మణగిన వెనుక తత్వమెఱిగెదనన్న
దాహమేలణగు తా తత్వమే మెఱుగు
దేహంబు గలయన్ని దినములకును పదార్థ
మోహమేలణగు తా ముదమేల కలుగు ॥





ముందరెఱిగిన వెనుక మొదలు మఱచెదనన్న
ముందరే మెఱగు తా మొదలేల మఱచు
అందముగ తిరువేంకటాద్రీశు మన్ననల
కందువెఱిగిన మేలు కలనైన లేదు ॥

## 74. కదిరి నృసింహుడు

కదిరి నృసింహుడు కంభమున వెడలె
విదితముగా సేవింపరో మునులు ॥
ఫాలలోచనము భయదోగ్రముఖము
జ్వాలామయ కేసరములును
కాలరౌద్ర సంఘటిత దంతములు
హేలాగతి ధరియించుక నిలచె ॥
ముడివడు బొమ్మలు ముంచిన ఊర్పులు
గడగడ నదరెటి కటములును
నిడుద నాలుకయు నిక్కు కర్ణములు
అడియాలపు రూపై వెలసె ॥
సకలాయుధములు సహస్ర భుజములు
వికట నఖంబులు వెసబూని
వెకలి యగుచు శ్రీ వేంకటేశ్వరుడు
ప్రకటపు దుష్టుల భంజించె నిదివో ॥

## 75. కరుణానిధిం

కరుణానిధిం గదాధరం
శరణాగత వత్సలం భజే ॥
శుకవరదం కౌస్తుభాభరణం
అకారణప్రియ మనేకదం
సకల రక్షకం జయాధికం సే
వకపాలక మేవం భజే ॥

పురగ శయనం మహోజ్జ్వలం తం
గరుడారూఢం కమనీయం
పరమపదేశం పరమం భవ్యం
హరిం దనుజభయదం భజే ॥
లంకా హరణం లక్ష్మీ రమణం
పంకజసంభవ భవప్రియం
వేంకటేశం వేదనిలయం శు
భాంకం లోకమయం భజే ॥

### 76. కరుణించవే

కరుణించవే నిజగతి బోధించవే
హరినిన్ను కొలువగ అలసీ ప్రాణి
కలలో నింతుల కలసి నట్లనే
వెలికాంతలలోడి వేడుకలు
లలి నిందుకుగా లంపటములు బడి
పలుమారు నూరక బడలీ ప్రాణి
నిన్నటి యాహార నిజరుచి వలెనే
అన్నువ నిప్పటి ఆహారము
యెన్న నిందుకే యిడుముల బొరలుచు
కన్నగతుల కడు కలగీ ప్రాణి
పరుసము సోకిన బంగారమువలె
పరమ భాగవత పట్టములు
అరయగ శ్రీ వేంకటాధిప నీకృప
యిరవుగ గని తుదకెక్కీ ప్రాణి

### 77. కలిగెనిదె నాకు

కలిగెనిదె నాకు కైవల్యము
తొలుతనెవ్వరికి దొరకనిది ॥





జయపురుషోత్తమ జయ పీతాంబర
జయ జయ కరుణా జలనిధి
దయ ఎరంగనే ధర్మము నెరగనా
క్రియయిది నీ దివ్య కీర్తనమే ॥
శరణము గోవింద శరణము కేశవ
శరణు శరణు శ్రీ జనార్దనా
పరమమెరంగను భక్తి యెరంగను
నిరతము నాగతి నీ దాస్యమే ॥
నమో నారాయణ నమో లక్ష్మీపతి
నమః పుండరీక నయనా
అమిత శ్రీవేంకటాధిప యిదె నా
క్రమమెల్లను నీ కైంకర్యమే ॥

### 78. కలిగె మాకునిది కైవల్యం

కలిగె మాకు నిది కైవల్యం
కలకాలము హరికథాశ్రవణం ॥
అచింత్య మద్భుత మానందం
ప్రచురం దివ్యం పావనం
సుచరిత్రం శ్రుతి శోభితం
అచలం బిదివో హరికీర్తనం ॥
నిరతం నిత్యం నిఖిల శుభకరం
దురితహరం భవదూరం
పరమ మంగళం భావాతీతం
కరివరదం నిజకైంకర్యం ॥
సులభం సుఖదం శోకనాశనం
ఫలదం లలితం భయహరణం

కలితం శ్రీ వేంకటపతి శరణం
జలజోదర నిచ్చ స్తోత్రం ॥

## 79. కంటి నఖిలాండకర్త

కంటి అఖిలాండ కర్తనధికుని గంటి
కంటి నఘములు వీడుకొంటి నిజమూర్తి గంటి ॥
మహనీయ ఘనఫణామణుల శైలము గంటి
బహు విభవముల మంటపములు గంటి
సహజ నవరత్న కాంచనవేదికలు గంటి
రహివహించిన గోపురంబులవె కంటి ॥
పావనంబైన పాపవినాశనము గంటి
కైవశంబగు గగనగంగ గంటి
దైవికపు పుణ్య తీర్థములెల్ల పొడగంటి
కోవిదులు కొనియాడు కోనేరుగంటి ॥
పరమయోగీంద్రులకు భావగోచరమైన
సరిలేని పాదాంబుజములు గంటి
తిరమైన గిరిచూపు దివ్య హస్తము గంటి
తిరువేంకటాచలధిపు చూడగంటి ॥

## 80. కంటిమి నేడిదె

కంటిమి నేడిదె గరుడాచలపతి
యింటి వేలుపగు యీశ్వరుడితడు ॥
శ్రీ నరసింహుడు చిన్మయకాంతుడు
దానవాంతకుడు దయానిధి
నానా మహిమల నమ్మిన వారిని
పూనుక కాచే పోషకుడితడు ॥





దేవాది దేవుడు దినకర తేజుడు
జీవాంతరంగుడు శ్రీవిభుడు
దైవ శిఖామణి తలచిన వారిని
సేవలుగొని కాచే విభుడితడు ॥
పరమమూర్తి హరి ప్రహ్లాద వరదుడు
కరుణానిధి బుధకల్పము
పరగు శ్రీ వేంకటపతి తనదాసుల
నరుదుగ కాచే అనంతుడితడు ॥

## 81. కంటి శుక్రవారము

("అన్నమాచార్య జీవిత చరిత్ర పీఠిక" నుండి)

కంటి శుక్రవారము గడియ లేడింట
అంటి అలమేల్మంగ అండనుండే స్వామిని ॥
సొమ్ములన్నీ కడబెట్టి సొంపుతో గోణముగట్టి
కమ్మని కదంబము కప్పు పన్నీరు
చెమ్మతోన వేష్టువలు రొమ్ముతల మొలచుట్టి
తుమ్మెద మైచాయతోన నెమ్మది నుండే స్వామిని ॥
పచ్చకప్పురమె నూఱి పసిడి గిన్నెల నించి
తెచ్చి శిరసాదిగ దిగనలది
అచ్చెరపడి చూడ అందరి కన్నులకింపై
నిచ్చెమల్లెపూవు వలె నిటుతానుండే స్వామిని ॥
తట్టు పునుగె కూరిచి చట్టలు చేరిచి నిప్పు
పట్టి కరగించి వెండి పళ్యాల నించి
దట్టముగ మేనునిండ పట్టించి దిద్ది
బిట్టు వేడుక మురియుచుండే బిత్తరి స్వామిని ॥

## 82. కులుకక నడవరో

కులుకక నడవరో కొమ్మలాలా
జలజల రాలీని జాజులు మాయమ్మకు ॥

ఒయ్యనే మేను కదలీ నొప్పుగా నడవరో
గయ్యాళి శ్రీ పాదతాకు కాంతాలాలా
పయ్యెద చెరగు జారీ భారపు గుబ్బలమీద
అయ్యో చెమరించీ  మాయమ్మకు నెన్నుదురు ॥

చల్లెడి గందవొండి మైజారీ నిలువరో
పల్లకి వట్టిన ముద్దు పణతులాలా
మొల్లమైన కుందనపు ముత్యాల కుచ్చులదర
గల్లనుచు కంకణాలు కదలీ మాయమ్మకు ॥

జమళి ముత్యాలతోడి చమ్మాళిగ లిడరో
రమణికి మణుల ఆరతు లెత్తరో
అమరించి కౌగిట అలమేలు మంగ నిదె
సమకూడె వేంకటేశ్వరుడు మాయమ్మకు ॥

## 83. కొమ్మలాలా ఎంతవాడె

కొమ్మలాలా ఎంతవాడె గోవిందరాజు
కుమ్మరించీ రాజసమే గోవిందరాజు ॥

ఉలిపచ్చి నవ్వులతో ఒత్తిగిలి పవళించి
కొలువు సేయించు కొనీ గోవిందరాజు
జలజాక్షు లిద్దరును సరిపాదా లొత్తగాను
కొలదిమీర మెచ్చీనీ గోవిందరాజు ॥

అదె నాభికమలాన అజుని పుట్టించి తాను
కొదలేక వున్నవాడు గోవిందరాజు
చెదరక తన వద్ద సేవ సేసే సతులకు
గుదిగుచ్చీ వలపులు గోవిందరాజు ॥





ఒప్పుగా వామకరము ఒగిచాచి వలకేల
కొప్పు కదునెత్తినాడు గోవిందరాజు
ఇప్పుడు శ్రీ వేంకటాద్రి నిరవై శంఖుచక్రాలు
కుప్పె కటారము(లు) పట్టె గోవిందరాజు ॥

## 84. కొలనిదోపరికి గొబ్బిళ్ళో

కొలనిదోపరికి గొబ్బిళ్ళోయదు
కులస్వామికి గొబ్బిళ్ళో ॥

కొండ గొడుగుగా గోవులగాచిన
కొండుక శిశువుకు గొబ్బిళ్ళో
దుండగంపుదైత్యుల కెల్లను తల
గుండు గండనికి గొబ్బిళ్ళో ॥

పాప విధుల శిశుపాలుని తిట్టుల
కోపగానికిని గొబ్బిళ్ళో
యేపున కంసుని యిడుమలబెట్టిన
గోపబాలునికి గొబ్బిళ్ళో ॥

దండి వైరులను తఱిమిన దనుజుల
గుండె దిగులునకు గొబ్బిళ్ళో
వెండిపైడియగు వేంకటగిరి పై
కొండలయ్యకును గొబ్బిళ్ళో ॥

## 85. కొలువుడీ భక్తి కొండల

కొలువుడీ భక్తి కొండల కోనేటి
నిలయుని శ్రీనిధియైన వాని ॥

ఆది దేవుని అభవుని సామ
వేదనాద వినోదుని నెర -
వాదిజితప్రియుని నిర్మల తత్త్వ -
వాదుల జీవనమైన వాని ॥

దేవదేవుడైన దివ్యుని సర్వ
భావాతీత స్వభావుని
శ్రీవేంకటగిరి దేవుడైన పర -
దేవుని భూదేవ తత్పరుని ॥

## 86. కొలువైవున్నాడు వీడె

కొలువై వున్నాడు వీడె గోవిందరాజు
కొల కొల నేగి వచ్చే గోవిందరాజు ॥
గొడుగుల నీడల గోవిందరాజు
గుడిగొన్న పడగెల గోవిందరాజు
కుడియెడమ కాంతల గోవిందరాజు
కొడిసాగె పవుజుల గోవిందరాజు ॥
గొప్ప గొప్ప పూదండల గోవిందరాజు
గుప్పేటి వింజామరల గోవిందరాజు
కొప్పుపై చుంగుల తోడి గోవిందరాజు
కుప్పి కటారముతోడి గోవిందరాజు ॥
గొరబు సింగారాల గోవిందరాజు
కురులు దువ్వించుకొని గోవిందరాజు
తిరుపతిలోనను తిరమై శ్రీ వేంకటాద్రి
కురిసీ వరము లెల్ల గోవిందరాజు ॥

## 87. కొండలలో నెలకొన్న

కొండలలోనెలకొన్న కోనేటిరాయడు వాడు
కొండలంతవరములు గుప్పెడు వాడు ॥
కుమ్మరదాసుడైన కురువరతినంబి
ఇమ్మన్నవరములెల్ల నిచ్చినవాడు
దొమ్ములు సేసినయట్టి తొండమాంజక్కురవర్తి
రమ్మన్న చోటికి వచ్చి నమ్మినవాడు ॥





అచ్చపువేడుకతో అనంతాళువారికి
ముచ్చిలి వెట్టికి మన్ను మోచినవాడు
మచ్చిక దొలక తిరుమలనంబితోడుత
నిచ్చనిచ్చ మాటలాడి నొచ్చినవాడు ॥
కంచిలోన నుండ తిరుకచ్చినంబిమీద కరు -
ణించి తనయెడకు రప్పించినవాడు
యెంచ నెక్కుడైన వేంకటేశుడు మనలకు
మంచివాడై కరుణ పాలించినవాడు ॥

## 88. కోడెకాడు వీడె వీడె

కోడె కాడు వీడె వీడె గోవిందుడు
కూడె ఇద్దరు సతుల గోవిందుడు
గొల్లెతల వలపించె గోవిందుడు
కొల్లలాడె వెన్నలు గోవిందుడు
గుల్ల సంకు చక్రముల గోవిందుడు
గొల్లవారింట పెరిగె గోవిందుడు
కోలచే పసుల గాచె గోవిందుడు
కూల గుమ్మె కంసుని గోవిందుడు
గోవ వేల కొండెత్తె గోవిందుడు
గూలెపు సతుల దెచ్చె గోవిందుడు
కుందనపు చేలతోడి గోవిందుడు
గొందులు సందులు దూరె గోవిందుడు
కుందని శ్రీ వేంకటాద్రి గోవిందుడు
గొంది దోసెనసురుల గోవిందుడు

## 89. కోరుదు నామది

కోరుదునామది ననిశము గుణాధరు నిర్గుణ కృష్ణుని
నారాయణు విశ్వంభరు నవనీతాహారుని ॥

కుండలిమణిమయ భూషణు కువలయదళ వర్ణాంగుని
అండజపతి వాహనుని అగణిత భవహరుని
మండనచోరక దమనుని మాలాలంకృత వక్షుని
నిండుకృపాంబుధి చంద్రుని నిత్యానందుని ॥
ఆగమపుంజ పదార్థుని ఆపత్సఖ సంభూతుని
నాగేంద్రాయత తల్పుని నానా కల్పుని
సాగబ్రహ్మమయాఖ్యుని సంతత గాన విలోలుని
వాగీశ్వర సంస్తోత్రుని వైకుంఠోత్తముని ॥
కుంకుమవసంత కాముని గోపాంగన కుచలిప్తుని
శంకర సతీమణి నుతుని సర్వాత్ముని సముని
శంకనినాద మృదంగుని చక్రాయుధ విదీప్తుని
వేంకటగిరి నిజవాసుని విభవ విధాయకుని ॥

## 90. క్షీరాబ్ధికన్యకకు

క్షీరాబ్ధి కన్యకకు శ్రీ మహాలక్ష్మికిని
నీరజాలయమునకు నీరాజనం ॥
జలజాక్షి మోమునకు జక్కవ కుచంబులకు
నెలకొన్న కప్పురపు నీరాజనం
అలివేణి తురుమునకు హస్తకమలంబులకు
నిలువుమాణిక్యముల నీరాజనం ॥
చరణ కిసలయములకు సకియరంభోరులకు
నిరతమగు ముత్తేల నీరాజనం
అరిది జఘనంబునకు అతివ నిజనాభికిని
నిరతి నానావర్ణ నీరాజనం ॥
పగటు శ్రీ వేంకటేశు పట్టపురాణియై
నెగడు సతికళలకును నీరాజనం





జగతి నలమేల్మంగ చక్కదనములకెల్ల
నిగుడు నిజ శోభనపు నీరాజనం ॥

## 91. గరుడ గమన

గరుడ గమన గరుడ ధ్వజ
నరహరి నమో నమో నమో
కమలాపతి కమలనాభ
కమలజన్మ కారణిక
కమలనయన కమలాప్తకుల
నమో నమో హరి నమో నమో
జలధి బంధన జలధి శయన
జలధి మధ్య జంతుకల
జలధిజామాత జలధి గంభీర
హలధర నమో హరి నమో
ఘన దివ్యరూప ఘనమహిమాంక
ఘన ఘనా ఘన కాయవర్ణ
అనఘ శ్రీ వేంకటాధిపతేహం
అనుపమ నమో హరి నమో

## 92. గరుడాద్రి వేదాద్రి

గరుడాద్రి వేదాద్రి కలిమి ఈపె
సిరులొసగీ చూడరో చింతామణి ఈపె ॥
పాలజలధి పుట్టిన పద్మాలయ ఈపె
లాలిత శ్రీ నారసింహు లక్ష్మి ఈపె
మేలిమి లోకమాతయై మించిన మగువ ఈపె
ఈ లీల లోకములేలే ఇందిర ఈపె ॥
ఘన సంపదలొసగు కమలాకాంత ఈపె
మనిసిజుగనిన రమాసతి ఈపె

అనిశము బాయని మహా హరిప్రియ ఈపె
ధన ధాన్య రూపపు శ్రీ తరుణి ఈపె ॥
రచ్చల వెలసినట్టి రమావనిత ఈపె
మచ్చిక గల అలమేల్మంగ ఈపె
ఇచ్చటి వేంకటాద్రిని అహోబలము నందు
నిచ్చలూ తావుకొనిన నిధానము ఈపె ॥

## 93. గురుతెరిగిన దొంగ

గురుతెరిగిన దొంగ కూగూగు వీడె
గుటిలోనె దాగీని కూగూగు ॥
నెలతల దోచీని నీళ్ళాడగానే
కొలని దరిని దొంగ కూగూగు
బలువైన వుట్ల పాలారగించీని
కొలది మీఱిన దొంగ కూగూగు ॥
చల్లలమ్మంగ చనుకట్టుదొడికీని
గొల్లెతలను దొంగ కూగూగు
యిల్లిల్లు తప్పక యిందరి పాలిండ్లు
కొల్లలాడిన దొంగ కూగూగు ॥
తావుకొన్న దొంగ తగిలి పట్టుండిదె
గోవులలో దొంగ కూగూగు
శ్రీ వేంకటగిరి చెలువుండో యేమో
కోవిదుడగు దొంగ కూగూగు ॥

## 94. గోవింద గోవింద

గోవింద గోవింద యని కొలువరే
గోవిందా యని కొలువరే ॥
హరిఅచ్చుతాయని ఆడరే
పురుషోత్తమాయని పొగడరే





పరమ పురుషాయని పలుకరే
సిరివర యనుచును చెలగరే జనులు ॥
పాండవవరదా యని పాడరే
అండజవాహను గొని యాడరే
కొండలరాయనినే కోరరే
దండితో మాధవునినే తలచరే జనులు ॥
దేవుడు శ్రీవిభుడని తెలియరే
శోభల అనంతుని చూడరే
శ్రీ వేంకటనాధుని చేరరే
పావనమై ఎపుడు బ్రతుకరే జనులు ॥

## 95. గోవింద నందనందన

**(పెద తిరుమలాచార్యుల రచన)**

గోవింద నందనందన గోపాలకృష్ణ నీ
భావము మాకు చిక్కె గోపాలకృష్ణ ॥
కొంగువట్టే వదేమోయి గోపాలకృష్ణా, మా
పంగెన కోపుదువా గోపాలకృష్ణ
గొంగతనాల నవ్వేవు గోపాలకృష్ణ
బంగారు కాశతోడి గోపాలకృష్ణ ॥
కొమ్మల చీర లంటిన గోపాలకృష్ణ
పమ్మినిన్ను తిట్టము గోపాలకృష్ణ
కుమ్మరించే వేల సిగ్గు గోపాలకృష్ణ
బమ్మెర పోకిందుల గోపాలకృష్ణ ॥
కొసరకుమంత నీవు గోపాలకృష్ణ నీ
పస నేనెఱుగనా గోపాలకృష్ణ
పొసగ శ్రీ వేంకటాద్రి పొందితి నిన్ను
పసిమెక్కె మొగము గోపాలకృష్ణ ॥

## 96. గోవిందాది నామోచ్చారణ

గోవిందాది నామోచ్చారణ
కొల్లలు దొరకెను మనకిపుడు
ఆవల నీవల నోరగుమ్మలుగ
ఆడుద మీతని పాడుదము ॥
సత్యము సత్యము సకల సురలలో
నిత్యుడు శ్రీహరి నిర్మలుడు
ప్రత్యక్షమిదే ప్రాణుల లోపల
అత్యంతము శరణనరో ఇతని ॥
చాటెడి చాటెడి సకల వేదములు
పాటించిన హరి పరమమని
కూటస్థుడితడు గోపవధూపతి
కోటికి ఈతని కొలువరో జనులు ॥
నిలుచున్నాడిదె నేడును నెదుటను
కలిగిన శ్రీ వేంకట విభుడు
వలసిన వారికి వరదుండీతడు
కలడు కలడితని కని మనరో ॥

## 97. గోవిందాశ్రిత

(పెద తిరుమలాచార్యుల రచన)

గోవిందాశ్రిత గోకులబృందా
పావన జయజయ పరమానందా ॥
జగదభిరామా సహస్రనామా
సుగుణధామా సంస్తుత నామా
గగనశ్యామా ఘనరిపు భీమా
అగణిత రఘువంశాంబుధిసోమ ॥





జననుత చరణా శరణ్య శరణా
దనుజహరణ లలితస్ఫురణా
అనఘాచరణాయత భూభరణా
దినకర సన్నిభ దివ్యాభరణా ॥
గరుడతురంగా కాలోత్తుంగ
శరధిభంగ ఫణిశయనాంగా
కరుణాపాంగా కమలాసంగా
వర శ్రీ వేంకటగిరిపతి రంగా ॥

## 98. చక్కని తల్లికి చాంగుభళా

చక్కని తల్లికి చాంగుభళా తన
చక్కెర మోవికి చాంగుభళా ॥
కులికెడి మురిపెపు కుమ్మరింపు తన
సళుపు చూపులకు చాంగుభళా
పలుకుల సొలపుల పతితో కసరెడి
చలముల యలుకకు చాంగుభళా ॥
కిన్నెరతో పతి కెలన నిలుచు తన
చన్ను మెఱుగులకు చాంగుభళా
ఉన్నతి పతిపై నొరగి నిలుచు తన
సన్నపు నడిమికి చాంగుభళా ॥
జందెపు ముత్యపు సరుల హారముల
చందనగంధికి చాంగుభళా
విందయి వేంకటవిభు పెనచిన తన
సందిదండలకు చాంగుభళా ॥

## 99. చక్రమా హరిచక్రమా

చక్రమా హరి చక్రమా
వక్రమైన దనుజుల వక్కలించవో ॥

చుట్టిచుట్టి పాతాళము చొచ్చి హిరణ్యాక్షుని
చట్టలు చీరిన ఓ చక్రమా
పట్టిన శ్రీహరిచేత పాయక ఈ జగములు
ఒట్టుకొని కావగదవొ ఓ చక్రమా ॥
పానుకొని దనుజుల బలుకిరీట మణుల
సానలు తీరిన ఓ చక్రమా
నానా జీవముల ప్రాణములుగాచి ధర్మ –
మూని నిలుపగదవో ఓ చక్రమా ॥
వెరచి బ్రహ్మాదులు వేదమంత్రముల నీ
వురుట్లు కొనియాడే రో చక్రమా
అరిమురి తిరువేంకటాద్రీశు వీధుల
ఒరవుల మెరయుదువో ఓ చక్రమా ॥

## 100. చదివి బతుకరో

చదివి బతుకరో సర్వజనులు మీరు
కదిసి నారాయణాష్టాక్షర మిదియే
సాధించిమున్ను శుకుడు చదివినట్టి చదువు
వేదవ్యాసులు చదివిన చదువు
ఆదికాలపు వైష్ణవుల అందరి నోటి చదువు
గాదిలి నారాయణాష్టాక్షర మిదియే
సతతము మునులెల్ల చదివినట్టి చదువు
వెతదీర బ్రహ్మ చదివిన చదువు
జతనమై ప్రహ్లాదుడు చదివినట్టి చదువు
గతిగా నారాయణాష్టాక్షర మిదియే
చలపట్టి దేవతలు చదివినట్టి చదువు
వెలయ విప్రులు చదివేటి చదువు





పలుమారు శ్రీ వేంకటపతి నామమై భువి
గలుగు నారాయణాష్టాక్షర మిదియే

## 101. చందమామ రావో

("అన్నమాచార్య జీవిత చరిత్ర పీఠిక" నుండి)

చందమామ రావో జాబిల్లి రావో, మంచి
కుందనపు పైడికోర వెన్నపాలు తేవో ॥
నగుమోము చక్కనయ్యకు నలువపుట్టించిన తండ్రికి
నిగమములందుండే అప్పకు మా నీలవర్ణునికి
జగమెల్ల ఏలిన స్వామికి చక్కని ఇందిర మగనికి
ముగురికి మొదలైన ఘనునికి మా ముద్దుల మురారి బాలునికి
తెలిదమ్మి కన్నులమేటికి మంచి తియ్యని మాటల గుమ్మకు
కలికిచేతల కోడెకు మా కతలకారి ఈ బిడ్డకు
కులముద్ధరించిన పట్టెకు మంచి గుణములు కలిగిన కోడెకు
నిలువెల్ల నిండవొయ్యారికి నవనిధుల చూపుల చూచేసుగుణునకు
సురలగాచిన దేవరకు చుంచు గరుడునెక్కిన గబ్బికి
నెరవాది బుద్ధుల పెద్దకు మా నీటు చేతలపట్టికి
విరుల వింటివాని అయ్యకు వేవేలురూపుల స్వామికి
సిరిమించునెరవాది జాణకు మా శ్రీ వేంకటనాధునికి ॥

## 102. చాలదా బ్రహ్మమిది

చాలదా బ్రహ్మమిది సంకీర్తనం మీకు
జాలెల్ల నడగించు సంకీర్తనం ॥
సంతోషకరమైన సంకీర్తనం
సంతాప మణగించు సంకీర్తనం
జంతువుల రక్షించు సంకీర్తనం
సంతతము దలచుడీ సంకీర్తనం ॥

సామజము గాచినది సంకీర్తనం
సామమున కెక్కుడీ సంకీర్తనం
సామీప్య మిందరికి సంకీర్తనం
సామాన్య మా విష్ణు సంకీర్తనం ॥

జముబారి విడిపించు సంకీర్తనం
సమబుద్ధి వొడమించు సంకీర్తనం
జమళి సౌఖ్యము లిచ్చు సంకీర్తనం
శమదమాదుల జేయు సంకీర్తనం ॥

జలజాసనుని నోరి సంకీర్తనం
చలిగొండసుత దలచు సంకీర్తనం
చలువ కదు నాలుకకు సంకీర్తనం
చలపట్టి తలచుడీ సంకీర్తనం ॥

సరవి సంపదలిచ్చు సంకీర్తనం
సరిలేని దిదియపో సంకీర్తనం
సరుస వేంకటవిభుని సంకీర్తనం
సరుగనను తలచుడీ సంకీర్తనం ॥

## 103. చాలదా మా జన్మము

చాలదా మా జన్మము నీ
పాలింటి వారమై బ్రతుకగ గలిగే

కమలాసనాదులు కానని నీపై
మమకారము సేయ మార్గము గలిగె
అమరేంద్రాదులకు అందరాని నీ
కొమరైన నామము కొనియాడ గలిగే

సనకాదులును కాన జాలని నిన్ను
తనివోక మతిలోన తలపోయ గలిగె





ఘన మునీంద్రులకు అగమ్యమైవున్న
నిను సంతతము వర్ణింప గలిగే

పరమమై భవ్యమై పరగిన నీ
యిరవిట్టిదని మాకు నెఱుగంగ గలిగె
తిరువేంకటాచలాధిప నిన్ను యీ
ధరమీద పలుమారు దరిసింపగలిగె

## 104. చాలదా హరినామ

చాలదా హరినామ సౌఖ్యామృతము
తమకు చాలదా హితవైన చవులెల్ల నొసగ ॥

ఇది ఒకటి హరినామ మింతైన చాలదా
చెదరకీ జన్మములో చెరలు విడిపించ
మదినొకటి హరినామ మంత్రమది చాలదా
పదివేల నరకకూపములు వెడలింప ॥

కలదొకటి హరినామ కనకాద్రి చాలదా
తొలగుమని దారిద్ర్య దోషంబు చెరుచ
తెలివొకటి, హరినామ దీపమది చాలదా
కలుషంపు కఠిన చీకటి పారద్రోల

తగువేంకటేశు కీర్తనమొకటి చాలదా
జగములో కల్పము జంబువలె నుండ
సొగసి ఈ విభుని దాసుల కరుణచాలదా
నగవు చూపులను ఉన్నతమిపుడ చూప ॥

## 105. చిత్తజగురుడానీకు

చిత్తజగురుడా నీకు శ్రీ మంగళం, మా
చిత్తములో హరి నీకు శ్రీ మంగళం ॥

బంగారు బొమ్మవంటి పడతినురము మీద
సింగారించిన నీకు శ్రీ మంగళం
రంగుమీర పీతాంబరము మొలగట్టుకొని
చెంగలించే హరి నీకు శ్రీ మంగళం ॥
వింతనీలముల వంటి వెలదిని నీ పాదముల
చెంతపుట్టించిన నీకు శ్రీ మంగళం
కాంతుల కౌస్తుభమణిఁగట్టుక భక్తులకెల్ల
చింతామణివైన నీకు శ్రీ మంగళం ॥
అరిది పచ్చలవంటి అంగన శిరసుమీద
శిరుల దాల్చిన నీకు శ్రీ మంగళం
గరిమ శ్రీ వేంకటేశ ఘన సంపదతోడి
సిరివరా నీకు నిదే శ్రీ మంగళం ॥

## 106. చిన్ని శిశువు

చిన్ని శిశువు చిన్ని శిశువు
ఎన్నడు చూడమమ్మ ఇటువంటి శిశువు ॥
తోయంపు కురులతోడ తూగేటిశిరసు, చింత
కాయలవంటి జడల గములతోడ
మ్రోయుచున్న కనకపు మువ్వల పాదాలతోడ
పాయక యశోద వెంట పారాడు శిశువు ॥
ముద్దుల వ్రేళ్ళతోడ మొరవంక యుంగరాల
నిద్దపు చేతుల పైడి బొద్దుల తోడ
అద్దపు చెక్కులతోడ అప్పలప్పలనినంత
గద్దించి యశోదమేను కౌగిలించు శిశువు ॥
బలుపైన పొట్ట మీది పాలచారలతోడ
నులివేడి వెన్నతిన్న నోరితోడ





చెలగి నేడిదే వచ్చి శ్రీ వేంకటాద్రిపై
నిలిచి లోకములెల్ల నిలిపిన శిశువు ॥

## 107. చీచీ నరులదేటి

చీచీ నరులదేటి జీవనము
కాచుక శ్రీ హరి నీవే కరుణింతుగాక ॥
అడవిలో మృగజాతియైనా కావచ్చు గాక
వడి నితరుల కొలువగ వచ్చునా
వుడివోని పక్షియై వుండనైనా వచ్చుగాక
విడువ కెవ్వరినైనా వేడవచ్చునా ॥
పసరమై వెతలేని పాటుపడవచ్చుగాక
కసటు వొనరుల పొగడవచ్చునా
వుసురు మానై పుట్టి వుండనైనా వచ్చుగాక
దెసల నెక్కడ నైనా తిరుగవచ్చునా ॥
యెమ్మెల పుణ్యాలు సేసి ఇలనేలవచ్చుగాక
కమ్మి హరిదాసుడు గావచ్చునా
నెమ్మది శ్రీ వేంకటేశ నీ చిత్తమెకాని
దొమ్ముల కర్మము లివి తోయవచ్చునా ॥

## 108. చూడచూడ మాణిక్యాలు

చూడ చూడ మాణిక్యాలు చుక్కలు వలె నున్నవి
యీడులేని కన్నులవె యినచంద్రులు ॥
కంటి గంటి వాడె వాడె ఘనమైన ముత్యాల –
కంటమాల లవే పదకములు నవె
మింటిపొడవైనట్టి మించుకిరీటం బదె
జంటల వెలుగు శంఖచక్రాలవె ॥

మొక్కు మొక్కు వాడె వాడె ముందరనే వున్నాడు
చెక్కులవే నగవుతో జిగిమోమదె
పుక్కిట లోకము లవె భుజకీర్తులును నవె
చక్కనమ్మ అలమేలు జవరాలదె ॥

ముంగైమురాలును నవె మొలకతారును నదె
బంగారునిగ్గులవన్నె పచ్చుబట్టదె
యింగిత మెరిగి వేంకటేశుడిదె కన్నులకు
ముంగిటినిధానమైన మూలభూతమదే ॥

## 109. చూడరమ్మ సతులాల

చూడరమ్మ సతులాల సోబాన పాడరమ్మ
కూడున్నది పతి చూడికుడుత నాంచారి ॥

శ్రీమహాలక్ష్మి యట సింగారాలకే మరుదు
కాముని తల్లియట చక్కదనాలకే మరుదు
సోముని తోబుట్టువట సొంపుకళలకే మరుదు
కోమలాంగి ఈ చూడికుడుత నాంచారి ॥

కలశాబ్ధి కూతురట గంభీరాలకే మరుదు
తలపలోకమాతయట దయ మరి ఏమరుదు
జలజ నివాసినియట చల్లదనమే మరుదు
కొలదిమీర ఈ చూడికుడుత నాంచారి ॥

అమరవందితయట అట్టే మహిమ ఏమరుదు
అమృతము చుట్టమట ఆనందాలకే మరుదు
తమితో శ్రీ వేంకటేశు తానె వచ్చి పెండ్లాడే
కొమెర వయస్సు ఈ చూడికుడత నాంచారి ॥

## 110. చూడవమ్మ యశోదమ్మ

చూడవమ్మ యశోదమ్మ ఓయశోదమ్మ
వాడలవాడల వరదలివిగో ॥





పొంచి పులిపాలు పెరుగులు
మించు మించు మీగడలు
వంచివారలు వట్టీన
కంచపుటుట్ల కాగులివిగో

పేరీపేరని నేతులు
చూరలు వెన్నల జున్నులును
ఆరగించి అట సగపాళ్ళు
పారవేసిన బానలివిగో

తెల్లనీ కనుతీగల సోగల
చల్లలమ్మేటి జవ్వనుల
చెల్లినట్లనే శ్రీ వేంకటాపతి
కొల్లలాడిన గురుతులివిగో

## 111. చెప్పరాని మహిమల

చెప్పరాని మహిమల శ్రీదేవు దితడు
కప్పి కన్నుల పండుగగా జూడరో

అద్దుచు కప్పుర ధూళి యట్టెమేన నలదగా
వొద్దిక దేవుని భావమూహించితేను
ముద్దులు విసిరినట్టి మంచి బాలకృష్ణునికి
ముద్దులకాంతి మేన మలసినట్టుండె

అమర తట్టుపుణుగు అవధరించగాను
తమితో పోలికలెల్ల దచ్చిచూడగా
యమునానది నాగేట నండ దీసుకొనగా
యమునాది నలుపు అంటిన యట్టుండే

అంగములు శ్రీ వేంకటాధిపున కింతటాను
సింగారించి సొమ్ములెల్ల చెలరేగగా

బంగారపు టలమేలుమంగ నురాననుంచగా
బంగారము మేనెల్లా బరగినట్టందె

## 112. చేరి యశోదకు

చేరి యశోదకు శిశు వితఁడు
ధారుణి బ్రహ్మకు తండ్రియు నితడు
సొలసి చూచినను సూర్యచంద్రులను
లలివెదచల్లెడు లక్షణుడు
నిలిచిన నిలువున నిఖిలదేవతల
కలిగించు సురలగనివో యితడు
మాటలాడినను మరి యజాండములు
కోటులు వొడమేటి గుణరాశి
నీటగు నూర్పుల నిఖిలవేదములు
చాటువ నూరేటి సముద్ర మితడు
ముంగిట పొలసిన మోహన మాత్మల
పొంగించే ఘనపురుషుడు
సంగతి మావంటి శరణాగతులకుఁ
నంగము శ్రీ వేంకటాధిపు డితడు

## 113. జగడపు చనవుల

జగడపు చనవుల జాజర
సగినల మంచపు జాజర ॥
మొల్లలు తురుముల ముడిచిన బరువున
మొల్లపు సరసపు మురిపెమున
జల్లన పుప్పొడి జారగ పతిపై
చల్లే రతివలు జాజర ॥





భారపు కుచముల పైపై గడు సిం -
గారము నెరపెటి గందవొడి
చేరువ పతిపై చిందగ పడతులు
సారెకు చల్లేరు జాజర ॥
బింకపు కూటమి పెనగేటి చెమటల
పంకపు పూతల పరిమళము
వేంకటపతిపై వెలదులు నించేరు
సంకుమదంబుల జాజర ॥

## 114. జయజయ నృసింహా

జయజయ నృసింహ సర్వేశ
భయహర వీర ప్రహ్లాదవరద ॥
మిహిర శశినయన మృగనరవేష
బహిరంతస్థల పరిపూర్ణ
అహినాయక సింహాసన రాజిత
బహుళ గుణగణ ప్రహ్లాదవరద ॥
చటుల పరాక్రమ సమఘనవిరహిత
నిటలనేత్ర మౌని ప్రణుత
కుటిలదైత్యతతి కుక్షి విదారణ
పటు వజ్రనఖ ప్రహ్లాదవరద ॥
శ్రీవనితాసంశ్రితవామాంక
భావజకోటి ప్రతిమాన
శ్రీ వేంకటగిరిశిఖరనివాస
పావనచరిత ప్రహ్లాదవరద ॥

## 115. జయ జయ రామ

జయ జయ రామ సమర విజయ రామ
భయహర నిజ భక్త పారీణ రామా ॥

జలధి బంధించిన సౌమిత్రి రామా
సెలవిల్లు విరచిన సీతారామా
అల సుగ్రీవు నేలిన అయోధ్యరామా
కలిగి యజ్ఞము కాచె కౌసల్యరామా ॥

అరి రావణాంతక ఆదిత్యకులరామా
గురు మౌనులను గాచే కోదండరామా
ధర నహల్యపాలిటి దశరథరామా
హరురాణి నుతుల లోకాభిరామా ॥

అతి ప్రతాపముల మాయామృగాంతక రామా
సుత కుశలవ ప్రియ సుగుణరామా
వితత మహిమల శ్రీ వేంకటాద్రిరామా
మతిలోన బాయని మనువంశరామా ॥

## 116. జయ మంగళము నీకు

జయ మంగళము నీకు సర్వేశ్వరా
జయమంగళము నీకు జలజవాసినికి ॥

శరణాగత పారిజాతమా
పొరి నసురులపాలి భూతమా
అరుదైన సృష్టికి ఆదిమూలమా ఓ
హరీ నమో పరమపుటాలవాలమా ॥

సకల దేవతా చక్రవర్తీ
వెకలివై నిండిన విశ్వమూర్తి
అకలంకమైన దయానిధి ఓ
వికచముఖ (నమో) నమో విధికివిధీ ॥

కొలిచినవారల కొంగుపైడి
ములిగినవారికి మొనవాడి





కలిగిన శ్రీ వేంకటరాయా
మలసి దాసులమైన మాకు విధేయా ॥

## 117. జయలక్ష్మి వరలక్ష్మి

జయలక్ష్మి వరలక్ష్మి సంగ్రామ వీరలక్ష్మి
ప్రియురాలవై హరికి పెరసితి వమ్మ ॥

పాల జలనిధిలోని పసనైన మీగడ
మేలిమి తామెరలోని మించు వాసన
నీలవర్ణునురముపై నిండిన నిధానమవై
ఏలేవు లోకములు మమ్మేలవమ్మ ॥

చందురుతోడబుట్టిన సంపదల మెరుగవో
కందువ బ్రహ్మలగాచే కల్పవల్లివో
అందిన గోవిందునికి అండనే తోడు నీడై
వుందానవు మా యింటనే వుండవమ్మా ॥

పదియారు వన్నెలతో బంగారు పతిమ
చెదరని వేదముల చిగురు బోడి
ఎదుట శ్రీ వేంకటేశు నిల్లాలవై నీవు
నిధుల నిలిచే తల్లి నీవారమమ్మ ॥

## 118. జలజనాభ హరి

జలజనాభ హరి జయ జయ
యిల మా నేరము లెంచకు వయ్యా

బహు ముఖముల నీప్రపంచము
సహజ గుణంబుల చంచలము
మహిమల నీవిది మరిదిగ విడువవు
విహరణ జీవుల విడువగ గలరా

పలునటనల యీ ప్రకృతి యిది
తెలియగ గడు నింద్రియ వశము
కలిసి నీ వందే కాపురము
మలినపు జీవులు మానగ గలరా
యిరవుగ శ్రీ వేంకటేశుడ నీ మాయ
మరలచ నీవే సమర్థుడవు
శరణనుటకే నే శక్తుడను
పరులెవ్వరైనా బాపగ గలరా

## 119. జాణతనాలాడే వేలే

జాణతనాలాడే వేలే జంపు గొల్లెతా వోరి
ఆణిముత్యములుచల్ల లవినీకు కొల్లలా
పోయవే కొసరుచల్ల బొంకు గొల్లెతా వోరి
మాయింటి చల్లేల నీకు మనసయ్యీరా
మూయకువే చల్ల చాడి ముచ్చు గొల్లెతా వోరి
పోయవో పోవో మా చల్ల పులుసేల నీకు నల
చిలుకవే గోరం చల్ల జిడ్డుగొల్లెతా వోరి
పలచని చల్లనీ బాతి గాదురా
కలచవే లోనిచల్ల గబ్బిగొల్లెతా వోరి
తొలరామా చల్లేల దొరవైతి నీకు
అమ్మకువే చల్లలు వొయ్యారి గొల్లెతా వోరి
క్రమ్మర మాతోడ నిట్టే గయ్యాళించేవు
సొమ్మలంబోయే వేలే సొంపుగొల్లెతా వోరి
దిమ్మరికోనేటిరాయ తిరమైతి నీకును

## 120. జీవాతుమై

జీవాతుమై యుండు చిలుకా నీ
వావలికి పరమాత్ముడై యుండు చిలుకా





ఆతుమ పంజరములోన నయమున నుండి నా
చేతనే పెరిగిన చిలుకా
జాతిగా కర్మపు సంకెళ్ళ బడి కాలఁ
జేత బేదైతివే చిలుకా
భాతిగా చదువులు పగలు రేలును నా
చేత నేరిచి నట్టి చిలుకా
రీతిగా దేహంపు రెక్కల చాటున నుండి
సీతకోరువలేని చిలుకా
బెదరి అయిదుగురికిని భీతి బొందుచు గడు
బెదరంగ జూతువే చిలుకా
అదయులయ్యిన శత్రులారుగురికి గాక
అడిచి పడుదువే నీవు చిలుకా
వదలకిటు ఆహార వాంఛ నుటు పదివేలు
వదరులు వదిరేటి చిలుకా
తుదిలేని మమతలు తోరమ్ము సేసినా -
తో గూడి మెలగిన చిలుకా
దైవమానుషములు తలపించి యెపుడు నా -
తలపున బాయని చిలుకా
యేవియును నిజముగా వివి యేటికిని నాకు
నెఱిగించి నటువంటి చిలుకా
నీవన నెవ్వరు నేనన నెవ్వరు
నీవే నేనైయుందు చిలుకా
శ్రీవేంకటాద్రిపై చిత్తములోనుండి
సేవించుకొని గట్టి చిలుకా

## 121. జోవచ్యుతానంద

జోవచ్యుతానంద జోజో ముకుంద
రావె పరమానంద రామ గోవింద ॥

నందు నింటను జేరి నయము మీఱంగ
చంద్రవదనలు నీకు సేవ చేయంగ
నందముగ వారిండ్ల నాడుచుండంగ
మందలకు దొంగ మా ముద్దురంగ ॥

పాలవారాశిలో పవళించినావు
బాలుగా మునుల కభయమిచ్చినావు
మేలుగా వసుదేవు కుదయించినావు
బాలుడై యుండి గోపాలుడైనావు ॥

అట్టుగట్టిన మీగ డట్టె తిన్నాడే
పట్టి కోడలు మూతిపై రాసినాడే
అట్టె తినెనని యత్త యడుగ విన్నాఁడే
గట్టిగా నిది దొంగ కొట్టుమన్నాడే ॥

గొల్లవారిండ్లకు గొబ్బునకుబోయి
కొల్లలుగా త్రావి కుండలను నేయి
చెల్లునా మగనాండ్ర జెలిగి యీశాయీ
చిల్లతనములు సేయ జెల్లునటవోయి ॥

రేపల్లె సతులెల్ల గోపంబుతోను
గోపమ్మ మీ కొడుకు మా యిండ్లలోను
మాపుగానే వచ్చి మా మానములను
నా పాపడే చెఱిచె నేమందుమమ్మ

ఒకని యాలినిదెచ్చి నొకని కడబెట్టి
జగడములు కలిపించి సతిపతులబట్టి
పగలు నలుజాములును బాలుడై నట్టి
మగనాండ్ర చేపట్టి మదనుడై నట్టి ॥

అంగజుని గన్న మా యన్న యిటు రారా
బంగారు గిన్నెలో పాలు పోసేరా





దొంగ నీవని సతులు పొంగుచున్నారా
ముంగిట నాడరా మోహనాకార ॥

గోవర్ధనంబెల్ల గొడుగుగా పట్టి
కావరమ్మున నున్న కంసుపడగొట్టి
నీవు మధురాపురము నేలచేపట్టి
ఠీవితో నేలిన దేవకీపట్టి ॥

అంగుగా తాళ్ళపాకన్నయ్య చాల
శృంగార రచనగా చెప్పెనీ జోల
సంగతిగ సకల సంపదల నీవేళ
మంగళము తిరుపట్ల మదనగోపాల ॥

## 122. డోలాయాంచల

డోలాయాంచల డోలాయాంహరే డోలాయాం
మీన కూర్మ వరాహ మృగపతి అవతారా
దానవారే గుణ శౌరే ధరణి ధర మరుజనక
వామన రామ రామ వరకృష్ణ అవతారా
శ్యామలాంగా రంగ రంగా సామజ వరదమురహణ
దారుణ బుద్ధ కలికి దశవిధ అవతారా
శీరపాణే గోసమాణే శ్రీ వేంకటగిరి కూట నిలయ

## 123. తగునయ్యా హరినీకు

తగునయ్య హరి నీకు దానము తెచ్చుకొనిన
జగములో భూకాంత సౌభాగ్యలక్ష్మి
కిమ్ముల శిశుపాలుని గెలిచి చేకొంటివిగ
సమ్మతించి రుక్మిణి జయలక్ష్మి
అమ్ముమొనను జలధినడచి లంకసాధించి
క్రమ్మరచేకొన్న సీతే ఘన వీరలక్ష్మి

నరకాసురునణచి నవ్వుతా చేయివేసితివి
సరిగా సత్యభామెపో సంగ్రామలక్ష్మి
హిరణ్యకసిపుగొట్టి యింద్రాదులు నీచే
వరమిప్పించిన యాకే వరలక్ష్మి
నిండిన వురముమీద నిఖిల సంపదలతో
అండనుండే యాకే పో ఆదిలక్ష్మి
మెండగు శ్రీ వేంకటాద్రి మీద నీ సరుసనేగే
గండుమీరె కళలతో కళ్యాణలక్ష్మి

## 124. తరుణి నీయలుకకు

తరుణి నీయలుకకు కెంతటి దింతి నీ వేళ
కరుణించగదర వేంకటశైలనాథా
ఒకమారు సంసారమొల్లఁ బొమ్మని తలచు
ఒకమారు విధిసేతలూహించి పొగడు
ఒకమారు తనుచూచి వూరకే తలవూచు
నొకమారు హర్షమున నొంది మే మఱచు ॥
నిన్నుచూచి వొకమారు నిలువెల్ల పులకించు
తన్నుజూచి వొకమారు తలపోసి నగును
కన్ను దెరచి నిను జూచి కడుసిగ్గువడి నిలిచి
యిన్నియును తలపోసి యింతలో మఱచు ॥
వదలైన మొలనూలు గదియించు నొకమారు
చెదరిన కురులెల్ల చెరగు నొకమారు
అదనెరిగి తిరువేంకటాధీశ పొందితివి
చతురుడవు నిను బాయజాల దొకమారు ॥

## 125. త్వమేవ శరణం

త్వమేవ శరణం త్వమేవ శరణం
కమలోదర శ్రీ జగన్నాథా ॥





వాసుదేవ కృష్ణ వామన నరసింహ
శ్రీ సతీశ సరసిజనేత్రా
భూసురవల్లభ పురుషోత్తమ పీత –
కౌసేయవసన జగన్నాథా ॥
బలభద్రానుజ పరమపురుష దుగ్ధ –
జలధివిహార కుంజరవరద
సులభ సుభద్రాసుముఖ సురేశ్వర
కలిదోషహరణ జగన్నాథా ॥
వటపత్రశయన భువనపాలన జంతు –
ఘటకారకరణ శృంగారాధిపా
పటుతర నిత్యవైభవరాయ తిరువేం –
కటగిరినిలయ జగన్నాథా ॥

## 126. తందనానా ఆహి

తందనానా ఆహి తందనాన పురె తందనాన భళా తందనాన ॥
బహ్మమొకటె పరబ్రహ్మమొకటె పరబ్రహ్మమొకటే పరబ్రహ్మమొకటే
కందువగు హీనాధికము లిందు లేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ
ఇందులో జంతుకుల మింతా నొకటే
అందరికి శ్రీహరే అంతరాత్మ ॥
నిండార రాజు నిద్రించు నిద్రయు నొకటే
అండనే బంటునిద్ర అదియు నొకటే
మెండైన బ్రహ్మణుడు మెట్టుభూమి యొకటే
చండాలు డుండేటి సరిభూమి యొకటే ॥
అనుఁగు దేవతలకును అల కామ సుఖమొకటే
ఘనకీటపశువులకు కామసుఖమొకటే

దిన మహోరాత్రములు తెగి ధనాఢ్యునకొకటే
వొనర నిరుపేదకును వొక్కటే అవియు ॥
కొరలి శిష్టాన్నములు కొను నాకలొకటే
తిరుగు దుష్టాన్నములు తిను నాకలొకటే
పరగ దుర్గంధములపై వాయువొకటే
వరుస పరిమళముపై వాయువొకటే॥
కడగి యేనుగు మీద కాయు యెండొకటే
పుడమి శునకము మీద పొలయు నెండొకటే
కడు పుణ్యులను పాప కర్ములను సరిగావ
జడియు శ్రీ వేంకటేశ్వరు నామ మొకటే ॥

## 127. తిరుమల గిరి రాయ

తిరుమల గిరిరాయ దేవ రాహుత్తరాయ
సురత బిన్నాణరాయ సుగుణ కోనేటిరాయ
సిరుల సింగారరాయ చెలువపు తిమ్మరాయ
సరుస వైభవరాయ సకల వినోదరాయ
వర వసంతములరాయ వనితల విటరాయ
గురుతైన తేగరాయ కొండల కోనేటిరాయ
గొల్లెతల ఉద్దండరాయ గోపాలకృష్ణరాయ
చల్లువెదజాణరాయ చల్లపరిమళరాయ
చెల్లువడి ధర్మరాయ చెప్పరానివలరాయ
కొల్లలైన భోగరాయ కొండల కోనేటిరాయ
సామ సంగీతరాయ సర్వమోహనరాయ
ధామ వైకుంఠరాయ దైత్య విభాణరాయ
కామించి నిన్ను కోరితే కరుణించితివి నన్ను
శ్రీమంతుడ నీకు జయ శ్రీ వేంకటరాయ





## 128. తిరువీధుల మెరసీ

తిరువీధుల మెరసీ దేవదేవుడు
గరిమల మించిన సింగారముల తోడను ॥
తిరుదండెల పైనేగీ దేవుడిదే తొలినాడు
సిరుల రెండవనాడు శేషుని మీద
మురిపేన మూడోనాడు ముత్యాలపందిరి క్రింద
పొరి నాలుగోనాడు పువ్వు కోవిల లోను ॥
గక్కన ఐదవనాడు గరుడుని మీద
ఎక్కెను ఆరవనాడు యేనుగు మీద
చొక్కమై ఏడవనాడు సూర్యప్రభలోనను
యిక్కువ తేరును గుఱ్ఱ మెనిమిదోనాడు ॥
కనకపుటందలము కదిసి తొమ్మిదోనాడు
పెనచి పదోనాడు పెండ్లిపీట
ఎనసి శ్రీ వేంకటేశుడింతి అలమేల్మంగతో
వనితల నడుమను వాహనాల మీదను ॥

## 129. తెప్పగా మఱ్ఱాకు మీద

తెప్పగా మఱ్ఱాకు మీద తేలాడువాడు
ఎప్పుడు లోకములెల్ల నేలేటి వాడు ॥
మోత నీటి మడుగులో ఈతగఱచినవాడు
పాతగిలే నూతి క్రింద బాయనివాడు
మూతి దోసిపట్టి మంటిముద్ద పెల్లగించువాడు
రోతయైన పేగుల పేరులు గలవాడు ॥
కోడికూత నోరి వాని కుఱ్ఱ తమ్ముడైనవాడు
బూడిది పూసినవాని బుద్ధులవాడు
మాడవన్నె లేడివెంట మాయలబడినవాడు
దూడల నావుల గాచి దొరయైనవాడు ॥

ఆకసాన పారేవూరి అతివల మానముల
కాకుసేయు వాడు తురగము పైవాడు
ఏకమై వేంకటగిరి నిందిరారమణి గూడి
యే కాలముఁబాయని యెనలేనివాడు ॥

## 130. తెలిసితే

తెలిసితే మోక్షము తెలియకున్న బంధము
కలవంటిది బదుకు ఘనునికిని
అనయము సుఖమేడ దవల దుఃఖమేడది
తనువుపై నాసలేని తత్వమతికి
పొనిఁగితేఁ బాపమేది పుణ్యమేది కర్మమందు
వొనర ఫలమెల్లని యోగికిని
తగినయమృతమేది తలపగ విషమేది
తెగి నిరాహారియైన ధీరునికిని
పగవారనఁగ వేరి బంధులనఁగ వేరీ
వెగటు ప్రపంచమెల్ల విడిచే వివేకికి
వేవేలు విధులందు వెఱపేది మఱపేది
దైవమును నమ్మినయట్టి ధన్యునికిని
శ్రీ వేంకటేశ్వరుఁడు చిత్తములో నున్నవాఁడు
యీవలేది యావలేది యితనిదాసునికి

## 131. తే శరణమహం

తే శరణమహం తే శరణమహం
శైశవకృష్ణా తే శరణం గతోస్మి ॥
దశవిధావతార ధర్మ రక్షకమూర్తి
దశమస్తకాసుర దళన
దశదిశా పరిపూర్ణ తపనీయ స్వరూప
దశావరణ లోక తత్త్వాతీత ॥





సహస్రలోచన సంతత వినుత
సహస్రముఖ శేషశయనా
సహస్రకర కోటి సంపూర్ణతేజా
సహస్రార దివ్య చక్రాయుధా ॥
అనంత చరణా సర్వాధారాధేయ
అనంతకర దివ్యాయుధా
అనంత నిజకల్యాణ గుణార్ణవా
అనంతా శ్రీ వేంకటాద్రి నివాసా ॥

## 132. దాచుకో నీ పాదాలకు

దాచుకో నీ పాదాలకు తగనే జేసిన పూజలివి
పూచి నీ కీరితి రూప పుష్పము లివి అయ్యా ॥
వొక్క సంకీర్తనేచాలు వొద్దికైమమ్ము రక్షించగ
తక్కినవి భండారాన దాచి వుండనీ
వెక్కసమగు నీ నామము వెల సులభము ఫలమధికము
దిక్కై నన్నేలితివిక అవి తీరని నా ధనమయ్యా ॥
నా నాలికపై నుండి నానా సంకీర్తనలు
పూని నాచే నిన్ను పొగడించితివి
వే నామాల వెన్నుడా వినుతించ నెంతవాడ
కానిమ్మని నా కీపుణ్యము గట్టితి వింతే అయ్యా ॥
యీమాట గర్వముగాదు నీ మహిమే కొనియాడితిగాని
చేముంచి నాస్వాతంత్ర్యము చెప్పిన వాడగాను
నేమాన పాడేవాడను నేరము లెంచకుమీ
శ్రీ మాధవ నీ దాసుడ శ్రీ వేంకటేశుడవయ్యా ॥

## 133. దీనుడ నేను

దీనుడ నేను దేవుడవు నీవు
నీ నిజ మహిమే నెరపుట గాక ॥

మతి జనన మెరుగ మరణం బెరుగను
ఇతవుగ నినునిక నెరిగేనా
క్షితిపుట్టించిన శ్రీ పతివి నీవే
తతి నాపై దయ దలతువు గాక ॥

తలచపాపమని తలచపుణ్యమని
తలపున ఇక నిన్నుతలచేనా
అలరిన నాలో అంతర్యామివి
కలుష మెడయు నను గాతువు గాక ॥

తడవ నా హేయము తడవ నా మలినము
తడయక నీ మేలు తడవేనా
విడువలేని శ్రీ వేంకటవిభుడవు
కడదాక నిక గాతువుగాక ॥

## 134. దేవదేవం భజే

దేవదేవం భజే దివ్యప్రభావం
రావణాసురవైరి రణపుంగవం ॥

రాజవరశేఖరం రవికుల సుధాకరం
ఆజానుబాహుం నీలాభ్రకాయం
రాజారి కోదండ రాజ దీక్షాగురుం
రాజీవలోచనం రామచంద్రం ॥

నీలజీమూత సన్నిభశరీరం ఘన వి -
శాలవక్షం విమల జలజనాభం
తాలాహినగహరం ధర్మసంస్థాపనం
భూలలనాధిపం భోగిశయనం ॥

పంకజాసన వినుత పరమనారాయణం
శంకరార్జిత జనకచాపదళనం





లంకావిశోషణం లాలితవిభీషణం
వెంకటేశం సాధు విబుధ వినుతం ॥

## 135. దేవ నమోదేవ

దేవ నమోదేవ
పావన గుణగణభావా ॥

జగదాకారా చతుర్భుజా
గగన నీలమేఘశ్యామా
నిగమ పాదయుగ నీరజనాభ
అగణిత లావణ్యానన ॥

ఘనవేదాంతైర్గణన వుదార
కనక శంఖ చక్ర కరాంక
దినమణి శశాంక దివ్యవిలోచన
అనుపమ రవి బింబాధరా ॥

భావజకంజ భవ జనక
శ్రీ వనితా హృదయేశ
శ్రీ వేంకటగిరి శిఖర విహార
పావన గుణగణ భావా ॥

## 136. దేవ శిఖామణి దివిజులు

దేవ శిఖామణి దివిజులు వొగడగ
వేవేలు గతుల వెలసీ వాడే ॥

వీధుల వీధుల వెసతురగముపై
భేదిల బల్లెము బిరబిరదిప్పుచు
మోదము తోడుత మోహనమూరితి
ఏదెస జూచిన నేగీ వాడే ॥

కన్నులు తిప్పుచు కర్ణములు కదల
సన్నల రాగెకు చౌకళింపుచును
అన్నిటా తేజియాడగ దేవుడు
తిన్నగ వాగేలు దిప్పీ వాడే ॥
వలగొన తిరుగుచు వాలము విసరుచు
నిలిచి గుఱ్ఱమటు నేర్పులు చూపగ
బలు శ్రీవేంకటపతి అహోబలపు
పొలమున సారెకు పొదలీవాడే ॥

## 137. దేవ శిఖామణివి

దేవశిఖామణివి దిష్టదైవమవు నీవు
యీవల నీ బంట నాకు నెదురింక నేది ॥
కామధేనువు పిదుకగల కోరికె లివెల్ల
కామధేనువులు పెక్కు గాచే కృష్ణుడవట
కామించి నీ బంటనట కమ్మినిన్ను దలచితి
ఏమి మాకు గడమయ్య యిందిరారమణా ॥
యెంచ కల్పవృక్షమును యిచ్చు సిరులెల్లాను
నించి కల్పవృక్షముల నీడల కృష్ణుడవట
అంచెల నీ బంటనట ఆత్మలోనిన్ను నమ్మితి
వంచించ కడమ యేది వసుధాధీశ ॥
తగనొక్క చింతామణి తలచినట్ల జేసు
మిగులకౌస్తుభమణి మించిన కృష్ణుడవట
పగటు శ్రీవేంకటేశ భక్తుడ నీకట నేను
జగములో కొఱతేది జగదేక విభుడా ॥

## 138. దేవునికి దేవికిని

దేవునికి దేవికిని తెప్పల కోనేటమ్మ
వేవేలు మొక్కులు లోకపావని నీకమ్మా ॥





ధర్మార్థకామమోక్షతతులు నీ సోబనాలు
అర్మిలి నాలుగు వేదాలదె నీదరులు
నిర్మలపు నీజలము నిండు సప్తసాగరాలు
కూర్మము నీలోతు వో కోనేరమ్మా ॥
తగిన గంగాది తీర్థములు నీకడళ్లు
జగతి దేవతలు నీ జలజంతులు
గగనపు పుణ్యలోకాలు నీ దరిమేడలు
మొగినీ చుట్టుమాకులు మునులోయమ్మా ॥
వైకుంఠనగరము వాకిలే నీ యాకారము
చేకొను పుణ్యములే నీ జీవభావము
యేకడను శ్రీ వేంకటేశుడే నీవునికి
దీకొని నీతీర్థ మాడితిమె కావవమ్మా ॥

## 139. నగవులు నిజమని

నగవులు నిజమని నమ్మేదా
వొగి నడియాసలు వొద్దనవే ॥
తొల్లిటికర్మము దొంతుల నుండగ
చెల్లబోయిక చేసేదా
యెల్లలోకములు యేలేటి దేవుడా
వొల్లనొల్ల నిక వొద్దనవే ॥
పోయిన జన్మము పొరుగుల నుండగ
ఛీయనక యిందు చెలగేదా
వేయినామముల వెన్నుడ మాయలు
వోయయ్య యిక వొద్దనవే ॥
నలి నీ నామము నాలికనుండగ
తలకొని యితరము తడవేదా

బలు శ్రీ వేంకటపతి నిన్ను గొలిచి
వొలుకు చెంచలము లొద్దనవే ॥

## 140. నమిత దేవం భజే

నమిత దేవం భజే నారసింహం
సుముఖ కరుణేక్షణం సులభ నరసింహం ॥
విజయనరసింహం వీరనరసింహం
భుజబలపరాక్రమ స్ఫుట నృసింహం
రజనీచర విదళన విరాజిత నృసింహం
సుజనరక్షక మహాశూర నరసింహం ॥
దారుణ నృసింహం ప్రతాప నరసింహం
చారుకల్యాణ నిశ్చల నృసింహం
ధీరచిత్తావాస దివ్య నరసింహం
సారయోగానంద చతుర నరసింహం ॥
విమల నరసింహం విక్రమ నృసింహం
కమనీయగుణగణాకర నృసింహం
అమిత సు శ్రీ వేంకటాద్రి నరసింహం
రమణీయ భూషాభిరామ నరసింహం ॥

## 141. నమో నమో రఘుకుల

నమో నమో రఘుకుల నాయక దివిజవంద్య
నమో నమో శంకర నగజానుతా
విహితధర్మ పాలక వీరదశరథరామ గహనవాసినీతాటక మర్దన
అహల్యాశాప విమోచన అసురకుల
భంజన సహజ విశ్వామిత్ర సవనరక్షకా
హరకోదండధర సీతాంగనా వల్లభ ఖరదూషణాది వాలిగర్వాపహా
తరణి తనూజాది తరుచర పాలక శరధి లంఘనకృత్యసౌమిత్రి సమేతా





బిరుదరావణశిరో భేదక విభీషణ వరదసాకే తపురవాసరాఘవ
నిరుపమ శ్రీ వేంకట నిలయ విజయనగర పుర విహార పుండరీకాక్ష

## 142. నమో నారాయణాయ

నమోనారాయణాయ నమో
నారాయణాయ స గుణబ్రహ్మణే, సర్వ
పారాయణాయ శోభవమూర్తయే ॥
నిత్యాయ విబుధసంస్తుత్యాయ నిత్యాధి -
పత్యాయ మునిగణ ప్రత్యయాయ
సత్యాయ ప్రత్యక్షాయ సన్మానస సాం-
గత్యాయ జగదవనకృత్యాయ తే నమో ॥
అక్రమోద్ధత బాహు విక్రమాతిక్రాంత
శుక్ర శిష్యోన్మూలనక్రమాయ
శక్రాది గీర్వాణ వక్రభయభంగ నిర్ -
వక్రాయ నిహతారి చక్రాయ తే నమో ॥
అక్షరాయాతి నిరపేక్షాయ పుండరీ -
కాక్షాయ శ్రీవత్స లక్షణాయ
అక్షీణ విజ్ఞానదక్ష యోగీంద్ర సం-
రక్షానుకంపా కటాక్షాయ తే నమో ॥
కరిరాజవరదాయ కౌస్తుభా భరణాయ
మురవైరిణే జగన్మోహనాయ
తరుణేందు కోటీర తరుణీ మనస్తోత్ర
పరితోషచిత్తాయ పరమాయ తే నమో ॥
పాత్రదానోత్సవప్రథిత వేకంటరాయ
ధాత్రీశ కామితార్థప్రదాయ
గోత్రభిన్మణిరుచిర గాత్రాయ రవిచంద్ర
నేత్రాయ శేషాద్రి నిలయాయ తే నమో ॥

## 143. నరసింహ రామకృష్ణ

నరసింహ రామకృష్ణ నమో శ్రీవేంకటేశ
సరుగ నా శత్రుల సంహరించవే ॥
బావతిట్లకు శిశుపాలుని జంపిన -
యేవ కోపకాడవు నేడెందు వోతివి
నీవాడనని నన్ను నిందించే శత్రువును
చావగొట్టి వాని నిట్టే సంహరించవే ॥
దాసుని భంగించేటి తరి కస్యపు జంపిన
యీసుకోపగాడ విపు డెందువోతివి
మేసుల నీలాంఛనాలు మించి నన్ను దూషించే
సాసించి శత్రువును సంహరింపవే ॥
కల్లలాడి గూబయిల్లు గైకొన్న గద్ద జంపిన
యెల్లగాగ కోపకాడ వెందువోతివి
యిల్లిదె శ్రీవేంకటేశ యీ నీమీది పాటలు
జల్లన దూషించు శత్రు సంహరింపవే ॥

## 144. నల్లని మేని నగవు

నల్లని మేని నగవు చూపులవాడు
తెల్లని కన్నుల దేవుడు ॥
బిరుసైన దనుజుల పింఛమణచినట్టి
తిరుపుకైదువుతోడి దేవుడు
సరిబడ్డ జగమెల్ల చక్కఁజాయకు తెచ్చి
తెరువు చూపినట్టి దేవుడు ॥
నీట కలసినట్టి నిండిన చదువులు
తేట పరచినట్టి దేవుడు
పాటిమాలినట్టి ప్రాణుల దురితపు
తీటవాసినట్టి దేవుడు ॥





గురుతు వెట్టగరాని గుణముల నెలకొన్న
తిరు వేంకటాద్రిపై దేవుడు
తిరముగ ధ్రువునికి దివ్యపదం బిచ్చి
తెరచి రాజన్నట్టి దేవుడు ॥

## 145. నవనీతచోర

నవనీతచోర నమో నమో
నవమహిమార్ణవ నమో నమో ॥
హరి నారాయణ కేశవాచ్యుత కృష్ణ
నరసింహ వామన నమో నమో
మురహర పద్మనాభ ముకుంద గోవింద
నర నారాయణ నమో నమో ॥
నిగమగోచర విష్ణు నీరజాక్ష వాసుదేవ
నగధర నందగోప నమో నమో
త్రిగుణాతీత దేవ త్రివిక్రమ ద్వారకా -
నగరాధినాయక నమో నమో ॥
వైకుంఠరుక్మిణీవల్లభ చక్రధర
నాకేశవందిత నమో నమో
శ్రీకర గుణనిధి శ్రీ వేంకటేశ్వర
నాకజననుత నమో నమో ॥

## 146. నవరసములదీ నళినాక్షి

నవరసములదీ నళినాక్షి
జవగట్టి నీకు జవిసేసీ ॥
శృంగారరసము చెలియమొకంబున
సంగతి వీరరసము గోళ్ల
రంగగు కరుణరసము పెదవులను
అంగపు కుచముల నద్భుతరసము ॥

చెలిహాస్యరసము సెలవుల నిండి
పలుచని నడుమున భయరసము
కలికి వాడి కన్నుల బీభత్సరసము
అలబొమ జంకెనల అదె రౌద్రంబు ॥
సతిరతి మరపుల శాంతరసంబదె
అతిమోహము పదియవ రసము
ఇతవుగ శ్రీ వేంకటేశ గూడితివి
సతమై యీమెకు సంతోషరసము ॥

## 147. నాకుగల పనియిదే

నాకుగల పని యిదే నారాయణుడ నీవు
శ్రీంకాంతుడవు నాకు సిద్ధించు కొరకు
జలధి వంటిది సుమీ చంచలము నామనసు
కల వింద్రియములనేటి జలచరములు
వొలసి భక్తెనిది వోడ యెక్కితి నేను
జలశాయి నీవనేటి సరకు దెచ్చుటకు
కొండవంటిది సుమీ కొనకెక్కు నా మనసు
వుండు కామాదులను వురు మృగములు
వుండి నీ శరణమను వూతగొని మొక్కితిని
కొండలప్ప నీవనేటి కొన ఫలము కొరకు
టీ (ఠీ) వులను ధరణి వంటిది సుమీ నా మనసు
నీవే శ్రీ వేంకటేశ నిక్షేపము
వావాత నీవనేటి వసిదవ్వి కై కొంటి
భూ విభుడ నీవనేటి పురుషార్థము

## 148. నానాటి బతుకు

నానాటి బతుకు నాటకము
కానక కన్నది కైవల్యము ॥





పుట్టుటయు నిజము పోవుటయు నిజము
నట్టనడిమి పని నాటకము
యెట్ట నెదుటకల దీ ప్రపంచము
కట్టకడపటిది కైవల్యము ॥
కుడిచే దన్నము కోక చుట్టెడిది
నడు మంత్రపు పని నాటకము
వొడి గట్టుకొనిన వుభయకర్మములు
గడి దాటినపుడే కైవల్యము ॥
తెగదు పాపము తీరదు పుణ్యము
నగినగికాలము నాటకము
యెగువనె శ్రీ వేంకటేశ్వరు డేలిక
గగనము మీదిది కైవల్యము ॥

## 149. నారాయణతే

నారాయణతే నమో నమో
నారద సన్నుత నమో నమో ॥
మురహర భవహర ముకుంద మాధవ
గరుడ గమన పంకజనాభ
పరమపురుష భవబంధ విమోచన
నరమృగశరీర నమో నమో ॥
జలధిశయన రవిచంద్రవిలోచన
జలరుహ భవనుత చరణయుగ
బలిబంధన గోపవధూవల్లభ
నలినోదర తే నమో నమో ॥
ఆదిదేవ సకలాగమ పూజిత
యాదవకుల మోహనరూప

వేదోద్ధర శ్రీ వేంకటనాయక
నాదప్రియ తే నమో నమో ॥

### 150. నారాయణ నీ నామమె

నారాయణ నీ నామమె గతి యిక
కోరికలు నాకు కొనసాగుటకు ॥
పైపై ముందట భవజలధి
దాపు వెనక చింతాజలధి
చాపలము నడుమ సంసార జలధి
తేప యేది ఇవి తెగ నీదుటకు ॥
పండెను ఎడమ పాపపురాశి
అందను కుడిని పుణ్యపు రాశి
కొండను నడుమ త్రిగుణరాశి – యివి
నిండ కుదుచుటకు నిలుకడ యేది ॥
కింది లోకములు కీడు నరకములు
అందేటి స్వర్గాలవె మీద
చెంది అంతరాత్మ శ్రీవేంకటేశ నీ –
యందె పరమపద మవల మరేది ॥

### 151. నారాయణాచ్యుత

నారాయణాచ్యుతానంత గోవింద హరి
సారముగ నీకు నే శరణంటిని ॥
చలువయును వేడియును సటల సంసారంబు
తొలకు సుఖమొకవేళ దుఃఖమొక వేళ
ఫలములివె ఈ రెండు పాపములు పుణ్యములు
పులుపు తీపును కలిపి భుజియించినట్లు ॥





పగలు రాత్రుల రీతి బహుజన్మ మరణాలు
తగు మేను పొడచూపు తనుతానె తొలగు
నగియించు నొకవేళ నలగించు నొకవేళ
వొగరు కారపు విడెము ఉబ్బించినట్లు ॥
యిహము పరమునువలెనె యెదిటి కల్లయు నిజము
విహరించు భ్రాంతియును విభ్రాంతియును మతిని
సహజ శ్రీవేంకటేశ్వర నన్ను కరుణింప
బహువిధంబుల నన్ను పాలించవే ॥

### 152. నిగమ నిగమాంత

నిగమ నిగమాంతవర్ణిత మనోహరరూప
నగరాజ ధరుడ శ్రీ నారాయణా
దీపించు వైరాగ్య దివ్య సౌఖ్యంబియ్య
నోపక కదా నన్ను నొడబరపుచు
పైపైనే సంసార బంధముల కట్టేవు
నా పలుకు చెల్లునా నారాయణా
చీకాకుపడిన నా చిత్త శాంతముసేయ
లేకకా నీవు బహు లీలనన్ను
కాకుసేసెదవు బహు కర్మముల బడువారు
నాకొలది వారలా నారాయణా
వివిధ నిర్బంధముల వెడల ద్రోయకనన్ను
భవసాగరముల దడ బడ జేతురా
దివిజేంద్రవంద్య శ్రీతిరువేంకటాద్రీశ
నవనీతచోర శ్రీ నారాయణా

### 153. నిత్యపూజలివివో

నిత్యపూజలివివో నేరిచిన నోహో
ప్రత్యక్షమైనట్టి పరమాత్మునికి ॥

తనువే గుడియట తలయే శిఖరమట
పెనుహృదయమే హరి పీఠమట
కనుగొన చూపులె ఘనదీపములట
తన లోపలి అంతర్యామికిని ॥

పలుకే మంత్రమట పాదైన నాలికే
కలకలమను పిడి ఘంటయట
నలువైన రుచులే నైవేద్యములట
తలపు లోపల నున్న దైవమునకు ॥

గమన చేష్టలే అంగరంగ గతియట
తమిగల జీవుడే దాసుడట
అమరిన పూర్పులే ఆలవట్టములట
క్రమముతో శ్రీ వేంకటరాయనికి ॥

## 154. నిత్యానంద

నిత్యానంద ధరణీధర ధరారమణ
కాత్యాయనీస్తోత్ర కామ కమలాక్ష ॥

అరవిందనాభ జగదాధార భవదూర
పురుషోత్తమ నమో భువనేశ
కరుణాసమగ్ర రాక్షసలోక సంహార –
కరణ కమలాధీశ కరిరాజవరద ॥

భోగీంద్రశయన పరిపూర్ణ పూర్ణానంద
సాగరనిజావాస సకలాధిప
నాగారిగమన నానావర్ణనిజదేహ
భాగీరథీజనక పరమ పరమాత్మ ॥

పావన పరాత్పర శుభప్రద పరాతీత
కైవల్యకాంత శృంగారరమణ





శ్రీ వేంకటేశ దాక్షిణ్యగుణనిధి నమో
దేవతారాధ్య సుస్థిరకృపాభరణ ॥

## 155. నిన్నుదలంచి నీ పేరు దలఁచి

నిన్ను దలంచి నీపేరు దలఁచి
నన్ను కరుణించితే నెన్నిక గాక ॥

అధికునికాచు టేమరుదు నన్ను
నధముని కాచుట యరుదుగాక నీకు
మధురమౌటేమరుదు మధురము చేదు
మధురమౌటే మహిలో నరుదుగాక ॥

అనఘుని కరుణింప నరుదుగాదు నీకు
ఘన పాపుని నన్ను కాచు టరుదుగాక
కనకము కనకము కానేల యినుము
కనకమవుటే కడు నరుదుగాక ॥

నెలకొన్న భీతితో నిన్ను చెనకితిగాక
తలకొన్న సుఖినైన దలచనేల నిన్ను
యెలమితో తిరువేంగళేశుడ నాపాల
కలిగి నీకృప కలుగఁజేతువు గాక ॥

## 156. నీకే శరణు

నీకే శరణు నీవునన్ను కరుణించు
యీకడ నాకడ దిక్కు యెవ్వరున్నారికను

కన్నులచంద్ర సూర్యులు గలవేలుపవునీవు
పన్నిన లక్ష్మీభూమి పతివినీవు
అన్నిట బ్రహ్మకు తండ్రియైన ఆదివేలుపవు
యెన్నగనీకంటే ఘన మెవ్వరున్నారికను

దేవతలందరు నీ తిరుమేనైన మూర్తి
ఆవల పాదాన లోక మణచితివి

నీ వొక్కడవే నిలిచిన దేవుడవు
యేవేళ నీకంటే నెక్కుడెవ్వరున్నారికను
అరసి జీవులకెల్ల అంతరాత్మవైన హరి
సిరుల వరములిచ్చే శ్రీ వేంకటేశా
పురుషోత్తముడవు భువన రక్షకుడవు
యిరవైన నీవెకాక యెవ్వరున్నారికను

## 157. నీ దాస్య మొక్కటే

నీ దాస్య మొక్కటే నిలిచి నమ్మగలది
శ్రీదేవుడవు నీ చిత్తము నా భాగ్యము
అనుష్ఠానములు గతియని నమ్మి సేసితినా
తను విది మలమూత్రముల పోగు
జనులలో వుత్తమపు జన్మమే నమ్మిన
వొరన కర్మమనే వో దానబడినది
చదువుల శాస్త్రముల జాడలు నమ్మితినా
పొదిలిన మతముల పోరాటమది
మది మది నుండిన నా మనసేనమ్మితినా
అదియును యింద్రియాల కమ్ముడు వోయినది
పుత్ర దార ధన ధాన్య భూములు నమ్మితినా
పాత్రమగు రుణాను బంధములవి
చిత్రముగా ననుగావు శ్రీ వేంకటేశ నీవు
పత్ర పుష్ప మాత్రమే నా భక్తి యెల్లా నీకు

## 158. నీ నామమే మాకు

నీ నామమే మాకు నిధియు నిధానము
నీ నామమే ఆత్మ నిధానాంజనము ॥
నమో నమో కేశవ నమో నారాయణ
నమో నమో మాధవా నమో గోవింద





నమో నమో విష్ణు నమో మధుసూదనా
నమో త్రివిక్రమ నమో వామన ॥
నమో నమో శ్రీధర నమో హృషీకేశ
నమో పద్మనాభ నమో దామోదర
నమో సంకర్షణ నమో వాసుదేవ
నమో ప్రద్యుమ్నతే నమో అనిరుద్ధ ॥
నమో పురుషోత్తమా నమో అధోక్షజ
నమో నారసింహా నమోస్తు అచ్యుత
నమో జనార్దనా నమోస్తు ఉపేంద్ర
నమో శ్రీ వేంకటేశ నమో శ్రీ కృష్ణ ॥

## 159. నెల మూడు

నెల మూడు సోబనాలు నీకు నతనికే తగును
కలకాలము నిచ్చ కళ్యాణమమ్మ
రామ నామ మతనిది రామవు నీవైతేను
చామన వర్ణమతడు చామవునీవు
వామను దందురతని వామ నయనవు నీవు
ప్రేమపు మీ ఇద్దరికి పేరు బలమొకటే
హరిపేరాతనికి హరిణేక్షవు నీవు
కరిగాచే తాను నీవు కరియానవు
సరిజలధిశాయి జలధి కన్యవునీవు
బెరసి మీ యిద్దరికి పేరు బలమొకటే
జలజనాభు డతడు జలజముఖివినీవు
అలమేలు మంగవు నిన్నలమే తాను
ఇలలో శ్రీ వేంకటేశు డిటు నిన్నురాన మోచే
పిలిచి పేరు చెప్పే పేరు బలమొకటే

## 160. పరతత్త్వంబగు బాలుడు

పరతత్త్వంబగు బాలుడు
పరిపరి విధముల బాలుడు ॥
చద్దుల మూటలు చంకల[వేలెడి
ముద్దుల పడుచుల మూకలతో
పెద్దరికంబున పేయల గాచిన
బద్దుల నటనల బాలుడు ॥
వెన్నలు తాకగ వేట్లాడుచును
సన్నపు పడుచుల సంగడిని
కన్నెలు దూరగ కలకల నవ్విన
పన్నిన మాయల బాలుడు ॥
బచ్చెన రూపుల పాయపు పడుచులు
నిచ్చలు కొలువగ నెమ్మదిని
నచ్చిన వేంకట నగమున ఆడెడి
పచ్చల పదకపు బాలుడు ॥

## 161. పరమ పురుషుడు

పరమ పురుషుడు గోపాలబాలుడైనాడు
మురహరుడు ఎదుట ముద్దుగారీ నిదివో ॥
వేదపురాణములలో విహరించే దేవుడు
ఆదిమూలమైనట్టి అల [బహ్మము
శ్రీదేవి పాలిట చెలగే నిధానము
సేదదేరి యశోదకు శిశువాయ నిదివో ॥
మొక్కేటి నారదాదుల ముందరి సాకారము
అక్కజపు జీవులలో అంతర్యామి
గక్కన [బహ్మకొడుకుగా కన్న పరమము
అక్కరతో వెన్నముచ్చై ఆటలాడి నిదివో ॥





దేవతలc గాచుటకు దిక్కైన విష్ణుడు
భావములు ఒక్కరూపైన భావతత్త్వము
శ్రీ వేంకటా[ద్రి మీద చేరియున్న ఆ వరదుడు
కైవసమై గొల్లెతల కౌగిళ్ళ నిదివో ॥

## 162. పరమాత్ముడైన హరి

పరమాత్ముడైన హరి పట్టపురాణివి నీవు
ధర మమ్ము విచారించదగు నీకు నమ్మా ॥
కమలజుc గన్న తల్లి కామునిc గన్నతల్లి
అమరులc గన్న తల్లి ఆదిమలక్ష్మి
విమలపు నీ పతికి విన్నపము సేసి మమ్ము
నెమకి యేలితి దయ నీకే తగునమ్మా ॥
కామధేను తోబుట్టుగ కల్పకము తోబుట్టుగ
దోమటి చల్లని చం[ద్రు తోబుట్టుగ
నీ మగని పంపునను నిజసిరులిచ్చితివి
నేమపు వితరణము నీకే తగునమ్మా ॥
పాలజలధి కన్యవు పద్మాసనివి నీవు
పాల పండే వేంకటపతి దేవివి
యేలిన యితనిబంట్లకు ఇహపరాలిచ్చి మా
పాలగలిగితివి సంబంధము మేలమ్మా ॥

## 163. పరిపూర్ణ గరుడాద్రి

పరిపూర్ణ గరుడా[ద్రి పంచాననం
పరమం సేవే పంచాననం ॥
[కూరదం[ష్ట్రాగ్నికణ ఘోర పంచాననం
పారీణ చ[క్రధర పంచాననం
వీరపంచాననం విజయపంచాననం
భార భూభారహర పంచాననం ॥

దివిజపంచాననం తీవ్రనఖకాననం
భవనాశినీతీర పంచాననం
కువలయాకాశసంఘోష పంచాననం
పవిశబ్ద దంతరవ పంచాననం ॥
శ్రీ వేంకటాఖ్య ఘనశిఖరి పంచాననం
పావనం పంచముఖ పంచాననం
సేవిత ప్రహ్లాదసిద్ధి పంచాననం
భావితం శ్రీ యుక్త పంచాననం ॥

## 164. పలుకు తేనెల తల్లి

పలుకు తేనెల తల్లి పవళించెను
కలికితనముల విభుని కలసినదిగాన ॥
నిగనిగని మోముపై నెరులు గెలకుల చెదర
పగలైనదాక చెలి పవళించెను
తెగని పరిణతులతో తెల్లవారిన దాక
జగదేకపతి మనసు జట్టిగొనె గాన ॥
కొంగు జారిన మెరుగు గుబ్బలొలయగ తరుణి
బంగారు మేడపై పవళించెను
చెంగలువ కనుగొనల సింగారములు దొలక
అంగజగురునితోడ అలసినది గాన ॥
మురిపెంపు నటనతో ముత్యాలమలగుపై
పరవశంబున తరుణి పవళించెను
తిరువేంకటాచలాధిపుని కౌగిటఁ గలసి
అరవిరై నునుచెమట నంటినది గాన ॥

## 165. పసిడి యక్షింతలివె

పసిడి యక్షింతలివె పట్టరో వేగమె రారో
దెసల పేరంటాండ్లు దేవుని పెండ్లికిని ॥





శ్రీవేంకటేశ్వరునికి శ్రీమహాలక్ష్మికి
దైవికపు పెండ్లి ముహూర్తము నేడు
కావించి భేరులు మ్రోసె గరుడధ్వజంబెక్కె
దేవతలు రారో దేవుని పెండ్లికిని ॥
కందర్ప జనకునికి కమలాదేవికి పెండ్లి -
పందిలిలోపల తలబాలు నేడు
గంధమూ విడెమిచ్చేరు కలువడాలు గట్టిరి
అందుక మునులు రారో హరిపెండ్లికిని ॥
అదె శ్రీవేంకటపతికి అలమేలు మంగకును
మొదలితిరునాళ్ళకు మొక్కేము నేడు
యెదుట నేగేరు వీరె యిచ్చేరు వరములివె
కదలిరారో పరుష ఘనుల పెండ్లికిని ॥

## 166. పాడరే సోబనాలు

పాడరే సోబనాలు పడతులాలా
వేడుక లిద్దరికిని వెలసె చూడరే ॥
కొండలే పీటలుగా కూచున్నారెదురుబడి
అండనే నారసింహుడు ఆదిలక్ష్మియు
వెండిపైడి నిండుకొన్న వేదాద్రి గరుడాద్రుల
పెండిలాడే రిద్దురును ప్రియమున చూడరే ॥
భవనాశి జలముల పాయక తోడనీళ్ళాడిరి
ఇవలా నవలా తాము ఏటిదరుల
జవళి మంచి పూవుల సరిసేసలు వెట్టుచు
తవిలి సుముహూర్తాన తప్పక చూచేరు ॥
పొందుగ కనకావతి భోగావతి నదుల
సందడి వసంతముగా చల్లులాడుచు

అందమై శ్రీవేంకటాద్రి అహోబలాన ఒక
చందమున కూడి కూడి సరసము లాడేరు ॥

### 167. పాలజలనిధిలో

పాల జల నిధిలో పాయని
నీల వర్ణుడవట నీవా యిపుడు
వెదజల్లు మణుల వేయిపడగలను
చెదరని మెరుగుల శేషునిపై
మృదువు బరువుగా మెల్లనె పొరలుచు
నిదుర వోదువట నీవా యిపుడు
పరమ మునీంద్రులు పద్మభవాదులు
ఇరువంకల నుతియించగను
అరవిరి మోమున నల్లన నవ్వెడి
నిరతమూర్తివట నీవా యిపుడు
పగటున సిరియును పరగిన ధరణియు
బిగియుచు నడుగులు పిసుకగను
తగు వేంకటగిరి తనరుచు చెలగెడి
నిగమమూర్తివట నీవా యిపుడు

### 168. పిడికిట తలంబ్రాల

పిడికిట తలంబ్రాల పెండ్లి కూతురు, కొంత
పెడమరలి నవ్వీనె పెండ్లికూతురు ॥
పేరుకల జవరాలె పెండ్లికూతురు పెద్ద
పేరుల ముత్యాల మెడ పెండ్లికూతురు
పేరంటాండ్ల నడిమి పెండ్లికూతురు విభు
పేరుకుచ్చ సిగ్గుపడీ పెండ్లికూతురు ॥
బిరుదు పెండెము వెట్టె పెండ్లికూతురు నెర
బిరుదు మగని కంటె పెండ్లికూతురు





పిరిదూరి నప్పుడే పెండ్లికూతురు పతి
పెరరేచీ నిదివో పెండ్లికూతురు ॥
పెట్టెనే పెద్ద తురుము పెండ్లికూతురు నేడె
పెట్టెడు చీరలు గట్టె పెండ్లికూతురు ॥
గట్టిగ వేంకటపతి కౌగిటను వడి -
వెట్టిన నిధానమైన పెండ్లికూతురు ॥

### 169. పురుషోత్తముడవీవు

పురుషోత్తముడ వీవు పురుషాధముడ నేను
ధరలోన నాయందు మంచితనమేది ॥
అనంతాపరాధములు అటునేము సేసేవి
అనంతమైన దయ అది నీది
నిను నెరుగ కుండేటి నీచగుణము నాది
నను నెడయ కుండేటి గుణము నీది ॥
సకల యాచకమే సరుస నాకు పని
సకల రక్షకత్వము సరి నీ పని
ప్రకటించి నిన్ను దూరే పలుకే నాకెప్పుడును
వెకలివై ననుకాచే విధము నీది ॥
నేరమింతయు నాది నేరుపింతయు నీది
సారెకు అజ్ఞాని నేను జ్ఞానివి నీవు
ఈ రీతి వేంకటేశ ఇట్టె నన్ను నేలితివి
ధారుణిలో నిండెను ప్రతాపము నీది ॥

### 170. పేరంటాండ్లు పాడరే

పేరంటాండ్లు పాడరే పెండ్లి వేళ
సారె సారె నిద్దరికి సంతోష వేళ

చిత్తజుతల్లికి వేగ సింగారించరె మీరు
తత్తరించేరిదే ముహూర్తపు వేళ
హత్తి తలంబ్రాలు నారాయణుని బోయ మనరే
పొత్తులనిద్దరికి బువ్వపువేళ
పాలవెల్లి కూతురుకు పసవులు నలచరే
చాలించరే జోలి వీడు చదివే వేళ
పాలుపడి పరపులు పరచరే దేవునికి
నాలుగో దినము నేడు నాగవల్లి కే
అంది బాగా లియ్యరే అలమేల్మంగకును
కందువ శ్రీ వేంకటేశు కలసే వేళ
గందము కస్తూరి నీ రేఘన రతినలసి
కందుక యిద్దరు నిక కొలువుండే వేళ

## 171. పొడగంటిమయ్యా

("అన్నమాచార్య జీవితచరిత్ర పీఠిక" నుండి)

పొడగంటిమయ్యా మిమ్ము పురుషోత్తమా మమ్ము
నెడయకవయ్యా కోనేటి రాయడా ॥
కోరిమమ్ము నేలినట్టి కులదైవమా చాల
నేరిచి పెద్దలిచ్చిన నిధానమా
గారవించి దప్పి దీర్చు కాలమేఘమా మాకు
చేరువ చిత్తములోని శ్రీనివాసుడా ॥
భావింప కైవసమైన పారిజాతమా మమ్ము
చేవదేరగాచినట్టి చింతామణి
కావించి కోరికలిచ్చే కామధేనువా మమ్ము
తావై రక్షించేటి ధరణీధరా ॥
చెడనీక బ్రతికించే సిద్ధ మంత్రమా, రోగా -
లడచి రక్షించే దివ్యౌషధమా





బడి బాయక తిరిగే ప్రాణబంధుడా మమ్ము
గడియించినట్టి శ్రీ వేంకటనాథుడా ॥

## 172. ఫాలనేత్రానల

ఫాలనేత్రానల ప్రబల విద్యుల్లతా -
కేలీ విహార లక్ష్మీనారసింహా ॥
ప్రళయమారుత ఘోర భస్త్రికాపూత్కార
లలిత నిశ్వాస డోలా రచనయా
కులశైలకుంభినీ కుముదహిత రవిగగన
చలన విధి నిపుణ నిశ్చలనారసింహా ॥
వివరఘన వదన దుర్విధహసన నిష్ఠ్యూత
లవదివ్య వరుష లాలా ఘటనయా
వివిధ జంతువ్రాత భువన మగ్నీకరణ
నవనవ ప్రియ గుణార్ణవనారసింహా ॥
దారుణోజ్వల ధగద్ధగిత దంష్ట్రానల వి -
కారస్ఫులింగ సంగక్రీడయా
వైరిదానవ ఘోరవంశ భస్మీకరణ -
కారణ ప్రకట వేంకటనారసింహా ॥

## 173. బ్రహ్మ కడిగిన

బ్రహ్మ కడిగిన పాదము
బ్రహ్మము తానె నీ పాదము ॥
చెలగి వసుధ గొలిచిన నీ పాదము
బలితల మోపిన పాదము
తలకక గగనము తన్నిన పాదము
బలరిపు గాచిన పాదము ॥
కామినిపాపము కడిగిన పాదము
పాము తలనిడిన పాదము

ప్రేమపు శ్రీసతి పిసికెడి పాదము
పామిడి తురగపు పాదము ॥
పరమయోగులకు పరిపరివిధముల
పర మొసగెడి నీ పాదము
తిరువేంకటగిరి తిరమని చూపిన
పరమపదము నీ పాదము ॥

## 174. భక్తికొలదీ వాడె

భక్తికొలఁదివాఁడే పరమాత్ముఁడు
భుక్తిముక్తిఁదానే యిచ్చు భువిఁబరమాత్ముఁడు
పట్టినవారిచేబిడ్డ పరమాత్ముఁడు
బట్టబయటిధనము పరమాత్ముఁడు
పట్టుపగటివెలుఁగు పరమాత్ముఁడు
యెట్టనెదుటనే వున్నాఁడిదె పరమాత్ముఁడు
పచ్చిపాలలోనివెన్న పరమాత్ముఁడు
బచ్చనవాసినరూపు పరమాత్ముఁడు
బచ్చుచేతివొరగల్లు పరమాత్ముఁడు
యిచ్చ కొలఁదివాడువో యీ పరమాత్ముఁడు
పలుకులలోనితేట పరమాత్ముఁడు
ఫలియించు నిందరికిఁ బరమాత్ముఁడు
బలిమి శ్రీవేంకటాద్రిపరమాత్ముఁడు
యెలమి జీవులప్రాణ మీపరమాత్ముఁడు

## 175. భవరోగ వైద్యుడవు

భవరోగ వైద్యుఁడవు పాటించ నీ వొకఁడవే
నవనీతిచోర నీకు నమో నమో
అతివ లనెడి సర్పా లధరాలు గఱచిన
తతి మదనవిషాలు తలకెక్కెను





మితిలేని రతులఁదిమ్మిరివట్టె దేహాలు
మతి మఱచె నిందుకు మందేదొకో
పొలఁతు లనెడి మభూతాలు సోఁకిన
తలమొలలు విడి బిత్తలై యున్నారు
అలరు చెనకులచే నంగములు జీరలాయ
మలసి యిందుకు నిఁక మంత్రమేదొకో
తరుణుల కాఁగిలనే తాపజ్వరాలు వట్టి
కరఁగి మేనెల్ల దిగఁగారఁజొచ్చెను
నిరతి శ్రీ వేంకటేశ నీవే లోకులకు దిక్కు
అరుదు సుఖాననుండే యంత్ర మేదొకో

## 176. భావములోన

భావములోనా బాహ్యము నందును
గోవింద గోవింద యని కొలువవో మనసా ॥
హరియవతరాములే అఖిల దేవతలు
హరిలోనివే బ్రహ్మాండంబులు
హరి నామములే అన్ని మంత్రములు
హరి హరి హరి హరి హరి యనవో మనసా
విష్ణుని మహిమలే విహిత కర్మములు
విష్ణుని పొగడెడి వేదంబులు
విష్ణుడొక్కడే విశ్వాంతరాత్ముడు
విష్ణువు విష్ణువని వెదకవో మనసా ॥
అచ్యుత డితడే ఆదియు నంత్యము
అచ్యుతుడే అసురాంతకుడు
అచ్యుతుడు శ్రీవేంకటాద్రి మీద నిదె
అచ్యుత అచ్యుత శరణనవో మనసా ॥

## 177. ఆది పురుషా

ఆది పురుషా అఖిలాంత రంగ
భూదేవ తా రమణ భోగీంద్రశయన
భవపాథోనిధి బాడ బానల
భవ జీమూత ప్రభంజనా
భవ పర్వత ప్రళయ భయదనిర్ఘాంతదు -
ర్భవ కాల కూట భవ బహు విశ్వరూప
భవఘోర తిమిర దుర్భవకాలమార్తాండ
భవ భద్ర మాతంగ పంచాననా
భవ కమలభవ మాధవ రూప శేషాద్రి
భవన వేంకటనాథ భవరోగవైద్య

## 178. భావించి చూడరే

భావించి చూడరే పడతులాల
చేవదేరి మహిమలు చెలగినట్లుండెను ॥
పరమ పురుషునికి పచ్చకప్పురముకాపు
తిరుమేన నమరెను తెల్లని కాంతి
ధరలో పాలజలధి తచ్చేటి వేళను
మురిపెమై తుంపురులు ముంచినయట్లుండెను ॥
తవిలి ఈ దేవునికి తట్టుపుణుగు కాపు
నవమై మేన నమరె నల్లని కాంతి
తివిరి గోవర్ధనమెత్తిన నాడు నిండుకొని
ధ్రువమై మేఘకాంతులు తొలకినట్లుండెను ॥
శ్రీ వేంకటేశునికి సింగారించిన సొమ్ములు
భావించమేన నమరె బంగరు కాంతి
తావుగా నలమేల్మంగ తనవురమెక్కగాను
వేవేలు సంపద లెల్లా వెలసినట్లుండెను ॥





## 179. మనుజుడై పుట్టి

మనుజుడై పుట్టి మనుజుని సేవించి
అనుదినమును దుఃఖ మందనేలా ॥
జుట్టెడు కడుపుకై చొరనిచోట్లుచొచ్చి
పట్టెడు కూటికై బతిమాలి
పుట్టిన చోటికే పొరలి మనసువెట్టి
వట్టి లంపటము వదలనేరదుగాన ॥
అందరిలోపుట్టి అందరిలో పెరిగి
అందరి రూపము లటు తానై
అందమైన శ్రీ వేంకటాద్రీశు సేవించి
అందరాని పదము అందెనటుగాన ॥

## 180. మంగాంబుధి హనుమంత

మంగాంబుధి హనుమంత నీ శరణ
మంగవించితిమి హనుమంత ॥
బాలార్క బింబము ఫలమని పట్టిన
ఆలరిచేతల హనుమంతా
తూలని బ్రహ్మాదులచే వరములు
ఓలి చేకొనిన ఓ హనుమంత ॥
జలధిదాట నీ సత్వము కపులకు
అలరి తెలిపితివి హనుమంతా
ఇలయు నాకసము నేకముగా నటు
బలిమి పెరిగితివి భళి హనుమంత ॥
పాతాళము లోపలి మైరావణు -
ఆతల చంపిన హనుమంతా
చేతులు మోడ్చుక శ్రీ వేంకటపతి -
నీతల కొలిచే హిత హనుమంత ॥

## 181. మాధవకేశవ

మాధవా కేశవా మధుసూదనా విష్ణు
శ్రీధరా పదనఖం చింతయామి యూయం ॥

వామన గోవిందా వాసుదేవ ప్రద్యుమ్న
రామరామకృష్ణ నారాయణాచ్యుత
దామోదరానిరుద్ధ దైవపుండరీకాక్ష
నామత్రయాధీశ నమో నమో ॥

పురుషోత్తమా పుండరీకాక్ష దివ్య
హరి సంకర్షణా అధోక్షజా
నరసింహ హృషీకేశ నగధరా త్రివిక్రమా
శరణాగత రక్ష జయజయ సేవే ॥

మహిత జనార్దనా మత్స్యకూర్మ వరాహ
సహజ భార్గవ బుద్ధ జయ తురగ కల్కి
విహిత విజ్ఞాన శ్రీవేంకటేశ శుభకరం
అహమిహ తవపదదాస్యం అనిశం భజామి ॥

## 182. మాధవునకు మంగళము

మాధవునకు మంగళము
సాధుప్రియునకు జయమంగళం ॥

మదనగురునకును మంగళం, మా
మదిలోహరికిని మంగళం
మదరిపుహరునకు మంగళం
చదువులమూర్తికి జయమంగళం ॥

మహిమాధికునకు మంగళం
మహామహునకు మంగళం
మహీధవునకు మంగళం
సహజతేజునకు జయమంగళం ॥





మాయారహితునికి మంగళం
మా యింటిఁబతికిని మంగళం
యీ యెడ శ్రీవేంకటేశ్వరుండితని
ఛాయశ్రీసతికి జయ మంగళం ॥

## 183. మించి దేవాంగనలిట్టే

మించి దేవాంగన లిట్టే మెచ్చేరమ్మా
ఎంచ నలమేల్మంగ ఎంతదానవమ్మా ॥

మాటలనే ఊరడించి మచ్చికల పొద్దువుచ్చి
నీటున పతిని తేలించ నేరుతువమ్మ
పాటలనే కరగించి పంతములు మరిగించి
చాటువ నాతనికూడ జాణవమ్మా ॥

నగుతానే రప్పించి నటనల మెప్పించి
తగు పతి దక్కకొన దంటవమ్మా
పగటుల భ్రమయించి బడినుండే వలపించి
చిగిరించచేయ పతిచిత్తము వత్తువమ్మా ॥

కాగిటనే చొక్కించి కందువల మొక్కించి
ఆగి పతివురమెక్కేవు అప్పుడే యమ్మా
పాగిన శ్రీ వేంకటేశు పట్టపురాణివినీవు
నీగని వేడుకతోడ నీవారమమ్మా ॥

## 184. ముద్దుగారే యశోద

ముద్దుగారే యశోద ముంగిట ముత్తెము వీడు
తిద్దరాని మహిమల దేవకీ సుతుడు ॥

అంత నింత గొల్లెతల అరచేతి మాణికము
పంతమాడే కంసుని పాలి వజ్రము

కాంతుల మూడు లోకాల గరుడ పచ్చ పూస
చెంతల మాలోనున్న చిన్నికృష్ణుడు ॥
రతికేళి రుక్మిణికి రంగుమోవి పగడము
మితి గోవర్ధనపు గోమేధికము
సతమై శంఖచక్రాల సందుల వైడూర్యము
గతియై మమ్ముగాచే కమలాక్షుడు ॥
కాళింగుని తలలపై కప్పిన పుష్యరాగము
ఏలేటి శ్రీవేంకటాద్రి ఇంద్రనీలము
పాల జలనిధిలోన పాయని దివ్యరత్నము
బాలుని వలె తిరిగీ పద్మనాభుడు ॥

## 185. ముద్దులుమోమున

ముద్దులు మోమున ముంచగను
నిద్దపు కూరిమి నించీని ॥
మొలచిరుగంటలు మువ్వలు గజ్జెలు
గలగలమనగా కదలగను
ఎలనవ్వులతో ఈతడు వచ్చి
జలజపు చేతలు చాచీని ॥
అచ్చపు గుచ్చు ముత్యాల హారములు
పచ్చల చంద్రాభరణములు
తచ్చిన చేతుల తానె దైవమని
అచ్చట నిచ్చట ఆడీని ॥
బాలుడు కృష్ణుడు పరమపురుషుడు
నేలకు నింగికి నెరి పొడవై
చాల వేంకటాచలపతి తానై
మేలిమి చేతల మించీని ॥





## 186. మూసిన ముత్యానకేలే

మూసిన ముత్యానకేలే మొరగులు
ఆసల చిత్తానకేలే అలవోకలు ॥
కందులేని మోముకేలే కస్తూరి
చిందు నీ కొప్పునకేలే చేమంతులు
మందయానమునకేలే మట్టెల మోతలు
గందమేలే పై కమ్మని నీ మేనికి ॥
భారపు గుబ్బలకేలే పయ్యెద నీ
బీరపు చూపుల కేలే పెడమోము
జీరల బుజాలకేలే చెమటలు నీ
గోరంటు గోండ్లకేలే కొనవాండ్లు ॥
ముద్దుల మాటలకేలే ముదములు నీ
అద్దపు చెక్కులకేలే అరవిరి
ఒద్దిక కూటమికేలే  ఊర్పులు నీకు
అద్దమేలే తిరువేంకటాద్రీశు గూడి ॥

## 187. మేడలెక్కినిన్నుజూచి

మేడలెక్కి నిన్ను జూచి కూడేననే యాసతోడ
వాడుదేరి వుస్సురందురా వెంకటేశ
యాడనుంటి విందాకానురా ॥
పిక్కటిల్లు చన్నులపై చొక్కపు నీ వుంగరము
గక్కన నేనద్దుకొందురా వెంకటేశ
లక్కవలె ముద్రలంటెరా ॥
దప్పిగొంటివని నీవు కప్పుర ముపారమిచ్చి
ముప్పిరి నీ విరహానను వేంకటేశ
నిప్పనుచు భ్రమసితిరా ॥

నిండపూచిన మానిపై గండుకోవిల కూయగా
నిండిన నీ యెలుగంటాను వెంకటేశ
అండకు నిన్ను రమ్మంటిరా ॥
వుదయచందురు జూచి అదె నీ పంజని సవి
యెదురుకోనే వచ్చితిరా వెంకటేశ
యెదరి మారుమోమైతిరా ॥
మిన్నక కేళాకూళిలో వున్న తమ్మివిరులు నీ
కన్నులంటా జేరబోగాను వేంకటేశ
పన్ని మరునమ్ము లాయరా ॥
ఆనిన తుమ్మిదలు నీమేని కాంతిబోలునని
పూని చేతబట్టబోగాను వేంకటేశ
సునాస్త్రుని వేగులాయరా ॥
కందువ మై చెమరించి గందవొడి చల్లుకొని
పొందనిన్ను దలచితిరా వెంకటేశ
అంది చొక్కుమందు లాయరా ॥
బొండుమల్లె పానుపుపై నుండి నిన్ను పాడిపాడి
నిండు జాగరము లుంటిరా వెంకటేశ
యెండలాయ వెన్నెలలురా ॥
నిద్దిరించి నీవు నాకు వొద్దనుండ కలగంటి
చద్దివేడి వలపాయరా వెంకటేశ
సుద్దులింకా నేమి సేసేవో ॥
మల్లెపూవు కొనదాకి ఝల్లనను పులకించి
వుల్లము నీ కొప్పించితిరా వెంకటేశ
కల్లగాదు మమ్ముగావరా ॥
జోడుగూడి నీవు నేను నాడుకొన్న మాటలెల్లా
గోడలేని చిత్తరువులై వెంకటేశ
యాడా నామతి బాయవురా ॥





అద్దము నీడలు చూచి ముద్దుమోవి కంటుండగా
కొద్దిలేని కాకతోడను వెంకటేశ
పొద్దువోక తమకింతురా ॥
పావురమురెక్క జీటి నీవొద్దికి గట్టి యంపి
దేవరకే మొక్కుకొందురా వెంకటేశ
నీవిందు రావలెనంటాను ॥
బంగారు పీటపై నుండి ముంగిటికి నీవు రాగా
తొంగి చూచి నిలుచుండగా వెంకటేశ
యెంగిలి మోవేలడిగేవు ॥
దంతపుబావాలు మెట్టి పంతాన నేను రాగాను
యింతలో బలిమిబట్టేవు వెంకటేశ
అంత నీకు బ్రియమైతినా ॥
పట్టుచీర కొంగు జారీ గుట్టుతో నేనుండగాను
వట్టి నవ్వు లేల నవ్వేవు వెంకటేశ
దిట్టవు నీయంతవారమా ॥
కొప్పువట్టి తీసి నీవు చెప్పరాని సేతసేసి
తప్పక నేజూచినంతలో వెంకటేశ
చిప్పిలేల చెమరించేవు ॥
బొమ్మల జంకించి నిన్ను తమ్మిపూవున వేసితే
కమ్మియేల తిట్టు దిట్టేవు వెంకటేశ
నిమ్మపంట వేతునటరా ॥
నెత్త మాడేనంటా రతి పొత్తుల పందేలు వేసి
వొత్తి నీవే వోడే వేలరా వెంకటేశ
కొత్తలైన జాణ వౌదువు ॥

వున్నతి శ్రీ వెంకటేశ మన్నించి కూడితివిదే
నన్నునెంత మెచ్చు మెచ్చేవు వెంకటేశ
కన్నుల పండువలాయరా ॥
చిలుకలు మనలోన కలసినయట్టివేళ
పలుకు రతిరహస్యాలు వెంకటేశ
తలచి నే తలవూతురా ॥
నీకు వలచిన వలపు లాకలొత్తె నామతిని
వాకున నే చెప్పజాలరా వెంకటేశ
లోకమెల్లా నెరగినదే ॥
పాయము నీకొక్కనికే చాయగా మీదెత్తితిని
యీయెడ గైవాలకుండను వెంకటేశ
మా యింటనే పాయకుండరా ॥
ముమ్మాటికి నీబాసలే నమ్మివున్నదాన నేను
కుమ్మరించరా నీకరుణ వెంకటేశ
చిమ్ము చీకటెల్ల పాయను ॥

## 188. మేదిని జీవులఁగావ

మేదిని జీవులఁగావ మేలుకోవయ్యా
నీదయ మాకెల్ల రక్ష నిద్రమేలుకోవయ్యా ॥
తగు గోపికల కన్ను దామరలు వికసించె
మిగుల సూర్యనేత్రుఁడ మేలుకోవయ్యా
తెగువ రాక్షసులనే తిమిరము విరియఁగ
నెగడిన పరంజ్యోతి నిద్ర మేలుకోవయ్యా ॥
ఘనదురితపు నల్లఁగలువల వికసించె
మినుకు శశివర్ణుఁడ మేలుకోవయ్యా
పనివడి వేదాలనే పక్షులెల్లాఁబలుకఁగ
జనక యాశ్రితపారిజాత మేలుకోవయ్యా ॥





వరలక్ష్మి కుచచక్రవాకము లొండొంటిరాయ
మెలయు దోషారహిత మేలుకోవయ్యా
పొరసి నీవు నిత్యభోగములు భోగించ
నిరతి శ్రీవెంకటేశ నేఁడు మేలుకోవయ్యా ॥

## 189. మొత్తకురే అమ్మలాల

మొత్తకురే అమ్మలాల ముద్దులాడు వీడె
ముత్తెము వలె నున్నాడు ముద్దులాడు ॥
చక్కని యశోదతన్ను సలిగె తో మొత్తరాగా
మొక్కబోయీ కాళ్ళకు ముద్దులాడు
వెక్కసాన రేపల్లె వెన్నలెల్లా మాపుదాక
ముక్కునవయ్యగ తిన్న ముద్దులాడు ॥
రువ్వెడి తాళ్ళదల్లి రోలదన్నుఁగట్టెనంటా
మువ్వల గంటలతోడి ముద్దులాడు
నవ్వెడి చెక్కుల నిండా నమ్మిక బాలునివలె
మువ్వురలో నెక్కుడైన ముద్దులాడు ॥
వేలసంఖ్యలసతుల వెంటబెట్టుకొనిరాగా
మూల చన్ను కుడిచీ నీ ముద్దులాడు
మేలిమి వేంకటగిరి మీద నున్నాడిదె వచ్చి
మూల భూతి తానైన ముద్దులాడు ॥

## 190. రమణుడ ఇంతట

రమణుడ ఇంతట రారాదా
సమరతి దేరీ జగడము లికను ॥
కోవిల తిట్లగొణగుల చేతను
తావులు దప్పెను ధైర్యములు
మావుల చిలుకల మాటవెంగెముల
వావులు మాలెను వలపులు చెలికి ॥

కొంచెపు వాయువు కుంటెన తనముల
చంచల మందెను సతి మనసు
పంచల తుమ్మిద బలముల పొంచుల
ఇంచుకించుకే ఎక్కెను చలము ॥

విరుల శరంబుల వేండ్ల వాండ్ల
మరులును తెలువులు మగువకును
ఇరవుగ శ్రీవేంకటేశ కూడితివి
సరసపు మాటలు సాగెను కొనకు ॥

## 191. రంగరంగ రంగపతి

రంగ రంగ రంగపతి రంగనాథా – నీ
సింగారాలె తరచాయ శ్రీరంగనాథా ॥

పట్టపగలేమాతో పలచగ నవ్వేవు
ఒట్టులేల పెట్టుకునేవో రంగనాథా
వట్టి మాకు లిగిరించువడి నీ మాటలు వింటే
రట్టడివిమేర మీరకు రంగనాథా

కావేరి రంగమున కాంతపై పాదాలు చాచి
రావు పోవు ఎక్కడికి రంగనాథా – శ్రీ
వేంకటాద్రి మీద చేరి నన్ను కూడితివి
ఏవల చూచిన నీవే ఇటు రంగనాథా ॥

## 192. రాజీవ నేత్రాయ

రాజీవ నేత్రాయ రాఘవాయ నమో
సౌజన్య నిలయాయ జానకీశాయ

దశరథ తనూజాయ తాటక దమనాయ
కుశిక సంభవ యజ్ఞగోపనాయ





పశు పశుపతి మహా ధనుర్భంజనాయ నమో
విశద భార్గవ రామ విజయకరణాయ

భరి తధర్మాయ శూర్పణ ఖాంగ హరణాయ
ఖరదూషణాది రిపు ఖండనాయ
తరణి సంభవసైన్య దక్షకాయ నమో
విరుపమ మహా వారిధి బంధనాయ

హతరావణాయ సంయమినాథ వరదాయ
అతులిత అయోధ్యా పురాధి పాయ
హితకరశ్రీ వేంకటేశ్వరాయ నమో
వితత వావిలి పాటి వీర రామాయ

## 193. రామచంద్రుడితడు

రామచంద్రుడితడు రఘువీరుడు
కామిత ఫలము లియ్యగలిగె నిందరికి ॥

గౌతము భార్యపాలిటి కామధేను వితడు
ఘాతల కౌశికుపాలి కల్పవృక్షము
సీతాదేవి పాలిటి చింతామణి ఇతడు
ఈతడు దాసులపాలి ఇహపర దైవము ॥

పరగ సుగ్రీవు పాలి పరమ బంధుడితడు
సరి హనుమంతు పాలి సామ్రాజ్యము
నిరతి విభీషణుని పాలి నిధానము ఈతడు
గరిమ జనకు పాలి ఘనపారిజాతము ॥

తలప శబరి పాలి తత్త్వపు రహస్యము
అలరి గుహుని పాలి ఆదిమూలము
కలడన్న వారి పాలి కన్ను లెదుటి మూరితి
వెలయ శ్రీ వేంకటాద్రి విభుడీతడు ॥

## 194. రాముడు రాఘవుడు

రాముడు రాఘవుడు రవికులు డితడు
భూమిజకు పతియైన పురుష నిధానము ॥

అరయ పుత్రకామేష్టియందు పరమాన్నమున
పరగ జనించిన పరబ్రహ్మము
సురల రక్షింపగ అసురల శిక్షింపగ
తిరమై ఉదయించిన దివ్యతేజము ॥

చింతించే యోగీంద్రుల చిత్త సరోజములలో
సంతతము నిలిచిన సాకారము
వింతలుగా మునులెల్ల వెదకిన యట్టి
కాంతుల చెన్ను మీరిన కైవల్యపదము ॥

వేద వేదాంతములయందు విజ్ఞాన శాస్త్రములందు
పాదుకొన పలికేటి పరమార్థము
పోదితో శ్రీ వేంకటాద్రి పొంచి విజనగరాన
ఆదికి అనాదియైన అర్చావతారము ॥

## 195. రాముడు లోకాభి రాముడు

రాముడు లోకాభిరాముడు త్రైలోక్య –
ధాముడు రణరంగ భీముడు వాడె ॥

వరుడు సీతకు ఫలాధరుడు మహోగ్రపు
శరుడు రాక్షస సంహరుడు వాడె
స్థిరుడు సర్వగుణాకరుడు కోదండదీక్షా –
గురుడు సేవక శుభకరుడు వాడే ॥

ధీరుడు లోకైక వీరుడు సకలా –
ధారుడు భవ బంధ దూరుడు వాడే
శూరుడు ధర్మ విచారుడు రఘువంశ
సారుడు బ్రహ్మ సాకారుడు వాడే ॥





బలుడు ఇన్నిట రవికులుడు భావించ ని –
ర్మలుడు నిశ్చలుడు అవికలుడు వాడే
వెలసి శ్రీ వేంకటాద్రి విజనగరములోన
తలకొనె పుణ్యపాదతలుడు వాడే ॥

## 196. లాలనుచు నూచేరు

("అన్నమాచార్య జీవిత చరిత్ర" పీఠిక)

లాలనుచు నూచేరు లలన లిరుగడల
బాల గండవర గోపాల నిను చాల ॥

ఉదుటుగుబ్బల సరము లుయ్యాల లూగ
పదరి కంకణరవము బహుగతుల మ్రోగ
వొదిగి చెంపల కొప్పు లొక్కింత వీగ
ముదురు చెమటల నళికములు తొప్పదోగ ॥

సొలపు తెలికన్నుగవచూపు లిరువంక
మలయురవళులకు పలుమాఱును బెళంక
కొలది కోవిలగములు క్రోలు మదనాంక
ముల గ్రేణిసేయు రవములు వడి దలంక ॥

సరసపదములు జంగచాపుచే పాయ
గురులీల మీగాళ్ల గుచ్చెళ్లు రాయ
కరమూలముల కాంతి కడుజాయ చేయ
సరస నురు కుసుమ వాసన లెదురు డాయ ॥

కొలది నునుమేను లతకూన లసియాడ
మెలకువతొ నొకరొకరి మెచ్చి సరిగూడ
తలలూచి చొక్కి చిత్తరుబొమ్మలాడ
అలరి యెల్లరు మోహనాకృతులు చూడ ॥

లలిత తాంబూల రసకలితంబు లైన
తళుకుదంతములు కెంపులగుంపులీన

మొలకవెన్నెలడాలు ముసురుకొని తోన
చెలగి సెలవుల ముద్దు చిఱునవ్వులాన ॥
మలయమారుత గతులు మాటికి చెలంగ
పలుకు కపురపుతావి పైపై మెలంగ
బలుగానలహరి యింపుల రాల్గరంగ
బలసి వినువారి చెవి బడలిక దొలంగ ॥
లలనాజనాపాంగ లలితసుమచాప
జలజలోచనదేవ సద్గుణకలాప
తలపు లోపల మెలగు తత్వప్రదీప
భళిర గండవరేశ పరమాత్మరూప ॥

## 197. వందే వాసుదేవం

వందే వాసుదేవం శ్రీపతిం
బృందారకాధీశ వందితపదాబ్జం ॥
ఇందీవరశ్యామ మిందిరాకుచతటీ
చందనాంకిత లసచ్చారుదేహమ్
మందారమాలికా మకుటసంశోభితం
కందర్పజనక మరవిందనాభమ్ ॥
ధగధగిత కౌస్తుభాధరణ వక్షస్థలం
ఖగరాజవాహనం కమలనయనమ్
నిగమాధిసేవితం నిజరూపశేషప
న్నగరాజశాయినం ఘననివాసమ్ ॥
కరిపురనాథ సంరక్షణే తత్పరం
కరిరాజవరద సంగత కరాబ్జమ్
సరసీరుహాననం చక్రవిభ్రాజితం
తిరువేంకటాచలాదేవం భజే ॥





## 198. వాడె వేంకటాద్రి మీద

వాడె వేంకటాద్రిమీద వరదైవము
పోడిమితో పొడచూపె పొడవైనదైవము ॥
వొక్కొక్కరోమకూపాన నొగి బ్రహ్మాండకోట్లు
పిక్కటిల్ల వెలుగొందే పెనుదైవము
పక్కనను తనలోని పదునాలుగులోకాలు
తొక్కి పాదానగొలచేదొడ్డదైవము ॥
వేదశాస్త్రాలు నుతించి వేసరి కానగలేని –
మోదపు పెక్కు గుణాల మూలదైవము
పోది దేవతలనెల్ల పుట్టించ రక్షించ
ఆదికారణంబైన అజుగన్నదైవము ॥
సరుస శంఖచక్రాలు సరిబట్టి అసురల
తరగి పడవేసిన దండిదయివమూ
సిరి వురమున నించి శ్రీ వేంకటేశుడయి
శరణాగతులగాచే సతమైననదైవము ॥

## 199. విచ్చేయవమ్మా

విచ్చేయవమ్మా వెన్నెల బొమ్మ
మచ్చిక మరునిధాక మగువనీరాక
పంచెల పసిండి నిగ్గువచ్చి దేరే సిగ్గు
వంచెన వలపు తీపు వాలుకచూపు
కంచెపుంబాల కూడుకాకలనీవాడు
మంచెపునీ తలంబ్రాలు మట్టిపాదాలు
కోవిల కొసరుబాట కొమ్మరో నీ మాట
తావుల చెంగావినీ తళుకు మోవి

గోవ జవ్వాదిక రంగు గుబ్బల నీ మెఱుంగు
భావజు దాడి రొదలు పాదపునీ కతలు
ముద్దుల నీ నగవు చిమ్ముల రతి బిగువు
అద్దలింపు కసరు మోహంపు కొసరు
గద్దరి నీ యలపు వెంకటగిరి తలపు
అద్దపు నీ మోము మోహనరతి సాము

## 200. వినరో భాగ్యము

వినరో భాగ్యము విష్ణుకథ
వెనుబలమిదివో విష్ణుకథ ॥
ఆది నుండి సంధ్యాది విధులలో
వేదంబయినది విష్ణుకథ
నాదించీనిదె నారదాదులచే
వీధి వీధులనే విష్ణుకథ ॥
వదలక వేదవ్యాసులు నుడివిన
విదిత పావనము విష్ణుకథ
సదనంబైనది సంకీర్తనయై
వెదకినచోటనే విష్ణుకథ ॥
గొల్లెతలు చల్లలుగొనకొని చిలుకగ
వెల్లి విరియాయె విష్ణుకథ
యిల్లిదె శ్రీ వేంకటేశ్వరు నామము
వెల్లిగొలిపె నీ విష్ణుకథ ॥

## 201. విన్నపాలు వినవలె

విన్నపాలు వినవలె వింత వింతలు
పన్నగపు దోమతెర పైకెత్త వేలయ్యా ॥





తెల్లవారె జామెక్కె దేవతలు మునులు
అల్లనల్లనంతనింత నదివో వారె
చల్లని తమ్మిరేకుల సారస్యపు కన్నులు
మెల్ల మెల్లనె విచ్చి మేలుకొనవేలయ్యా ॥
గరుడ కిన్నర యక్షకామినులు గములై
విరహపు గీతముల వింత తాళాల
పరిపరివిధములం బాడేరు రాగాల నిన్నదివో
సిరిమొగము దెరచి చిత్తగించవేలయ్యా ॥
పొంకపు శేషాదులు తుంబురు నారదాదులు
పంకజభవాదులు నీ పాదాలు చేరి
అంకెలనున్నారు లేచి అలమేలుమంగను
వేంకటేశుడా రెప్పలు విచ్చి చూచిలేవయ్యా ॥

## 202. విశ్వప్రకాశునకు

విశ్వప్రకాశునకు వెలియేడ లోనేడ
శాశ్వతున కూహింప జన్మ మిక నేడ ॥
సర్వపరిపూర్ణునకు సంచార మిక నేడ
నిర్వాణమూర్తికిని నిలయ మిక నేడ
పుర్వీధరునకు కాలూద నొకచోటేడ
పార్వతీస్తుత్యునకు భావ మిక నేడ ॥
నానాప్రభావునకు నడుమేడ మొదలేడ
ఆనన సహస్రునకు నవ్వలివ లేడ
మౌనిహృదయస్థునకు మాటేడ పలుకేడ
జ్ఞానస్వరూపునకు కాన విన నేడ ॥
పరమయోగీంద్రునకు పరులేడ తానేడ
దురితదూరునకు సంస్తుతినింద లేడ

తిరువేంకటేశునకు దివ్యవిగ్రహమేడ
హరికి నారాయణున కవుగాము లేడ ॥

## 203. విశ్వరూప మిదివో

విశ్వరూప మిదివో విష్ణురూప మిదివో
శాశ్వతులమైతిమింక జయము మా జన్మము
కొండవంటి హరి రూపు గురుతైన తిరుమల
పండిన వృక్షములే కల్పతరువులు
నిండిన మృగాదులెల్ల నిత్యయుక్త జనములు
మెండుగ ప్రత్యక్షమాయ మేలువో జన్మము
మేడవంటి హరి రూపు మించైన పైడి గోపుర
మాడనే వాలిన పక్షులు అమరులు
వాడల కోనేటి చుట్ల వైకుంఠ నగరము
యీడమాకు బొడచూపె ఇహమేపోపరము
కోటి మదనుల వంటి గుడిలో చక్కనిమూర్తి
యీటులేని శ్రీ వేంకటేశు డితడు
వాటపు సొమ్ములు ముద్ర వక్షపుటలమేల్మంగ
కూటువై నన్నేలితివి యెక్కువవో నాతపము

## 204. వింటిమి నీ కథలు

వింటిమి నీ కథలు కంటిమి నీ మాయలు
బంటుల మచ్యుత నీ పాలివారమయ్యా
కలిగిరి నీ వల్లనే కడగి బ్రహ్మాదులు
నిలిచిరి సురలెల్లా నీ వల్లనే
తెలిసిరి మునులెల్లా దేవుడవు నీవేయని
చలపట్టి హరినీకు శరణనేమయ్యా





నుతియించీ వేదములు నోరార నీ మహిమ
గతియాయ వైకుంఠమే ఘనులకెల్లా
ప్రతిలేని నీరూపే భావించేరు యోగీంద్రులు
తతితో శ్రీపతి నీకే దాసులమయ్యా
అదెనీ చక్రముచే తనదగిరసురలెల్లా
బదికిరి విప్రులు నీ పాద సేవను
పొదలి శ్రీ వేంకటేశ పొంది నీ కరుణచేత
మొదల వెనుక నీకే మొక్కేమయ్యా

## 205. వెట్టివలపు చల్లకు

(పెద తిరుమలాచార్య సంకీర్తన)

వెట్టి వలపు చల్లకు విష్ణుమూరితి నాతో
వెట్టదీర మాటాడు విష్ణు మూరితి ॥
వినయము సేసేపు విష్ణుమూరితి నీవు
వెనకటి వాడవెగా విష్ణుమూరితి
వినవయ్యా మామాటలు విష్ణుమూరితి మమ్ము
వెనుకొని పట్టకుమీ విష్ణుమూరితి ॥
వెరవుగల వాడవు విష్ణుమూరితి నేడు
వెరగైతి నిన్ను జూచి విష్ణుమూరితి
విరివాయె నీమాయలు విష్ణుమూరితి నాకు
విరులిచ్చే వప్పటికి విష్ణుమూరితి ॥
వెలసె నీ సేతలెల్ల విష్ణుమూరితి మా
వెలుపల లోన నీవె విష్ణుమూరితి
వెలలేని శ్రీ వేంకట విష్ణుమూరితి కూడి
విలసిల్లితివి నాతో విష్ణుమూరితి ॥

## 206. వేడుకొందామా

("అన్నమాచార్య జీవిత చరిత్ర పీఠిక" నుండి)

వేడుకొందామా వేంకటగిరి వేంకటేశ్వరుని ॥
ఆమటి మొక్కులవాడే ఆదిదేవుడే వాడు
తోమని పళ్యాలవాడే దురిత దూరుడే ॥
వడ్డీకాసులవాడే వనజనాభుడే పుట్టు
గొడ్డ్రాండ్రకు బిడ్డలిచ్చే గోవిందుడే ॥
ఎలమి కోరిన వరాలిచ్చేదేవుడే వాడు
అలమేల్మంగా వెంకటాద్రినాథుడే ॥

## 207. శరణు శరణు

శరణు శరణు సురేంద్ర సన్నుత
శరణు శ్రీసతి వల్లభ
శరణు రాక్షస గర్వ సంహర
శరణు వేంకటనాయకా
కమలధరుడును కమల మిత్రుడు
కమల శత్రుడు పుత్రుడు
క్రమముతో మీ కొలువుకిప్పుడు
కాచినా రెచ్చరికయా
అనిమిషేంద్రులు మునులుదిక్పతు
లమర కిన్నర సిద్ధులు
ఘనతతో రంభాదికాంతలు
కాచినారెచ్చరికయా
ఎన్నగల ప్రహ్లాద ముఖ్యులు
నిన్ను కొలువగ వచ్చిరి
విన్నపము వినవయ్య తిరుపతి
వేంకటాచల నాయకా





## 208. శిరుత నవ్వులవాడు

శిరుత నవ్వులవాడు శిన్నెక వీడు
వెరపెరగడు సూడవే శిన్నెక ॥
పొలసుమేనివాడు బోరవీపువాడు
సెలసుమోరవాడు శిన్నెక
గొలుసుల వంకల కోరలతో బూమి
వెలసినాడు సూడవే శిన్నెక ॥
మేటి కురచవాడు మెడమీది గొడ్డలి
సీటకాలవాడు శిన్నెక
ఆటదానిబాసి అడవిలో రాకాసి
వేటలాడీ సూడవే శిన్నెక ॥
బింకపు మోతల పిల్లగోవివాడు
సింక సూపులవాడు శిన్నెక
కొంకక కలికియై కొసరిగూడెనన్ను
వేంకటేశుడు సూడవే శిన్నెకా ॥

## 209. శ్రీమన్నారాయణ

శ్రీమన్నారాయణ శ్రీమన్నారాయణ
శ్రీమన్నారాయణ నీ శ్రీపాదమే శరణు ॥
కమలాసతీముఖకమల కమలహిత
కమలప్రియ కమలేక్షణ
కమలాసనహిత గరుడగమన శ్రీ
కమలనాభ నీ పదకమలమే శరణు ॥
పరమయోగిజన భాగధేయ శ్రీ
పరమ పురుష పరాత్పరా
పరమాత్మా పరమాణురూప శ్రీ
తిరువేంకటగిరి దేవా శరణు ॥

## 210. షోడశ కళానిధికి

షోడశ కళానిధికి షోడశోపచారములు
జాడతోడ నిచ్చలును సమర్పయామి ॥
అలరు విశ్వాత్మకునకు ఆవాహనమిదె పర్వ -
నిలయునకు ఆసనము నెమ్మినిదే
అల గంగాజనకునకు అర్ఘ్యపాద్యాచమనాలు
జలధి శాయికిని మజ్జనమిదె ॥
వరపీతాంబరునకు వస్త్రాలంకారమిదె
సరి శ్రీమంతునకు భూషణములివె
ధరణీధరునకు గంధపుష్ప ధూపములు
తిరమిదె కోటిసూర్యతేజునకు దీపము ॥
అమృత మథనునకు అదివో నైవేద్యము
గమిచంద్రనేత్రునకు కప్పురవిడెము
అమరిన శ్రీ వేంకటాద్రిమీది దేవునకు
తమితో ప్రదక్షిణాలు దండములు ఇవిగో ॥

## 211. సకలలోకేశ్వరులు

సకల లోకేశ్వరులు సరుస చేకొనువాడు
అకలంకముగ పుష్ప యాగంబు ॥
వివిధ పుష్పములతో వేదఘోషములతో
అవల తిరువాముడియు అంగనల ఆటతో
కవి వంది నుతులతో కమ్మ పూజలతోడ -
నవధరించీ పుష్ప యాగంబు ॥
కప్పురపుటారతుల ఘనచందనము తోడ
తెప్పల ధూపముల తిరువంది కాపుతో
ఒప్పు(గ) పణ్యారములు వొగి పెక్కువగలతో
అప్పడందీ పుష్పయాగంబు ॥





తగు ఛత్ర చామర తాంబూలములతోడ
పగటుతో నీరీతి పదిపూజలందుకొని
జిగిమీరె చూడరే శ్రీ వేంకటేశ్వరుని
అగణితంబగు పుష్పయాగంబు ॥

## 212. సకలాపరాధములు

సకలాపరాధములు శమియించుకోవయ్య
అకలంకమైన నీ యానతిలో దానను ॥
చేరి నీపాదములకు సేవసేసే నంటినా
నేరుపులు నీ వెరగనివి లేవు
ఏరీతినైనా చెయ్యెత్తి మొక్కేనంటినా
కారణాలు నీవిన్ని కాననివి కావు ॥
మనసిచ్చి నీతోను మాటలాడేనంటినా
వెనక ముందర నీకు వింతకాదు
చనవు నెరపి నీ సరుస నుండే నంటినా
వినికి తా నీవు తొల్లి విననిదికాదు ॥
గక్కన కాగిట నిన్ను కరగించే నంటినా
ఇక్కువల నీకు నీవి ఎరవుకాదు
చిక్కి నన్ను కూడితివి శ్రీవేంకటేశ్వరనీవు
పెక్కు సొత్తు లెల్ల నీకు భేదము కాదు ॥

## 213. సతులాలాచూడరే

సతులాలా చూడరే శ్రావణ బహుళాష్టమి
కతలాయ నడురేయి కలిగె శ్రీకృష్ణుడు ॥
పుట్టేయపుడే చతుర్భుజాలు శంఖుచక్రాలు
ఎట్టు ధరియించెనే యీ కృష్ణుడు
అట్టే కిరీటము ఆభరణాలు ధరించి
ఎట్ట ఎదుట వున్నాడు ఈ కృష్ణుడు ॥

వచ్చి బ్రహ్మయురుద్రుడు వాకిట నుతియించగాను
ఇచ్చగించి వినుచున్నాడీ కృష్ణుడు
ముచ్చటాడీ దేవకితో ముంచి వసుదేవునితో
హెచ్చిన మహిమలతో ఈ కృష్ణుడు ॥
కొదదీర మరి నందగోపునకు యశోదకు
ఇదివో తా బిడ్డడాయె నీ కృష్ణుడు
అదన శ్రీ వేంకటేశుడై అలమేల్మంగగూడి
ఎదుటనే (నిలుచున్నాడీ కృష్ణుడు) వున్నాడు ఈ కృష్ణుడు ॥

## 214. సర్వాంతరాత్ముడవు

సర్వాంతరాత్ముడవు శరణాగతుడ నేను
సర్వాపరాధినైతి చాలు చాలు నయ్యా
వూరుకున్న జీవునికి ఒక్కొక్క స్వతంత్రమిచ్చి
కోరేటి అపరాధాలు కొన్నివేసి
నేరకుంటే నరకము నేరిచితే స్వర్గమంటా
దూరువేసే వింతేగా దోషమెవ్వరిదయ్యా
మనసు చూడవలసి మాయలు నీవేకప్పి
జనులకు విషయాలు చవులు చూపి
కనుగొంటే మోక్షమిచ్చి కానకుంటే కర్మమిచ్చి
ఘనముసేసే విందు కర్తలెవ్వరయ్యా
వున్నారు ప్రాణులెల్లా నొక్క నీ గర్భములోనే
కన్న కన్న భమతలే కల్పించి
యిన్నిటా శ్రీ వేంకటేశ యేలితివి మమ్మునిట్టె
నిన్ను నన్ను నెంచుకుంటే నీకె తెలుసు నయ్యా

## 215. సహజ వైష్ణవాచార వర్తనుల

సహజ వైష్ణవాచార వర్తనుల
సహవాసమె మా సంధ్య ॥





అతిశయమగు శ్రీహరి సంకీర్తన
సతతంబును మా సంధ్య
మతి రామానుజమతమే మాకును
చతురత మెరసిన సంధ్య ॥
పరమ భాగవతపద సేవనమే
సరవి నెన్న మా సంధ్య
సిరివరు మహిమలు చెలువొందగ వే-
సరక వినుటె మా సంధ్య ॥
మంతుకెక్క తిరుమంత్రపఠనమే
సంతతమును మా సంధ్య
కంతు గురుడు వేంకటగిరిరాయని
సంతర్పణమే మా సంధ్య ॥

## 216. సందెకాడ బుట్టినట్టి

సందెకాడ బుట్టినట్టి చాయల పంట యెంత -
చందమాయ చూడరమ్మ చందమామ పంట ॥
మునుప పాలవెల్లి మొలచి పండినపంట
నినుపై దేవతలకు నిచ్చపంట
గొనకొని హరికన్ను గొనచూపులపంట
వినువీధి నెగడిన వెన్నెలల పంట ॥
వలరాజు పంపున వలపు విత్తిన పంట
చలువై పున్నమనాటి జాజరపంట
కలిమి కామిని తోడ కారుకమ్మినపంట
మలయుచు తమలోని మట్టిమాని పంట ॥
విరహుల గుండెలకు వెక్కసమైన పంట
పరగచుక్కలరాసి భాగ్యము పంట

అరుదైె తూరుపుకొండ నారగబండినపంట
యిరవై శ్రీ వేంకటేశు నింటిలోని పంట ॥

## 217. సువ్విసువ్వి సువ్వాలమ్మా

సువ్వి సువ్వి సువ్వాలమ్మా
నవ్వుచు దేవకి నందను గనియె ॥
శశి వొడచె అలసంబులు గడచె
దిశ దేవతల దిగుళ్లు విడచె ॥
కావిరి విరసె కంసుడు గినిసె
వావిరి పువ్వుల వానలు గురిసె ॥
గతి సేసె అటు గాడిద గూసె
కుతిలకుడిచి జనకుడు నోరు మూసె ॥
గగురు పొడిచె లోకము విధి విడిచె
మొగులు గురియగ యమునపై నడచె ॥
కలిజారె వేంకటపతి మీరె
అలమేల్మంగ నాంచారమ్మ కలుకలు తీరె ॥

## 218. సేవింపరో జనులాల

సేవింపరో జనులాల చేరి మొక్కరో
భావింప నున్నాడిందరి భాగ్యము వలెను ॥
జలకమాడి వున్నాడు సర్వేశ్వరుడు నిగ్గ
గలిగిన మంచి నల్లకలువ వలెను
ఎలమి కప్పురకాపు ఇదె చాతుకున్నవాడు
వెలలేనియట్టి పెద్ద వెండికొండవలెను ॥
అందముగా తట్టుపుణుగు అలదుక నున్నవాడు
కందువ ఇంద్రనీలాల గనివలెను
ముందటి వలెనె తా సొమ్ములు నించుకున్నవాడు
పొందిన సంపదలకు పుట్టినిల్లువలెను ॥





మించి అలమేల్మంగ మెడగట్టుకొన్నవాడు
మంచి బంగారు తామరపువ్వువలెను
ఎంచగ శ్రీ వేంకటేశుడిదే కొలువై వున్నవాడు
నించిన దాసులపాలి నిధానము వలెను ॥

## 219. హరినామము కడు

హరినామము కడు ఆనందకరము
మరుగవొ మరుగవొ మరుగవొ మనసా ॥
నలినాక్షుని శ్రీ నామము
కలిదోషహరము కైవల్యము
ఫలసారము బహుబంధమోచనము
తలచవొ తలచవొ తలచవొ మనసా ॥
నగధరునామము నరకహరణము
జగదేకహితము సమ్మతము
సగుణ నిర్గుణము సాక్షాత్కారము
పొగడవొ పొగడవొ పొగడవొ మనసా ॥
కడిగి శ్రీ వేంకటపతి నామము
బడిబడినే సంపత్కరము
అడియాలంబిల నతిసుఖమూలము
తడవవొ తడవవొ తడవవొ మనసా ॥

## 220. హరి నీవే సర్వాత్మకుడవు

హరి నీవే సర్వాత్మకుడవు
యిరవగు భావన యియ్యగదే ॥
చూడక మానవు చూచేటి కన్నులు
యేడనేవైనా యితరములు
నీడల నింతా నీ రూపములని
యీడువడని తెలి వియ్యగదే ॥

పారక మానదు పాపపు మనసిది
యీరసములతో నెందైనా
నీరజాక్షయిది నీమయమేయని
యీ రీతుల తల పియ్యగదే ॥
కలుగక మానవు కాయపు సుఖములు
యిలలోపలగల వెన్నైనా
అలరిన శ్రీవేంకటాధిప నీకే
యిలనర్పితమను యిహమియ్యగదే ॥

## 221. హరి శరణాగతి

హరి శరణాగతి యాతుమది
సరుస నిదియ పో సతమయ్యెడిది ॥
దినదినరుచులివి దేహమువి
చెనకేటి కోరిక చిత్తముది
యెనసేటి కాంతలు యింద్రియంబులవి
పనివి యాత్మకివి పనిలేదయ్యా ॥
పదరేటి కోపము పావ ముది
అదనకాలములు అనాదివి
నిదుర తమోగుణ నిలయముది
యెదుట నాత్మకివి యెరవెరవయ్యా ॥
కాయపు జననము కర్మముది
మాయలంపటము మమతలది
యేయెడ శ్రీ వేంకటేశుడితనికృప
పాయని యాత్మకు ప్రమాణమయ్యా ॥

## 222. హరి సర్వాత్మకుడు

హరి సర్వాత్మకుడు ఆదిమ పురుషుడు
పొరి నెరుగు వారి పుణ్యముగాన





నాలుక కొననే నారాయణు నిదే
వైలము దలచని వారిదె పాపము
నేలయు మిన్నును నిజ వైకుంఠము
పోలించి చూడని పురుషుల వెలితి
మనసులోననే మాధవుడున్నాడు
కనుగొనని వారి కడమింతే
తనువే విష్ణుని తత్వసాధనము
వొనరగ శ్రీపతి యున్నాడు గాన
చేరువనిదివో శ్రీ వేంకటపతి
ధారుణి కొలిచేటి దాసుల భాగ్యము
కారణ మితడే కలిగిన దైవము
కోరిన వారల కొంగుల పసిడి

## 223. హరి హరి నీ మాయా మహిమ

హరి హరి నీమాయా మహిమ
సరవిదెలియ నను కరుణించగదే
తలతును నాపాలి దైవమవని నిను
తలతును తల్లివి తండ్రివని
మలసియంతలో మరతును తెలుతును
కలవలె నున్నది కడగనరాదు
మొక్కుదు నొకపరి మొగి నేలికవని
మొక్కునీ వాది మూలమని
వుక్కున గర్వించి యుబ్బుదు సగ్గుదు
కక్కసమైనది కడగనరాదు
చూతును నీమూర్తి సులభుడ వనుచును
చూతు జగములకు సోద్యమని

యీతల శ్రీ వేంకటేశ నన్నేలితివి
కౌతుక మొదవెను కడగనరాదు

## 224. అతడే రక్షకుడు

అతడే రక్షకుడు అందరి కతడే యే
పతియుండగ భయపడ చోటేది
అనంతకరములు అనంతాయుధములు
అనంతుడు ధరించె అలరగును
కనుగొని శరణాగతులకు మనకును
పనిపడియిక భయపడ చోటేది
ధరణి అభయ హస్తముతో నెప్పుడు
హరి రక్షకుడై అలరగను
నరహరి కరుణే నమ్మినవారికి
పరదున నిక భయపడ చోటేది
శ్రీ వేంకటమున జీవుల గాచుచు
అవలనీవల నలరగను
దైవశిఖామణి దాపగుమాకును
భావింపగ భయపడ చోటేది

## 225. అనిశముదలచరో

అనిశము దలచరో అహోబలం
అనంత ఫలదం అహోబలం ॥
హరి నిజనిలయం అహోబలం
హర విరించినుత మహోబలం
అరుణమణిశిఖర మహోబలం
అరి దైత్యహరణ మహోబలం ॥
అతిశయ శుభదం అహోబలం
అతులమనోహర మహోబలం





హత దురితచయం అహోబలం
యతిమత సిద్ధం అహోబలం ॥
అగు శ్రీ వేంకట మహోబలం
అగమ్యమసురుల కహోబలం
అగపడు పుణ్యుల కహోబలం
అగకులరాజం అహోబలం ॥

## 226. అన్నివిభవముల

అన్నివిభవముల అతడితడు
కన్నులు వేవేలు గల ఘనుడితడు ॥
వేదాంత కోట్ల విభుడితడు
నాదబ్రహ్మపు నడుమితడు
ఆది నంత్యములకు అరుదితడు
శ్రీ దేవుడు సరసిజ నాభుడితడు ॥
భవములణచు యదుపతి ఇతడు
భువనములిన్నిటికి పొడవితడు
దివికి దివమైన తిరమితడు
పవనసుతు నేలిన పతి ఇతడు ॥
గరుడని మీదటి ఘనుడితడు
సిరులిందరికి నిచ్చే చెలువితడు
తిరువేంకటనగము దేవుడితడు
పరమపదమునకు ప్రభువితడు ॥

## 227. అనుచు లోకము లెల్ల

అనుచు లోకము లెల్ల నదె జయవెట్టేరు
నిను గొల్చితి గావవే నీరజాక్షుడా ॥

అదివో కోనేటిలోన నదివో సర్వతీర్థములు
అదివో పైడిమేడల హరినగరు
పొదలి పరుషా లెల్లా పొదిగి సేవించేరు
యిదివో వరము లిచ్చే ఇందిరానాథుడు ॥

అదివో వేదఘోషము అదివో సురలమూక
అదివో విశ్వరూపము అద్భుత మందె
గుది గొనె బుణ్యములు కోట్లసంఖ్యలు చేరె
యిదివో దయ దలచె ఈశ్వరేశ్వరుడు ॥

అదివో శ్రీ వెంకటేశు దక్కున నలమేల్మంగ
అదివో నిత్యశూరులు ఆళ్వారులు
నిదుల శేషాచలము నిక్కి పైబొడచూపె
యిదివో కొలువున్నాడు హృదయాంతరాత్ముడు ॥

## 228. అపరాధిని నేనైనాను

అపరాధిని నేనైనాను
కృపగలవారికి కపటము లేదు ॥

సనాతనా అచ్చుతా సర్వేశ్వరా
అనాదికారణ అనంతా
జనార్దనా అచల సకలలోకేశ్వరా
నిను మరచియున్నాడ నను తెలుపవయా ॥

పురాణపురుషా పురుషోత్తమా
చరాచరాత్మక జగదీశా
పరాత్పరా హరి బ్రహ్మాండనాయకా
యిరవు నీవేయట యెరిగించగదే ॥

దేవోత్తమా శశిదినకరనయనా
పావనచరితా పరమాత్మా





శ్రీవేంకటేశా జీవాంతరంగా
సేవకుడను బుద్ధిచెప్పగవలయు ॥

## 229. అప్పులవారే

అప్పులవారే అందరును
కప్పగ దిప్పగ కర్తలు వేరీ

ఎక్కడ చూచిన నీ ప్రపంచమున
చిక్కులు సిలుగులు చింతలునే
దిక్కెవ్వరు యీ తీ దీపులలో
దిక్కుముక్కులకు దేవుడెకాక

యేది తలంచిన నేకాలంబును
సూదులమాటల సుఖములివి
కాదన నౌ నన కడ కనిపించగ
పోదికాడు తలపున గల దొకడే

యెన్నడు వీడే నెప్పుడు వాసీ
పన్నిన తమ తమ బంధములు
వున్నతి సేయగ వొప్పులు నెరపగ
వెన్నుడు వేంకట విభుడే కలడు

## 230. అమరాంగన

అమరాంగన లదె యాడేరు
ప్రమదంబున నదె పాడేరు ॥

గరుడవాహనుఁడు కనకరథముపై
యిరువుగ వీధుల నేఁగీని
సురలును మునులును సొంపుగ మోఁకులు
తెరలిచి తెరలిచి తీసేరు ॥

ఇలధరుఁడదివో ఇంద్రరథముపై
కెలయుచు దిక్కులు గెలిచీని
బలు శేషాదులు బ్రహ్మశివాదులు
చెలఁగి సేవలటు సేసేరు ॥

అలమేల్మంగతొ నటు శ్రీవెంకట
నిలయుఁడరదమున నెగడీని
నలుగడ ముక్తులు నారదాదులును
పొలుపు మిగులఁగడుఁ బొగడేరు ॥

## 231. అమరెగదె నేడు

అమరెగదె నేడు అన్ని సొబగులును
సమరతి చిన్నలు సతి నీ మేన ॥

చెలపల చెమటలు చెక్కిళ్ళ
మొలకల నవ్వులు మొక్కిళ్ళ
సొలపుల వేడుక చొక్కిళ్ళ
తొలగని యాసలు తొక్కిళ్ళ ॥

నెరవగు చూపులు నిక్కిళ్ళ
మెఱసెను తమకము మిక్కిళ్ళ
గుఱుతగు నధరము గుక్కిళ్ళ
తఱచగు వలపులు దక్కిళ్ళ ॥

నునుగోరికొనలు నొక్కిళ్ళ
పొనుగని తములము పుక్కిళ్ళ
ఘనుడగు శ్రీ వేంకటపతి కౌగిట
ఎనసెను పంతము లెక్కిళ్ళ ॥

## 232. అమ్మమ్మ ఏమమ్మ

అమ్మమ్మ ఏమమ్మ అలమేల్మంగ నాంచారమ్మ
తమ్మి యింట నలరు కొమ్మ యమ్మ ॥





నీరిలోన తల్లడించీ నీకే తలవంచీ
నీరికింద పులకించీ నీ రమణుడు
గోరికొన చెమరించీ కోపమే పచరించీ
సారెకు నీ అలుక ఇట్టే చాలించవమ్మా ॥

నీకు గానే చెయ్యి చాచీ నిండాకోపమురేచీ
మేకొని నీ విరహాన మేను వెంచేని
ఈకడాకడి సతుల హృదయమే పెరరేచీ
ఆకు మడిచియ్యనైన ఆనతియ్యవమ్మ

చక్కదనములె పెంచీ సకలము కాదలంచి
నిక్కపు వేంకటేశుడు నీకే పొంచీని
మక్కువతో అలమేల్మంగనాంచారమ్మ
అక్కున నాతని నిట్టె అలరించవమ్మ ॥

## 233. అయ్యో పోయఁ

అయ్యో పోయఁబ్రాయముకాలము
ముయ్యంచుమన సుననే మోహమతినైతి

చుట్టంబులాతనకు సుతులుకాంతులుచెలులు
వట్టియాసలు వెట్టు వారేకాక
నెట్టుకొని వీరు కదునిజమనుచు హరినాత్మ
బెట్టనేరక వృథా పిరి వీకులైతి

తగుబంధులా తనకు తల్లులును తండ్రులును
వగల వెట్టుచు తిరుగు వారేకాక
మిగుల వీరల పొందు మేలనుచు హరినాత్మ
తగిలించలేక చింతాపరుడనైతి

అంతహితులా తనకు అన్నలును తమ్ములును
వంతువాసికి (బె)నగువారే కాక

అంతరాత్ముడు శ్రీవేంకటాద్రీశు కొలువకిటు
సంతకూటముల అలజడికి లోనైతి

## 234. అరసినన్ను గాచిన

అరసి నన్ను గాచినాతనికి శరణు
పరము నిహము నేలే పతికిని శరణు ॥
వేదములు దెచ్చినట్టి విభునికి శరణు
ఆదిమూలమంటే వచ్చినతనికి శరణు
యేదెసా తానైయున్న యీతనికి శరణు
శ్రీదేవి మగడైన శ్రీపతికి శరణు ॥
అందరికి ప్రాణమైన ఆతనికి శరణు
ముందు మూడు మూర్తుల మూర్తికి శరణు
దిందుపడి దేవతల దేవునికి శరణు
అంది మిన్ను నేలనేకమైనతనికి శరణు ॥
తానే చైతన్యమైన దైవానకు శరణు
నానాబ్రహ్మాండాల నాథునికి శరణు
ఆనుక శ్రీ వేంకటాద్రి యందునుండి వరములు
దీనుల కిందరి కిచ్చే దేవునికి శరణు ॥

## 235. అలివేణిని

అలివేణిని పెండ్లాడవయా
చెలుల విన్నపము చేకొనవయ్యా ॥
సొలపుల తొలితొలి చూచిన చూపులు
కొలదిమీర నుంకువలాయా
చెలగిచేతులను సేసిన సన్నలు
తలపగ నలుగడ తలబాలాయ ॥
ననుపున సెలవుల నవ్విన నవ్వులు
గొనకొనగ పాలకూళ్ళాయ





అనువుగ ప్రియమున ఆడిన మాటలు
మనసిజ తంత్రపు మంత్రములాయ ॥
వేడుక కాగిటి వినయపు సేతలు
కూడిన కూటపు కురులాయా
ఈడనే శ్రీ వేంకటేశ ఏలితివి
తోడలమేల్మంగ దోమట్లాయ ॥

## 236. అహోబలేశ్వరుడు

అహోబలేశ్వరుడు అరికులదమనుడు
మహా మహిమలను మలసీ వాడె ॥
కదలు కన్నులును కరాళవదనము
గుదిగొను భయదపు కోరలును
అదరు మీసములు అలరగ నవ్వుచు
వుదుటుతోడ కొలువున్నాడు వాడే ॥
అతిసిత నఖములు అనంత భుజములు
వితత పరాక్రమ వేషమును
అతుల దీర్ఘజిహ్వాయు కడుమెరయగ
మితిలేని కరుణ మెరసీ వాడే ॥
సందడి సొమ్ములు శంఖు చక్రములు
పొందుగ దివిజులు పొగడగను
ఇందిర తొడపై నిడి శ్రీ వేంకట –
మందు నిందు కడు నలరీ వాడే ॥

## 237. అందరి బతుకులు

అందరి బతుకులు ఆతనివే
కందువెల్ల శ్రీకాంతునిదే

వేమరు చదివెడి విప్రుల వేదము
సోముక వైరియశో విభవం
శ్రీమించునమరల జీవనమెల్ల సు
ధామథనుని సంతతకరుణే
హితవగు నిలలో నీసుఖమెల్లను
దితిసుత దమనుడు తెచ్చినదే
తతితల్లి తండ్రి తానైకాచిన
రతి ప్రహ్లాద వరదునికృపే
తలకొని ధర్మముతానై నిలుపుట
కలుష విదూరుని గర్వములే
నిలిచిలోకములు నిలిపిన ఘనుడగు
కలియుగమున వేంకట పతియే

## 238. ఆడరమ్మ పాడరమ్మ

ఆడరమ్మ పాడరమ్మ అందరు మీరు
వేడుక సంతసములు వెల్లవిరియాయను ॥
కమలనాభుడు పుట్టె కంసుని మదమణచ
తిమిరి దేవకీదేవి దేహమందును
అమరులకు మునుల కభయమిచ్చె నితడు
కొమరె గొల్లెతలపై కోరికలు నిలిపె ॥
రేయిపగలుగ చేసి రేపల్లె పెరుగజొచ్చె
ఆయెడ నావుల గాచె నాదిమూలము
యీ యెడ లోకాలు చూపె నిట్టే తనకడుపులో
మాయసేసి యిందరిలో మనుజుడైనిలిచె ॥
బాలలీలలు నటించి బహుదైవికము మించె
పాలువెన్నలు దొంగిలె పరమమూర్తి





తాలి భూభారమణచె ధర్మము పరిపాలించె
మేలిమి శ్రీ వేంకటాద్రి మీద నిట్టె నిలిచె ॥

## 239. ఆదిమ పూరుషుడు

ఆదిమ పూరుషుడచ్యుతు డచలు డనంతుడ మలుడు
ఆది దేవుడీతడెపో హరి వేంకట విభుడు
యేకార్ణవమై వుదకములేచిన బ్రహ్మాండములో
బైకొని యుండగ నొక వటపత్రములోపలను
చేకొని పవళింపుచునొక శిశువై వడి తేలాడిన
శ్రీకాంతుడీతడే పో శ్రీ వేంకటవిభుడు
అరుదుగ బలి మదమడపగ నాకసమంటిన రూపము
సరగున భూమింతయు నొక చరణంబున గొలిచి
పరగిన పాదాంగుటమున బ్రహ్మాండము నగిలించిన
పరమాత్ముడీతడే పో పతి శ్రీ వేంకటవిభుడు
క్షీరపయోనిధిలోపల శేషుడు పర్యంకముగ
ధారుణియును సిరియును పాదములొత్తగను
చేరువ తను బ్రహ్మాదులు సేవింపగ చెలువొందెడి
నారాయణుడీతడే వున్నత వేంకటవిభుడు

## 240. ఆలించు పాలించు

ఆలించు పాలించు ఆదిమ పురుషా
జాలిదీర నీకే శరణుజొచ్చితిమి ॥
గతినీవె మతినీవె కర్తవుభర్తవు నీవె
పతివినీవె ఏ పట్టున మాకు
ఇతరము లెవ్వరున్నారెంచిచూడ నిన్నుబోల
చతురుడ నిన్ననే శరణు చొచ్చితిమి ॥
జననీ జనకులు శరణము నీవె
వునికి మనికి నీవె వుపమ నీవె

మనసిచ్చి నీవె నన్ను మన్నించుకొంటేనె
చనవి మనవి నీకే శరణుచొచ్చితిమి ॥
లోక సాక్షివి నీవె లోకబంధుడవు నీవె
ఈకడ శ్రీవేంకటేశ యిదివో నీవె
నీ కంటె మరిలేరు నిఖిలమంతయు గావ
సాకారరూప నీకే శరణు చొచ్చితిమి ॥

## 241. ఆహో! నమోనమో

ఆహో! నమోనమో ఆదిపురుష నీకు
ఈహల నేనెంతవాడ ఎట్లు గాచితిని ॥
లోకా లోకములు లోననించుకొన్న నీవు
యీకడ నా ఆత్మలోన నెట్లణగితివీ
ఆకడ వేదములకు అగోచరమైన నీవు
వాకుచే నీనామములు వడినెట్లణగితివీ ॥
అన్నిటా బ్రహ్మాదుల యజ్ఞభోక్తవైననీవు
అన్నపానాదులివి ఎట్లారగించితివి
సన్నుతి పూర్ణుడవై జయించిన నీవు
వున్నతి నాపుట్టుగులో ఒకచోనెట్లుంటివి ॥
దేవతలచే పూజలు తివిరి కొనిన నీవు
యీవల నాచేపూజ నెట్లుగొంటివి
శ్రీవేంకటాద్రి మీద సిరితో కూడిన నీవు
యీవిధి నాయింట నిపుడెట్లు నిలిపితివి ॥

## 242. ఇటునిను తెలియగ

ఇటు నిను తెలియగ ఎంతటివారము
తటుకన నాసల తగులుటగాక ॥





నానామూర్తులు నగధర నీరూపు
యే నెలవుల నిన్నెటువలె దలచుట
పూని నీ భావము పొందుగా జెప్పగా
వీనులు చల్లగా వినుటే కాక ॥
పెక్కు నామములు బిరుదు లనంతము -
లెక్కడ కొలదిగ ఎన్నని పొగడుట
యిక్కువ సేసుక యిందులో నొకటి
పక్కన నొకమరి పలుకుట గాక ॥
వేవేలుగలవు నీ విహారభూములు
యేవిధమున ఎందెందని తిరుగుట
శ్రీ వేంకటేశా నీ శృంగారమెల్లను
సేవించి ముదమున చెలగుటగాక ॥

## 243. ఇతనికంటె ఘనులికలేరు

ఇతనికంటె ఘనులిక లేరు
యితర దేవతల యిందరిలోన ॥
భూపతి ఈతడె పొదిగి కొలువరో
శ్రీపతి ఈతడే చేకొనరో
యేపున బలువుడు నీతడే చేరరో
పైపై వేంకటపతి యైనాడు ॥
మరుగురుడితడే మతి నమ్మగదరో
పరమాత్ముడితడే భావించరో
కరివరదుడితడే గతియని తలచరో
పరగ శ్రీ వేంకటపతియైనాడు ॥
తల్లియు నితడే తండ్రియు నితడే
వెల్లవిరై యిక విడువకురో

చల్లగా నితని శరణని బ్రతుకరో
అల్ల శ్రీ వేంకటహరి అయినాడు ॥

## 244. ఇతని కంటె మరి

ఇతని కంటే మరిదైవము కానము యెక్కడ వెదకిన నితడే
అతిశయమగు మహిమలతో వెలసెను అన్నిటికాధారముతానె ॥
మదిజలధులనొకదైవము వెదకిన మత్స్యావతారంబితడు
అదివోపాతాళమందు వెదకితే ఆదికూర్మ మీ విష్ణుడు
పొదిగొని యడవుల వెదకి చూచితే భూవరాహమనికంటిమి
చెదరక కొండల గుహలవెదకితే శ్రీనరసింహంబున్నాడు ॥
తెలిసి భూనభోంతరమున వెదకిన త్రివిక్రమాకృతి నిలిచినది
పలువీరులలో వెదకిచూచితే పరశురాముడొకడైనాడు
తలపున శివుడను పార్వతి వెదకిన తారకబ్రహ్మమురాఘవుడు
కెలకుల నావులమందల వెదకిన కృష్ణుడు రాముడు నైనారు
పొంచి అసురకాంతలలో వెదకిన బుద్ధావతారంబైనాడు
మించిన కాలము కడపట వెదకిన మీదటి కల్క్యావతారము
అంచెల జీవులలోపల వెదకిన అంతర్యామై మెరసెను
యెంచుక ఇహమున పరమున వెదకిన యీతడే శ్రీవేంకటవిభుడు

## 245. ఇతరులకు నిను నెఱగతరమా

ఇతరులకు నిను నెఱగతరమా
సతత సత్యవ్రతులు సంపూర్ణమోహవిర –
హితులెఱుగుదురు నిను నిందిరారమణా ॥
నారీకటాక్షపటు నారాచభయరహిత –
శూరులెఱుగుదురు నిను చూచేటిచూపు
ఘోరసంసార సంకులపరిచ్ఛేదులగు –
ధీరులెఱుగుదురు నీదివ్యవిగ్రహము ॥





రాగభోగవిదూర రంజితాత్ములు మహా –
భాగులెరుగుదురు నిను ప్రణుతించువిధము
ఆగమోక్త ప్రకారాభిగమ్యులు మహా –
యోగులెఱుగుదురు నీవుండేటివునికి ॥
పరమభాగవత పదపద్మసేవానిజా –
భరణులెఱుగదురు నీ పలికేటిపలుకు
పరగునిత్యానంద పరిపూర్ణ మానస –
స్థిరు లెఱుగుదురు నిను తిరువేంకటేశ ॥

## 246. ఇదియెనాకు మతము

(పెద తిరుమలాచార్యుల రచన)

ఇదియె నాకు మతము ఇది వ్రతము
వుదుటుల కర్మము వొల్లనింకను ॥
నిపుణత హరి నే నిను శరణనుటే
తపములు జపములు ధర్మములు
నెపమున సకలము నీవే చేకొను
పుపముల పుణ్యము లొల్లనే యింకను ॥
హరి నీ దాసుడ ననుకొనుటే నా
పరమును ఇహమును భాగ్యమును
ధర నీ మాయల తప్పుతెరువులను
వొరగీ సుకృతము లొల్ల నే యింకను ॥
నారాయణ నీ నామము దలచుట
సారపు చదువులు శాస్త్రములు
ఈరీతి శ్రీ వేంకటేశ నిన్ను గొలిచితి
వూరక ఇతరము లొల్ల నే యింకను ॥

## 247. ఇదియే సులభము

ఇదియే సులభము యిందరికి
కదియగ వసమా కరుణనే కాక
నగధరుండు పన్నగశయనుడు భూ
గగనాంతరిక్ష గాత్రుడు
అగణితుడితని అరసితెలియగా
తగునాకనెడిది దాస్యమే కాక
కమలజ జనకుడు కాముని జనకుడు
కమలాసతిపతి ఘన గుణుడు
విములుడీ హరి వెదకి కాన గను
అమరునా శరణాగతి కాక
దేవుడు త్రిగుణాతీతుడనంతుడు
కైవల్యమొసగు ఘనుడు
శ్రీ వేంకటపతి జీవాంతరాత్ముడు
భావించ వసమా భక్తినే కాక

## 248. ఇదివో వున్నారము

ఇదివో వున్నారము ఇంతట నంతట
వెదకి కదియకుమీ విష్ణునిమాయ ॥
హరిదాసులము హరికింకరులము
కరివరదుని డింగరులము
ఇర వెరిగితి ననక ఎరగ ననక
సరి మా గురుతిది సర్వేశుమాయ ॥
హితులము శరణాగతులము కేశవ
వ్రతులము వైష్ణవ మతులము
గతి నిను బాసితి కదు నిక మామీద
తతి దయమరవకు దైవము మాయ ॥





శ్రీ వైష్ణవులము శ్రీ వేంకటపతి
భావింప నితని పరికరములము
ఈవల నావల ఇహపరములకును
తోవ దొలగుమీ తొలితొలి మాయ ॥

## 249. ఇదె శిరసు మాణిక్య

ఇదె శిరసు మాణిక్యమిచ్చి పంపె నీకు నాకె
అదనెఱిగి తెచ్చితి నవధరించవయ్యా ॥
రామ నిను బాసి నీరామ నే చూడగ నా –
రామమున నిను పాడె రామరామ యనుచు
ఆ మెలుత సీతయని యపుడునే తెలిసి
నీ ముద్ర వుంగరము నే నిచ్చితిని ॥
కమలాప్తకులుడ నీకమలాక్షి నీ పాద
కమలములు తలపోసి కమలారి దూరె
నెమకి యాలేమను నీదేవి యని తెలిసి
అమరంగ నీసేమమటు విన్నవించితిని ॥
దశరథాత్మజ నీవు దశశిరుని చంపి, యా –
దశనున్న చెలిగావు దశదిశలు పొగడ
రసికుడ శ్రీ వేంకట రఘువీరుడా నీవు
శశిముఖి చేకొంటివి చక్కనాయ పనులు ॥

## 250. ఇన్నియు చదువనేల

ఇన్నియు చదువనేల యింతా వెదకనేల
కన్నుదెరచు టొకటి కనుమూయుటొకటి ॥
వలెననే దొకమాట వలదనే దొకమాట
సిలుగు లీరెంటికిని చిత్తమేగురి
వలెనంటే బంధము వలదంటే మోక్షము
తెలిసే విజ్ఞానులకు తెరువిది ఒకటే ॥

పుట్టెడి దొకటే పోయెడి దొకటే
తిట్టమై రెంటికిని దేహమే గురి
పుట్టుట సంశయము పోవుట నిశ్చయము
వొట్టిన విజ్ఞానులకు నుపమిది యొకటే ॥
పరమమనే దొక్కటే ప్రపంచమొక్కటే
సిరుల నీ రెంటికిని జీవుడే గురి
యిరవై శ్రీ వేంకటేశు డిహపరములకర్త
శరణాగతులకెల్ల సతమీతడొకడే ॥

## 251. ఇరువగు వారికి

ఇరువగు వారికి యిహ పర మిదియే
హరి సేవే సర్వాత్మలకు
దురిత మోచనము దుఃఖ పరిహరము
హరినామమే పో ఆత్మలకు
పరమ పదంబును భవనిరు హరణము
పరమాత్ము చింతే ప్రపన్నులకు
సారము ధనములు సంతోష కరములు
శౌరి కథలు సంసారులకు
కోరిన కోర్కెయు కొంగు బంగరువు
పారె విష్ణుదాస్యము లోకులకు
యిచ్చయగు సుఖము యిరవగు పట్టము
అచ్చుతుకృప మోక్షార్థులకు
అచ్చపు శ్రీ వేంకటాధిపు శరణము
రచ్చల మాపాలి రాజ్యపు సుగతి

## 252. ఇహపరసాధనమిది

ఇహపరసాధన మిది యొకటే
సహజపు మురారి సంకీర్తనొకటే ॥





భవసాగరముల బాపెడిది తేప
భూవి నజ్ఞానము పులివాకట్టిది
జవళి నాశాపాశములకు కొడువలి
నవనీతచోరు నామం బొకటే ॥
చింతా తిమిరము చెరిచెడి సూర్యుడు
అంతట దరిద్రహతపు నిధానము
వింత మరణభయ వినాశ మంత్రము
మంతుకు హరినామంబిది యొకటే ॥
మించు దుఃఖముల మృతసంజీవని
అంచల పంచేంద్రియముల కంకుశము
ఎంచగ శ్రీ వేంకటేశు దాసులకు
పంచిన పాళ్ళ పరగిన దొకటే ॥

## 253. ఇంతకంటే ఘనమికలేదు

ఇంతకంటే ఘనమిక లేదు
సంతత సౌఖ్యము జనార్దనుడే ॥
భయనివారణము పరమాత్ముని నుతి
జయకారణము ఈశ్వరచింత
అయుత పుణ్యఫలమచ్యుతుని సేవ
క్రియతో నిజమెరిగిన వారికిని ॥
కర్మహరము శ్రీకాంతుదరిశనము
ధర్మరాసి మాధవుశరణు
అర్మిలి సంపద లనంతుని తగులు
నిర్మలముగ పూనిన దాసులకు ॥
ఆగమోక్త మీ హరికైంకర్యము
భోగము విష్ణుని పూజయిది

యోగము శ్రీ వేంకటోత్తముని కొలువు
బాగులు నేర్చిన ప్రపన్నులకును ॥

## 254. ఇందిర నామము

ఇందిర నామము ఇందరికీ
కుందనపు ముద్దవో గోవిందా ॥
అచ్చుత నామము అనంత నామము
ఇచ్చిన సంపద లిందరికీ
నచ్చిన సిరులు నాలుకతుదలు
కొచ్చి కొచ్చీ వో గోవిందా ॥
వైకుంఠనామము వరదనామము
ఈకడ నాకడ నిందరికీ
వాకుఁదెరపులు వన్నెలు లోకాలఁ
గూకులు వత్తులు వో గోవిందా ॥
పందరి నామము పరమ నామము
ఎండలు వాపెడి దిందరికీ
నిండు నిధానమై నిలిచిన పేరు
కొండల కోనేటి వో గోవింద ॥

## 255. ఈతడే ఈతడే

ఈతడే ఈతడే సుండియెంత మొంచి చూచిన
చేతనే వరాలిచ్చే శేషాచలేశుడు
విశ్వరూప బ్రహ్మము విరాట్టయిన బ్రహ్మము
ఐశ్వర్య స్వరాట్టా సామ్రాట్టయిన బ్రహ్మము
శాశ్వత బ్రహ్మాండాలు శరీరమైన బ్రహ్మము
యీశ్వరుడై మహారాట్టై యిందరిలో బ్రహ్మము
సూర్యునిలో తేజము సోమునిలో తేజము
శౌర్యపుటనలుని భాస్వత్తేజము





కార్యపుటవతారాల కనుగొనే తేజము
వీర్యపుటెజ్ఞ భాగాల విష్ణునామ తేజము
భాగవతపు దైవము భారతములో దైవము
సాగిన పురాణ వేదశాస్త్రదైవము
పోగులైన బ్రహ్మలను బొడ్డున గన్న దైవము
శ్రీ గతి భూపతైన శ్రీవేంకట దైవము

## 256. ఈ రూపమై వున్నాడు

ఈ రూపమై వున్నాడు యీతడే పరబ్రహ్మము
శ్రీ రమాదేవితోడ శ్రీ వేంకటేశుడు
పొదలి మాయాదేవి పట్టిన సముద్రము
అదె పంచ భూతాలుండే అశ్వత్థము
గుదిగొన్న బ్రహ్మాండాల గుడ్లబెట్టే హంస
పదరపు బ్రహ్మలకు జలజ మూలకందము
అనంత వేదాలుండేటి అక్షయ వటపత్రము
ఘన దేవతలకు శ్రీకర యజ్ఞము
కనలు దానవ మత్తగజ సంహార సింహము
మొనసి సంసార భారము దాల్చే వృషభము
సతతము జీవులకు చైతన్య సూత్రము
అతిశయ భక్తుల జ్ఞానామృతము
వ్రతమై శ్రీ వేంకటాద్రి వరముల చింతామణి
తతిగొన్న మోక్షపు తత్వపు రహస్యము

## 257. ఉదయాద్రి తెలుపాయె

ఉదయాద్రి తెలుపాయె ఉడురాజు కొలువిడె
అదనెరిగి రాడాయెనమ్మ నా విభుడు ॥

చన్నులపై ముత్యాల సరులెల్ల చల్లనాయె
కన్నులకు కప్పొదవె కాంతా నా కిపుడు
కన్నె కలువల జాతి కనుమోడ్చినది మీద
వెన్నెల వేసంగిమొగ్గ వికసించె గదవె ॥
పువ్వుల లోపలి కురులు బుగులుకొనగా నెరసి
దవ్వుల తుమ్మెద గములు తరిమి డాయగను
రవ్వసేయ శుక పికము రాయడి కోర్వగరాదు
అవ్వల నెవ్వతె పసలకు అలరున్న వాడో ॥
పన్నీట జలకమార్చి పచ్చకప్పురము మెత్తి
చెన్నుగ కొప్పున విరుల చెలువందురిమి
ఎన్నగల తిరువేంకటేశుఁడిదె నను గూడె
కన్నులు మనసును తనియ కరుణించె గదవె ॥

## 258. ఎదుట ఎవ్వరు లేరు

ఎదుట ఎవ్వరు లేరు ఇంతా విష్ణుమయమె
వదలక హరిదాస వర్గమైన వారికి ॥
ముంచిన నారాయణమూర్తులే జగమెల్ల
అంచిత నామములే ఈ అక్షరాలెల్ల
పంచుకొన్న శ్రీహరి ప్రసాద మీ రుచులెల్ల
తెంచివేసి మేలు తా తెలిసేటి వారికి ॥
చేరి పారేటి నదులు శ్రీపాద తీర్థమే
భారపు ఈ భూమి ఇతని పాదరేణువే
పారపు కర్మంబులు కేశవు కైంకర్యంబులె
ధీరులై వివేకించి తెలిసేటి వారికి ॥
చిత్తములో భావమెల్ల శ్రీ వేంకటేశుడే
హత్తిన ప్రకృతి ఎల్లా ఆతని మాయే





మత్తిలి ఈతని కంటె మరి లేవు ఇతరములు
తిత్తి దేహపు బ్రతుకు తెలిసేటి వారికి ॥

## 259. ఎన్ని మహిమల వాడే

ఎన్ని మహిమల వాడే యీ దేవుడు
కన్నుల పండవులెల్లా కదిసిన ట్టుండెను
పోలింప కప్పుర కాపు పురుషోత్తమునికి
యేలీల నుండెనని యెంచి చూచితే
పాల జలనిధిలోన పవళింపగా మేన
మేలిమి మీగడంటిన మెలుపుతో నుండెను
తట్టుపునుగు కాపు దైవ శిఖామణికి
యెట్టుండెనని మరి యెంచి చూచితే
చిట్టకాన రేపల్లెలో చీకటి తప్పుపేయగా
అట్టె రాత్రులు మేన అంటినట్టుండెను
అలమేలు మంగతోడ నట్టె సొమ్ము ధరించగ
యెలమి శ్రీ వేంకటేశు నెంచి చూచితే
కలిమిగల యీకాంత కాగిట బెనగగాను
నిలువెల్లా సిరులై నిండినట్టుండెను

## 260. ఎఱిగితి

ఎఱిగితి నమ్మితి ఇతడు దయానిధి
మఱగులు మొరగులు మరియిక లేవు
వేదోద్ధరణుడు విశ్వరక్షకుడు
ఆదిమూర్తి శ్రీ అచ్యుతుడు
సోదించి కొలిచితి సుముఖుడై మమ్మేలె
యీదస మాపాల యితడే కలడు

పరమ పురుషుడాపన్నివారకుడు
హరి శాంతుడు నారాయణుడు
శరణంటి మీతని చేకొనికాచెను
తరవాతి పనుల తప్పుడితడు
హృదయాంత రంగుడు యీశ్వరేశ్వరుడు
ఇదివో శ్రీ వేంకటేశ్వరుడు
వెదకితి మీతడు విడువడు మమ్మిక
తుదకును మొదలికి దొరికినవాడు

## 261. ఎండగాని నీడగాని

ఎండగాని నీడగాని యేమైనాగాని
కొండలరాయడే మా కులదైవము
తేలుగాని పాముగాని దేవ పట్టయినగాని
గాలిగాని ధూళిగాని కాని యేమైనా
కాలకూట విషమైన గ్రక్కున మ్రింగిననాటి
నీలవర్ణుడే మా నిజదైవము
చీమగాని దోమగాని చెలది యేమైనగాని
గాముగాని నాముగాని కాని యేమైనా
పాముల నిన్నిటి మ్రింగే బలుతేజిపై నెక్కు
ధూమకేతువే మా దొరదైవము
పిల్లిగాని నల్లిగాని పిన్న యెలుకైనగాని
కల్లగాని పొల్లగాని కాని యేమైనా
బల్లిదుడై వెంకటాద్రి పైనున్న యాతడె మ –
మ్మెల్లకాలమును నేలే యింటి దైవము

## 262. ఎంత విభవము కలిగె

ఎంత విభవము కలిగె నంతయును నా పదని
చింతించినది గదా చెడని జీవనము ॥





చలము కోపంబు తను చంపేటి పగతులని
తెలిసినది యది గదా తెలివి
తలకొన్న పరనింద తనపాలి మృత్యువని
తొలగినది యది గదా తుదగన్న ఫలము ॥
మెఱయు విషయములే తన మెడ నున్న వురులుగా
యెఱిగినది యది గదా యెరుక
పఱివోనియాస తను బట్టుకొను భూతమని
వెఱచినది యది గదా విజ్ఞానమహిమ ॥
యెనలేని తిరువేంకటేశుడే దైవమని
వినగలిగినది గదా వినికి
అనయంబు నతని సేవానందపరులయి
మనగలిగినది గదా మనుజులకు మనికి ॥

## 263. ఏడకేడ నీ చరితము

ఏడకేడ నీ చరితము యేమని పొగడవచ్చు
యీడులేని మహిమల ఇనవంశరామా
పరమాన్నములో బుట్టి పక్కన తాటకి చంపి
సరు విశ్వామిత్రు యాగము గాచి
హరువిల్లు విరిచి యట్టె సీతపెండ్లాడి
పరశురాముని చేత బలము చేకొంటివి
వైపుగా సుగ్రీవు నేలి వాలి నొక్క కోలవేసి
యేపున జలధి గట్టి యెసగితివి
దీపించు రావణు జంపి దివుజులను మన్నించి
యేపుగా విభీషణు రాజ్య మేలించితివి
సీతతో పుష్పకమెక్కి జిగినయోధ్యకు వచ్చి
గాతల రాజ్య పట్టము గట్టుకొంటివి

యీతల శ్రీ వేంకటాద్రి నిటు విజ (య) నగరాన
నీతితో నెలకొని నెగడితిని

### 264. ఏడ వలపేడ

ఏడ వలపేడ మచ్చి కేడ సుద్దులు
ఆడుకొన్నమాటలెల్ల నవి నిజాలా ॥
తొలుకారు మెఱుపులు తోచి పోవుగాక
నెలకొని మింట నవి నిలిచీనా
పొలతులవలపులు పొలసిపోవుగాక
కలకాలంబవి కడతేరీనా ॥
యెండమావులు చూడ నేరులై పారుగాక
అండకుపోవ దాహమణగీనా
నిండినట్టి మోహము నెలతలమది చూడ
వుండినట్టే వుండుగాక వూతయ్యీనా ॥
కలలోని సిరులెల్ల కనుకూర్కులేకాక
మెలకువ చూడ నవి మెరసీనా
అలివేణుల మేలు ఆసపాటేకాక
తలపు వేంకటపతి తగిలీనా ॥

### 265. ఏదితుద దీనికేది

ఏదితుద దీని కేదిమొదలు
పాదుకొను హరిమాయ పరగు జీవునికి ॥
ఎన్నిబాధలు తనకు నెన్నిలంపటములు
యెన్ని వేదనలు మరి యెన్ని దుఃఖములు
యెన్ని పరితాపంబు లెన్ని తలపోతలు
యెన్ని చూచిన మరియు నెన్నైన కలవు ॥
యెన్ని కొలువులు తనకు నెన్ని యనుచరణలు
యెన్ని యాసలు మరియు నెన్ని మోహములు
యెన్ని గర్వములు తనకెన్నిదైన్యంబు లివి
ఇన్నియును తలప మరి యెన్నైన గలవు ॥
యెన్నిటికి చింతించు నెన్నిటికి హర్షించు
నెన్నిటికి నాసించు నెన్నిటికి దిరుగు
యిన్నియును తిరువేంకటేశు లీలలు కాగ
ఎన్ని చూచినను తానెవ్వడును కాడు ॥

### 266. ఏమి చెప్పేది

ఏమి చెప్పేది యీశ్వర మాయలు
దీము ప్రతిమకును త్రిజగము కలిగే
మల మూత్రంబుల మాంసపు ముద్దకు
కులగోత్రంబుల గురి కలిగే
తొలులు తొమ్మిదగు తోలు తిత్తికిని
పిలువగ పేరును పెంపును కలిగే
నెత్తురు నెమ్ముల నీరు బుగ్గకును
హత్తిన కర్మములటు కలిగే
కొత్త వెంట్రుకల గుబురుల గంతికి
పొత్తల సంసార బోగము కలిగే
నానా ముఖముల నరముల పిడుచకు
పూని సిగ్గులు భువి కలిగే
ఆనుక శ్రీ వేంకటాధిపు డేలగ
దీనికి ప్రాణము తిరముగ కలిగే

### 267. ఓహో నిలిచిన దొకటిదియే

ఓహో నిలిచిన దొకటిదియే
శ్రీహరి సాకార చింతనము ॥

పంచమ వేదపు పద్మాక్షు నామము
అంచెపాపహర మౌషధము
పంచల పీతాంబరు శరణాగతి
ముంచిన అజ్ఞానమునకు దీపము ॥
విందుల కుడుపులు విష్ణుకీర్తనము
చందపు వైకుంఠ సంబళము
పొందుగ నచ్యుతు పూజించు పూజలు
కిందట గొనకెక్కిడి నిచ్చెనలు ॥
కట్టిన ముడుపగు ఘనకృష్ణభక్తి
ముట్టిన పాపవిమోచనము
యిట్టె శ్రీ వేంకటేశ్వరుకృప యిది
పట్టినవారికి బలువగు కొమ్ము ॥

### 268. కటా కటా యిటు చేసె

కటా కటా యిటు చేసె కర్మ బాధ
యెటువంటి వారికిని నెడయదీబాధ
దినదినము ప్రాణులకు దీపనముచే బాధ
తను పోషణములు కందర్పబాధ
మనసు శాంతికి సదా మమకారముల బాధ
తనివోని కోర్కులకు దైవగతి బాధ
వెడయాస చూపులకు వేడుకల చేబాధ
కడువేడ్కలకు కందర్ప బాధ
తొడవైన యెఱుకలకు దురిత బుద్ధులబాధ
జడియు పర చింతలకు సంసార బాధ
అంది నిశ్చయమతికి అనుమానముల బాధ
సరిలేని జీవులకు జన్మబాధ





తిరు వేంకటాచలాధిపుని గని కొలుచు
వేరవు చేతనె కాని వీడదీబాధ

### 269. కడు నడుచు

కడు నడుచు చొరనేల కాళ్ళు కడుగగనేల
కడలేని జన్మసాగర మీద నేల
దురితంబునకు నెల్ల దొడవు మమకారంబు
లరిది మమతలకు దొడ వడియాసలు
గురుతయిన యాసలకు కోరికలు జీవనము
పరగ నిన్నిటికి లంపటమె కారణము
తుదిలేని లంపటము దుఃఖ హేతువు దుఃఖ
ముదుటయిన తాపమున కుండగ జోటు
పదిలమగు తాపంబు ప్రాణ సంకటములీ
మదము పెంపునకు దన మనసుకారణము
వెలయ దనమనసునకు వేంకటేశుడుకర్త
బలిసియాతని దలుచుపనికి దా గర్త
తలకొన్న తలపులివి దైవమానుషముగా
దలచి యాత్మేశ్వరుని దలపంగవలదా

### 270. కన్నుల పండుగలాయ

కన్నుల పండుగలాయ కన్నవారికిందరికి
వెన్నుడేగేనిదివో వీధుల వీధులను
అదె యెక్కె తిరుతేరు అసురులు బెదరగ
త్రిదశులు చెలగగ దేవ దేవుడు
కదలె బండికండ్లు ఘనమ్రోత తోడ
వెదజల్లు కాంతులతో వీధుల వీధులను
తోలియాడే తిరుతేరు దుష్టులెల్లనణగగ
చాలుకొని శిష్టులెల్ల జయవెట్టగ

గాలికి బడగలెల్లా కడునల్లాడగ జొచ్చె
వేలేటి పువుల దండలతో వీధుల వీధులను
తావు చెరె తిరుతేరు ధర్మములు నిలువగ
యీవుల నలమేల్మంగ ఇచ్చరించగా
శ్రీ వేంకటేశ్వరుడు శింగారాలు మెరసెను
వేవేలు విధముల వీధుల వీధులను

## 271. కలదు తిరుమంత్రము

కలదు తిరుమంత్రము కలదిహపరము
కలిమి గలుగు మాకు కడమే లేదు ॥
కమలాక్షనీవు మాకు కలిగియుండగ భూమి
నమరలేని దొకటి నవ్వలలేదు
నెమకి నాలుకమీద నీ నామము మెలగగ
తమితో పరులవేడ తాచోటులేదు ॥
శౌరినీ చక్రము నాభుజము మీద నుండగాను
యీరసపు పగలేదు యెదురు లేదు
చేరువ నీసేనా చేతులపై నుండగాను
తీరని కర్మపు వెట్టి దినమూలేదు ॥
అచ్చుతనీపైభక్తి యాత్మలో నుండగాను
రచ్చల బుట్టిన యపరాధము లేదు
నిచ్చలు శ్రీ వేంకటేశ నీశరణాగతుండగా
విచ్చిన వీడేగాని విచారమెలేదు ॥

## 272. కలశాపురముకాడ

కలశాపురము కాడ కందువ సేసుకొని
అలరుచున్నవాడు హనుమంతరాయడు ॥





సహజాన నొకజంగ చాచి సముద్రము దాటి
మహిమ మీరగ హనుమంతరాయడు
ఇహమున రాము బంటై యిప్పుడు నున్నవాడు
అహరహమును దొడ్డ హనుమంత రాయడు ॥
నిండు నిధానపు లంక నిమిషాన నీరు సేసె
మండిత మూరితి హనుమంత  రాయడు
దండితో మగిడి వచ్చి తగ సీత శిరోమణి
అండ రఘుపతి కిచ్చె హనుమంత రాయడు ॥
వదలని ప్రతాపాన వాయుదేవు సుతుడై
మదియించి నాడు హనుమంత రాయడు
చెదరక యేప్రొద్దు శ్రీ వేంకటేశు వాకిట
అదివో కాచుకున్నాడు హనుమంత రాయడు ॥

## 273. కలిగె మాకిదే

కలిగె మాకిదే కైవల్య సారము
ఫలించె నాడెద పాడెద నేను ॥
నీపాద తీర్థము నీరజభవుని
పై పై కమండల పానీయము
చేపట్టి శంభుని చిరుజడలలో
దీపించు గంగా తీర్థ రాజము
ఘననీ నామమే గౌరినాలుకపై
పనిగొన్న మంత్రపాఠము
అనుగు వాణికి ఆది చదువుల
పెనచీ మొదలి బీజాక్షరము ॥
శ్రీ వేంకటేశ్వర చేరి నీదాసుల
సేవ నాపాలిటి జీవనము

ఆవటించి శరణా గతులకును
త్రోవయైనదిదే దోషహరము ॥

## 274. కలియుగ మెటులైన

కలియుగ మెటులైన కలదుగా నీకరుణ
జలజాక్ష హరి హరి సర్వేశ్వరా !
పాపమెంత కలిగిన పరిహరించె యందుకు
నాపాల గలదుగా నీనామము
కోపమెంత కలిగిన కొచ్చి శాంత మిచ్చుటకు
చేపట్టి కలవుగా నా చిత్తములో నీవు
ధర నింద్రియాలెంత తరముకాడిన నన్ను
సరిగావ గద్దుగా నీ శరణాగతి
గరిమ కర్మ బంధాలు కట్టిన తాళ్ళూడించ
నిరతి కలదుగా నీ భక్తి నాకు
హితమైన యిహపరాలు యిష్టమైన వెల్లనియ్య
సతమై కలదుగా నీ సంకీర్తన
తతి శ్రీ వేంకటేశ నా తపము ఫలియించ
గతి కలదుగా నీ కమలాదేవి

## 275. కందర్ప జనక

కందర్ప జనక గరుడగమన
నందగోపాత్మజ నమో నమో ॥
వారిధి శయన వామన శ్రీధర
నారసింహ కృష్ణ నమో నమో
నీరజనాభ నిగమగోచర
నారాయణ హరి నమో నమో ॥
పరమ పురుషా భవవిమోచన
వరద వసుధావధూవర





కరుణాకాంతా కాళిందీరమణ
నరసఖ శౌరీ నమో నమో ॥
దానవ దమన దామోదర శశి
భానునయన బలభద్రానుజ
దీనరక్షక శ్రీ తిరువేంకటేశ
నానా గుణమయ నమోనమో ॥

## 276. కాదనకు నామాట

కాదనకు నామాట కడపరాయ నీకు
గాదె పోసెవలపు కడపరాయ
కప్పురమియ్యగ రాద కడపరాయ నీకు
కప్పితినా పయ్యెదెల్ల కడపరాయ
కప్పుమీదె కుచములు కడపరాయ వో
కప్పు మొయిలు మేనిఛాయ కడపరాయ
కందువగు రారాజు కడపరాయ ముందె
గంద మిచ్చినాడవు కడపరాయ
కందము నీ మాటలెల్ల కడపరాయ వో
కందర్ప గరుడమొక్కె కడపరాయ
కలిసితి విటు నన్ను కడపరాయ నా
కలనేడు నిజమాయ కడపరాయ
కలదా ననేను కడపరాయ వో
కలికి శ్రీ వేంకటాద్రి కడపరాయ

## 277. కొనరో కొనరో

కొనరో కొనరో మీరు కూరిమి మందు
ఉనికి మనికి కెల్లా ఒక్కటే మందు ॥

ధృవుడు గొనిన మందు తొల్లి ప్రహ్లాదుడు
చవిగా గొనిన మందు చల్లని మందు
భవరోగములు వీడి పారగ పెద్దలు మున్ను
జవ కట్టుకొనిన నిచ్చలమైన మందు ॥
నిలిచి నారదుడు గొనిన మందు, జనకుడు
గెలుపుతో గొని బ్రదికిన యా మందు
మొలచి నాలుగు యుగముల రాజులు ఘనులు
కలకాలము గొని కడగన్న మందు ॥
అజునకు పరమాయువై యొసగిన మందు
నిజమై లోకమెల్ల నిండిన మందు
త్రిజగములు నెఱుగ తిరువేంకటాద్రిపై
ధ్వజమెత్తే కోనేటిదరినున్న మందు ॥

## 278. కొమ్మలు చూడరే

కొమ్మలు చూడరే గోవిందుడు
కుమ్మరించీ ముద్దు గోవిందుడు
దిట్ట బాలులతో దిరిగీ వీధుల
గొట్టీ నుట్లను గోవిందుడు
పట్టిన కోలలు పైపై జాపుచూ
కుట్టీ దూంట్లూగా గోవిందుడు
నిలువు గాశతో నిడి గూతలతో
కొలకొలమని నీ గోవిందుడు
వలసిన పాలు వారలు వట్టుచూ
కులికీ నవ్వీ గోవిందుడు
బారలు చాపుచు బట్టగనింతుల
గూరిమి గూడి గోవిందుడు





చేరీ జవ్వనుల శ్రీ వేంకటాద్రిపై
గోరజెనకీ గోవిందుడు

## 279. కొలిచిన వారల కొంగు

కొలిచిన వారల కొంగు పైడి ఇతడు
బలిమి తారక బ్రహ్మమీతడు ॥
ఇనవంశాంబుధి నెగసిన తేజము
ఘనయజ్ఞంబుల గల ఫలము
మనుజరూపమున మనియెడి బ్రహ్మము
నినుపుల రఘుకుల నిధానమితడు ॥
పరమాన్నము లోపలి సారపు చవి
పరగిన దివిజుల భయహరము
మరగిన సీతా మంగళసూత్రము
ధరలో రామావతారం బితడు ॥
చకిత దానవుల సంహార చక్రము
సకల వనచరుల జయకరము
వికసితమగు శ్రీ వేంకట నిలయము
ప్రకటిత దశరథ భాగ్యంబితడు ॥

## 280. కొండ వేల

కొండ వేల నెత్తినట్టి గోవిందా నిన్నుఁ
గొండించేరు యశోదకు గోవిందాఁ॥
గొల్లెతలు మొక్కేరు గోవిందా నీ
కొల్లలచీర లిమ్మని గోవిందా
గొల్లువెన్న దొంగిలఁగ గోవిందా నిన్ను
కొల్లున నవ్వేరు వీరె గోవిందా ॥
గోవులఁగాచేవేళ గోవిందా పిల్లఁ
గోవిని వలచిరి గోవిందా

గోవాళులై యమునలో గోవిందా నీకు
కోవరమున్నారురా గోవిందా ॥
కొట్టేటి వుట్ల కింద గోవిందా నీతో
గొట్టెవాటై పెనఁగేరు గోవిందా
గుట్టుతో శ్రీవేంకటాద్రి గోవిందా కూడి
గొట్టానఁ బెట్టేరు బత్తి గోవిందా ॥

## 281. గతులన్నిఖిలమైన

గతులన్ని ఖిలమైన కలియుగమందును
గతి ఈతడే చూపె ఘన గురుదైవము ॥
ఈతని కరణనేకా ఇలవైష్ణవుల మైతి -
మీతని వల్లనే కంటి మీ తిరుమణి
ఈతడే ఉపదేశమిచ్చెను అష్టాక్షరి మంత్రము
ఈతడే రామానుజులు ఇహపరదైవము ॥
వెలయించె నీతడేకా వేదపు రహస్యములు
చలిమి నీతడే చూపె శరణాగతి
నిలిపినా డీతడేకా నిజముద్రా ధారణము
మలసి రామానుజులు మాటలాడే దైవము ॥
నియమములు ఈతడేకా నిలిపె ప్రపన్నులకు
దయతో మోక్షము చూపె తగనీతడు
నయమై శ్రీ వేంకటేశు నగమెక్కే వాకిటను
దయచూచి మమ్మునిట్టే తల్లిదండ్రి దైవము ॥

## 282. గరుడ ధ్వజం బెక్కె

గరుడ ధ్వజం బెక్కె కమలాక్షు పెండ్లికి
పరుషలదివో వచ్చి పై పై సేవించను





పాడిరిసోబాన భారతియు గిరిజయు
ఆడిరి రంభాదులైన అచ్చరలెల్ల
కూడిరి దేవతలెల్ల గుంపులై శ్రీ వేంకటాద్రి
వేడుకలు మీరగ శ్రీవిభుని పెండ్లికిని
కురిసె పువ్వుల వాన కుప్పలై యెందు చూచిన
మొరసే దేవదుందుభి మోతలెల్లను
బెరసె సంపదలెల్ల పెంటలై శ్రీ వేంకటాద్రి
తిరమైమించిన దేవదేవుని పెండ్లికిని
వేసిరి కానుకలెల్ల వేవేలు కొప్పెరల
పోసిరదె తలంబ్రాలు పుణ్యసతులు
ఆసల శ్రీ వేంకటేశుడలమేలు మంగతాను
సేసలు వెట్టినయట్టి సింగారపు పెండ్లికి

## 283. ఘోర విదారణ

ఘోర విదారణ నారసింహ నీ
వీ రూపముతో ఎట్లుండితివో ॥
ఉడికెడి కోపపుటూర్పుల కొండలు
పొడిపొడియై నభమున కెగయ
బెడిదపు రవమున పిడుగులు దొరుగగ
ఎడనెడ నీవపుడెట్లుండితివో ॥
కాలానలములు గక్కుచు నయన -
జ్వాలల నిప్పులు చల్లుచును
భాలాక్షముతో బ్రహ్మాండకోట్ల -
కేలికవై నీ వెట్లుండితివో ॥
గుటగుట రవములు కుత్తిక గులుకుచు
గిటగిట పండ్లు గీటుచును

తట తట పెదవులు దవడలు వణకగ
ఇటువలె నీ వపు డెట్లుండితివో ॥
గోళ్ళ మెరుగుల కొంకుల పెదపెద
వేళ్ళ దిక్కులు వెదకుచును
నీళ్ళ తీగెలు నిగుడగ నోర ను -
చ్చిళ్ళు గమ్మగ నెట్లుండితివో ॥
హిరణ్య కశిపుని ఏపడచి భయం -
కరరూపముతో కడుమెరసి
తిరువేంకటగిరి దేవుడ నీవిక
ఇరవుకొన్ననా డెట్లుండితివో ॥

## 284. చాటెద నిదియే

చాటెద నిదియే సత్యము సుండో
చేటులే దితని సేవించినను ॥
హరినొల్లని వా రసురులు సుండో
సురలీతని దాసులు సుండో
పరమాత్ముడితడే ప్రాణము సుండో
మరుగక మరచిన మరి లేదికను ॥
వేదరక్షకుడు విష్ణుడు సుండో
సోదించె శుకుడు అచ్చుగ సుండో
ఆది బ్రహ్మగన్నాతడు సుండో
ఏదెస వెదకిన ఇతడే ఘనుడు ॥
ఇహ పర మొసగను ఇతడే సుండో
వహి నుతించె పార్వతి సుండో
రహస్య మిదియే రహి శ్రీ వేంకట
మహీధరంబున మనికై నిలిచె ॥





## 285. చూడుడిందరికి

చూడుడిందరికి సులభుడు హరి
తోడు నీడయగు దొరముని యితడు ॥
కైవల్యమునకు కనకపు తాపల-
త్రోవై శ్రుతులకు తుదిపదమై
పావన మొకరూపమై విరజకు
నావై యున్నాడిదె యితడు ॥
కాపాడగ లోకములకు సుజ్ఞాన
దీపమై జగతికి తేజమై
పాపాలడపగ భవపయోధులకు
తేపైయున్నాడిదే యితడు ॥
కరుణానిధి రంగపతికి కాంచీ-
వరునకు వేంకటగిరిపతికి
నిరతి నహోబలనృకేసరికి త -
త్పరుడగు శఠగోపముని యితడు ॥

## 286. జపియించరె

జపియించరె సర్వజనులు యీనామము తమ
రపమునో పుణ్యాలకు రామనామము
శాంతికరము రామచంద్ర నామము
భ్రాంతులణచు రామభద్ర నామము
వింత సుఖమిచ్చు రఘువీర నామము భూమి
చింత దీర్చు నిదివో శ్రీరామ నామము
కలిదోషహరము రాఘవ నామము సర్వ
ఫల పదము సీతాపతి నామము
కులక శోభనము కాకుత్థ్స నామము అని
రల మైనదిదివో శ్రీరామ నామము

గుమిత మైనది రఘుకుల నామము అతి
సుముఖము దశరథ సుతనామము
అమితమై శ్రీ వేంకటాద్రి నాయకుడై
రమియించె యీతని రామనామము

### 287. జయము జయము ఇక

జయము జయము ఇక జనులాల
భయములు వాసెను బ్రదికితి మిపుడు ॥
ఘన నరసింహుడు కంభమున వెడలె
దనుజులు సమసిరి ధర వెలసె
పొనిగె నధర్మము భూభారమడగె
మునుల తపము లిమ్ముల నీడేరే ॥
గరిమతో విష్ణుడు గద్దెపై నిలిచె
హిరణ్యకశిపుని నే పడచె
అరసి ప్రహ్లాదుని అన్నిటా మన్నించె
హరుడును బ్రహ్మయు అదె కొలిచేరు ॥
అహోబలేశుడు సిరినంకమున ధరించె
బహుగతి శుభములు పాటిల్లె
ఇహపరము లొసగె నిందును నందును
విహరించెను శ్రీ వేంకటగిరిని ॥

### 288. తలచి చూడ

తలచి చూడ పరతత్వం బితడు
వలసిన వారికి వరదుడితడు
సిరికి మగడు అమృతసింధువునకు అల్లుడు
సరుస పార్వతికి సయిదోడు





గరిమల బ్రహ్మకు కన్నతండ్రి యితడు
పరగి శివునకు బావ యితడు
అల దేవేంద్రుని అనుజుడితడు
మలసి చంద్రునికి మఱదితడు
కులమున అదితికి కొడుకు యితడు
తలప సురాసురల తాతాయితడు
ప్రాణులకెల్లా బంధు వితడు
వాణికి మామగు వావి యితడు
జాణ శ్రీవేంకటాచల రమణుడితడు
మాణికపు మన్మథుడితడు

### 289. తలపు లోపలి

తలపు లోపలి తలపు దైవమితడు
పలుమారు బదియును బదియైన తలపు
సవతైన చదువులు సరుగ దెచ్చి తలపు
రవళిదరి గుబ్బలిని రంజిల్లు తలపు
కవగూడ గోరి భూకాంత ముంగిటి తలపు
తివిరి దూషకు గోళ్ళ దెగటార్చు తలపు
గొడు వట్టినవాని కోరియడిగిన తలపు
తడబడక విప్రులకు దాన మితడు తలపు
వొడిసి జలనిధిని గడ గూర్చి తెచ్చిన తలపు
జడియక హలాయుధము జళిపించు తలపు
వలపించి పురసతుల వ్రతము చెరిచిన తలపు
కలికి తనములు చూపగలిగున్న తలపు
యిల వేంకటాద్రి పై నిరవుకొన్న తలపు
కలుష హరమై మోక్షగతిచూపు తలపు

## 290. తానె తానె ఇందరి

తానె తానె ఇందరి గురుడు
సానబెట్టిన భోగి జ్ఞానయోగి ॥
అపరిమితములైన యజ్ఞాలు వడిజేయ
ప్రపన్నులకు బుద్ధి పచరించి
తపముగా ఫలపరిత్యాగము సేయించు
కపురుల గరిమల కర్మయోగి ॥
అన్నిచేతలును బ్రహ్మార్పణ విధిజేయ
మన్నించు బుద్ధులను మరుగ జెప్పి
ఉన్నత పదమున కొనరంగ కరుణించు
పన్నగ శయనుడె బ్రహ్మయోగి ॥
తనరగ కపిలుడై దత్తాత్రేయుడై
ఘనమైన మహిమ శ్రీ వేంకటరాయడై
ఒనరగ సంసార యోగము కృపసేయు
అనిమిష గతులను అభ్యాసయోగి ॥

## 291. త్రికరణశుద్ధిగా

త్రికరణశుద్ధిగా చేసిన పనులకు దేవుడు మెచ్చును లోకము మెచ్చును
ఒకటి కోటి గుణితంబగు మార్గములుండగ ప్రయాసపడనేల॥
తనమనసే పరిపూర్ణమైన గోదావరి గంగా కావేరీ
కనకబిందు యమునా గయాది ముఖ్యక్షేత్రంబుల సంతతమున్
దినకర సోమ గ్రహణకాలముల తీర్థాచరణలు చేసిన ఫలములు
తను దానే సిద్ధించును వూరకే దవ్వులు తిరుగగ మరియేల ॥
హరియను రెండక్షరములు నుడివిన అఖిల వేదములు మంత్రములు
గరిమ ధర్మశాస్త్ర పురాణాదులు క్రమమున చదివిన పుణ్యములు
పరమ తపోయోగంబులు మొదలగు బహుసాధనముల సారంబు
పరిపక్వంబై ఫలియించంగా బట్టబయలు వెదకగ నేల ॥





మొదల శ్రీ వేంకటపతికిని చేయెత్తి మొక్కిన మాత్రము లోపలనే
పదిలపు షోడశ దాన యాగములు పంచమహా యజ్ఞంబులును
వదలక సాంగంబులుగా చేసిన వాడేకాడా పలుమారు
మది మది నుండే కాయక్లేశము మాటికి మాటికి తనకేల

## 292. తొల్లియును మఱ్ఱాకు

తొల్లియును మఱ్ఱాకు తొట్టెలనె యూగె గన
చెల్లుబడి నూగీని శ్రీరంగ శిశువు ॥
కలికి కావేరి తరగల బాహులతలనే
తలగకిటు రంగమధ్యపు తొట్టెలన్
పలుమారు తనునూచి పాడగా నూగీని
చిలుపాల సెలవితో శ్రీరంగ శిశువు
అదివో కమలజుని తిరువారాధనం బనగ
అదన కమలభవాండమను తొట్టెలన్
ఉదధులు తరంగముల నూచగా నూగీని
చెదరని సిరులతోడ శ్రీరంగ శిశువు ॥
వేదములె చేరులై వెలయంగ శేషుడే
పాదుకొను తొట్టెలై పరగ గాను
శ్రీదేవితో గూడి శ్రీ వేంకటేశుడై
సేదదేరెడివాడె శ్రీరంగ శిశువు ॥

## 293. దీనరక్షకుడు

దీనరక్షకుడు డఖిలవినుతుడు దేవదేవుడు రాముడు
జానకీపతి గొలువుడీ ఘనసమరవిజయుడు రాముడు ॥
హరునితారకబ్రహ్మమంత్రమై యమరినయర్థము రాముడు
సురల గాచి యసురల నడచినసూర్యకులజుడు రాముడు

సరయు వందును ముక్తిచూరలు జనుల కొసగెను రాముడు
హరియె యీతడు హరవిరించుల కాదిపురుషుడు రాముడు ॥
మునులరుషులకు నభయ మొసగినమూలమూరితి రాముడు
మనసులోపల బరమయోగులు మరుగుతేజము రాముడు
పనిచి మీదటి బ్రహ్మపట్టము బంటు కొసగెను రాముడు
మనుజవేషముతోడ నగజకు మంత్ర మాయను రాముడు ॥
బలిమి మించినదైవికముతో భక్తసులభుడు రాముడు
నిలిచి తనసరి లేనివేలుపు నిగమవంద్యుడు రాముడు
మెలుపు శ్రీవేంకటగిరీంద్రము మీదిదేవుడు రాముడు
వెలసె వావిలిపాటిలోపలి వీరవిజయుడు రాముడు ॥

## 294. దేవ దేవోత్తమ తే

దేవదేవోత్తమ తే నమో నమో
రావణదమన శ్రీ రఘురామా ॥
రవికులాంబుధి సోమ రామలక్ష్మణాగ్రజ
భువిభరత శత్రుఘ్ను పూర్వజ
సవన పాలక కౌసల్యానంద వర్ధన
ధవళాబ్జనయన సీతారమణా ॥
దనుజ సంహారక దశరథనందన
జనక భూపాలక జామాత
వినమిత సుగ్రీవ విభీషణ సమేత
మునిజన వినుత సుముఖ సుచరిత్రా ॥
అనిలజవరద అహల్యాశాపమోచన
సనకాదిసేవిత చరణాంబుజ
ఘనతర శ్రీవేంకటగిరి నివాస
అనుపమోదార విహార గంభీరా ॥





## 295. దేవ యీతగవు

దేవ యీతగవు దీర్చవయ్యా
వేవేలకు నిది విన్నపమయ్యా ॥
తనువునఁబొడమిన తతి నింద్రియములు
పొనిఁగి యెక్కడికిఁ బోవునయా
పెనఁగి తల్లికడ బిడ్డలు భువిలో
యెనగొని యెక్కడి కేఁగుదు రయ్యా ॥
పొదుగుచు మనమునఁ బొడమిన యాసలు
అదన నెక్కడికి నరుగునయా
వొదుగుచు జలముల నుండు మత్స్యములు
పదపడి యేగతిఁబాసే నయ్యా ॥
లలి నొకటొకటికి లంకెలు నివే –
అలరుచు నేమని యందు నయా
బలు శ్రీవేంకటపతి నాయాత్మనుఁ
గలిగితి వెక్కడి కలుషము లయ్యా ॥

## 296. నగుమొగముతోడి

నగుమొగముతోడి ఓ నరకేసరి
నగరూప గరుడాద్రి నరకేసరి ॥
అమితదానవహరణ ఆదినరకేసరి
నమితబ్రహ్మాది సుర నరకేసరి
కమలాగ్ర వామాంక కనకనరకేసరి
నమోనమో పరమేశ నరకేసరి ॥
రవిచంద్రశిఖనేత్ర రౌద్రనరకేసరి
నవనారసింహా నమో నరకేసరి
భవనాశినీతీర భవ్య నరకేసరి
నవరసాలంకార నరకేసరీ ॥

శరణాగతత్రాణ సౌమ్య నరకేసరి
నరకమోచననామ నరకేసరి
హరి నమో శ్రీవేంకటాద్రి నరకేసరి
నరసింహ జయజయతు నరకేసరి ॥

## 297. నటనల భ్రమయకు

నటనల భ్రమయకు నామనసా
ఘటియించు హరియె కలవాఁడు ॥
ముంచిన జగమిది మోహినీగజము
పొంచిన యాస పుట్టించే దిది
వంచనల నిజమువలెనే వుండును
మంచులు మాయలె మరునాఁడు ॥
సరి సంసారము సంతలకూటమి
సొరిదిఁబచారము చూపేదిది
గరిమ నెప్పుడుఁగలకల మనుచుండును
మరులగు విధమే మాపటికి ॥
కందువ దేహము గాని ముదియదిది
అందిన బహురూప మాడేదిది
యెందును శ్రీ వెంకటేశ్వరుఁడుండును
డిందుపడఁగ నిదె తెరమరఁగు ॥

## 298. నడవరో జడియక

నడవరో జడియక నవ్య మార్గమిది
మడుగిది వైష్ణవ మార్గమిది
ఘన శుక ముఖ్యులు గన్న మార్గమిది
జనకాదుల నిశ్చల మార్గమిది
సనత్కుమారుడు జరపు మార్గమిది
మనువుల వైష్ణవ మార్గమిది





నలుగడ వసిష్ఠ నడుచు మార్గమిది
యిల వేదవ్యాసుల మార్గంబిది
బలిమి గలుగు ధ్రువ పట్టపు మార్గము
మలసిన వైష్ణవ మార్గమిది
పరమ మార్గం బిదె ప్రపంచ మార్గము
గురుమార్గం బిదె గోప్యమిదే
గరిమల శ్రీ వేంకటపతి మాకును
మరిపెను వైష్ణవ మార్గమిదే

## 299. నమో నమో జగదేకనాథ

నమో నమో జగదేకనాథ తవ సర్వేశ
విమల విశ్రుత అసద్విఖ్యాతకీర్తే ॥
రామ రఘువర సితరాజీవలోచన
భూమిజారమణ త్రిభువన విజయ
కోమలాంగ శ్యామ కోవిద రణరంగ
భీమ విక్రమ సత్యబిరుద ప్రవీణ ॥
దళిత దైతేయ కోదండదీక్షాదక్ష
జలజాప్తకుల విభీషణరక్షక
కలిత దశరథతనయ కౌసల్యానంద
సులభ వానరముఖ్య సుగ్రీవ వరద ॥
చారు లక్ష్మణ భరత శత్రుఘ్నపూర్వజ
తారకబ్రహ్మ నిత్యస్వరూప
ధీర శ్రీ వేంకటాధిప భక్తవత్సల
భూరిగుణ సాకేతపురనివాసా ॥

## 300. నమోనమో దశరథ

నమోనమో దశరథ నందన రామా
కమనీయ యాగభాకర్తరామా ॥

కాకుత్థ్సకులరామా కౌసల్యసుతరామా
శ్రీకర గుణోన్నత శ్రీరామా
కాకాసురవైరిరామ కౌశికవత్సలరామా
భీకర తాట కాంతక బిరుదరామా ॥
వారిధి బంధనరామా వాలిహరణ రామా
చారుహర కోదండ భంజన రామా
ధారుణి జపతిరామ దశకంఠ హరరామా
సార విభీషణ అభిషేచనరామా ॥
అమర పాలన రామా అయోధ్యరామా
సమర కోవిదరామా సర్వజ్ఞరామా
విమల రామా శ్రీవేంకటగిరి రామా
రమణ శరణాగత రక్షకరామా ॥

## 301. నమో నమో లక్ష్మీనరసింహా

నమో నమో లక్ష్మీనరసింహా
నమో నమో సుగ్రీవనరసింహా ॥
వరద సులభ భక్తవత్సల నరసింహ
నరమృగవేష శ్రీ నరసింహా
పరమపురుష సర్వ పరిపూర్ణ నరసింహ
గిరిగుహావాస సుగ్రీవనరసింహా ॥
భయహర ప్రహ్లాదపాలన నరసింహ
నయనత్రయారవింద నరసింహా
జయ జయ సురమునిసంస్తుత నరసింహ
క్రియా కలాప సుగ్రీవనరసింహా ॥
అతి కృపానిలయ మోహనరూప నరసింహ
నత పితామహ ముఖ్య నరసింహ





సతత శ్రీ వేంకటేశ్వర దివ్యనరసింహ
కితవారిభంజన సుగ్రీవనరసింహ ॥

## 302. నమో నారాయణాయ నమః

నమో నారాయణాయ (నమః)
సమధికానందాయ సర్వేశ్వరాయ ॥
ధరణీసతీ ఘనస్తనశైలపరిరంభ –
పరిమళ శ్రమజలప్రమదాయ
సరసిజనివాసినీ సరసప్రణామయుత
చరణాయ తే నమో సకలాత్మకాయ ॥
సత్యభామాముఖాంచనపత్రవల్లికా
నిత్యరచనక్రియానిపుణాయ
కాత్యాయనీస్తోత్రకామాయ తే నమో
ప్రత్యక్షనిజపరబ్రహ్మరూపాయ ॥
దేవతాధిపమకుట దివ్యరత్నాంశు సం–
భావితామల పాదపంకజాయ
కైవల్యకామినీ కాంతాయ తే నమో
శ్రీ వేంకటాచల శ్రీనివాసాయ ॥

## 303. నారాయణా నిను

నారాయణా నిను నమ్మిన నాకును
మేరతో నీ పాదమే గతి గలిగె ॥
చింతాజలధుల చిక్కిన దాటించ –
నంతట నీ పాద మదె తేప
కాంతల మోహపు కట్లు దెంచగ
పంతపు నీ పాద పరశువు కలిగె ॥

అతి దురిత పంకమంటిన కడుగగ
మితి నీ పాదమే మిన్నేరు
రతి కర్మజ్ఞులు రాచిన నార్చక
వ్రతము నీ పాదమే వానయై నిలిచె ॥

జిగినజ్ఞానపు చీకటి వాయగ
తగు నీ పాదముదయపు రవి-
అగు శ్రీ వేంకటనాథ నన్నేలగ
మిగులగ నీ పాదమే శరణంబు ॥

## 304. నారాయణుడీతడు

నారాయణుడీతడు నరులాల
మీరు శరణనరో మిమ్ము గాచీని ॥

తలచిన చోటను తానే ఉన్నాడు
వలెనను వారి కైవసమెపుడు
కొలచెను మూడడుగుల జగమెల్లాను
కొలిచినవారిని చేకొనకుండునా ॥

యెక్కడ పిలిచినా ఏ మని పలికీ
మొక్కిన మన్నించు మునుముగను
రక్కసుల నణచి రక్షించు జగములు
దిక్కని నమ్మిన తిరముగా నేలడా ॥

చూచిన యందెల్ల చూపును రూపము
వోచిన పొగడిన వుండు నోటను
యేచిన శ్రీ వేంకటేశుడే యితడట
చేచేత పూజింప సేవలుగొనడా ॥

## 305. నిత్యాత్ముడై యుండి

నిత్యాత్ముడై యుండి నిత్యుడై వెలుగొందు
సత్యాత్ముడై యుండి సత్యమైతానుండు





ప్రత్యక్షమై యుండి బ్రహ్మయై యుండు సం
స్తుత్యుడీ తిరు వేంకటాద్రి విభుడు

యేమూర్తి లోకంబు లెల్ల నేలెడు నాత
దే మూర్తి బ్రహ్మాదులెల్ల వెదకెడు నాత
దే మూర్తి నిజమోక్ష మియ్యజాలెడు నాత
దే మూర్తి లోకైక హితుడు

యే మూర్తి నిజమూర్తి యేమూర్తి యునుగాడు
యేమూర్తి త్రైమూర్తు లేకమైన యాత
దేమూర్తి సర్వాత్ము దేమూర్తి పరమాత్ము
డామూర్తి తిరు వేంకటాద్రి విభుడు

యేదేవు దేహమున నిన్నియును జన్మించె
నేదేవు దేహమున నిన్నియును నణగెమరి
యేదేవు విగ్రహంబీ సకల మింతయును
యేదేవు నేత్రంబు లిన చంద్రులు

యేదేవుడీ జీవులన్నింటిలో నుండు
నేదేవు చైతన్య మిన్నిటికి నాధార
మేదేవుడవ్యక్తుడే దేవుడద్వంద్వుం
డాదేవుడీ వేంకటాద్రి విభుడు

## 306. నీకే శరణంటి

నీకే శరణంటి నిన్నే నమ్మితినయ్యా
పైకొని శ్రీహరి నీవే పరిహరించవే ॥

విజ్ఞానములు కొన్ని విందు నే నూరకే
సుజ్ఞానములు కొన్నిచూతు నే నేపొద్దు
అజ్ఞానము నే ననిశము నడచేది
ప్రజ్ఞహీనుడ నెంత పాపకర్మమో ॥

సుకృతము లొకమరి సొరిది నే బోధింతు
ప్రకృతి యొక్కొక్కవేళ భావింతు నాత్మలో
అకృతములే నే ననిశము జేసేది
వికృతచారుడ నింకా వికార మెంతో ॥
ధర్మమార్గము కొంత తలపున నెరగితి
నిర్మలచిత్తమై మోక్షనిలయము నెరిగితి
నిర్మించి శ్రీ వేంకటేశ నీవు నన్ను నేలగాను
మర్మమెరిగితి నెట్ల మన్ననఁగాచితివో ॥

## 307. నీటముంచు పాలముంచు

నీటముంచు పాలముంచు నీచిత్తమికను
చాటితి నీకృప గురి సంసారమునకు
హరి నీవే గురి నాయాతుమ లోపలికి
అంది శంఖ చక్రాలే యంగపు గురి
పరమ పదమే గురి పట్టిన వ్రతమునకు
తిరుమంత్రమే గురి దిష్టపు నాలికకు
గోవింద నీపాద పూజే గురి నాదాస్యమునకు
తావుల నా భక్తికి నీదాసులే గురి
ఆవల నాకర్మమునకు ఆచార్యుడే గురి
దేవ నీ శరణు దిష్టపునాజన్మానకు
నగు శ్రీపతి గురి నన్ను రక్షించుటకును
తగు సంకీర్తన గురి తపమునకు
తెగని జ్ఞానమునకు తిరుమణులే గురి
మిగుల శ్రీ వేంకటేశ మించిన నీవే గురి

## 308. నీదాసుల భంగములు

నీ దాసుల భంగములు నీవుజూతురా
ఏదని చూచేవు నీకు నెచ్చరించవలెనా ॥





పాలసముద్రము మీద పవ్వళించినట్టి నీకు
బేలలై సురలు మొరవెట్టిన యట్టు
వేళతో మా మనవులు విన్నవించితిమి నీకు
ఏల నిద్దిరించేవు మమ్మిట్టే రక్షించరాదా ॥
ద్వారకా నగరములో తగ నెత్తమాడే నీకు
బీరాన ద్రౌపది మొరవెట్టినయట్టు
ఘోరపు రాజసభల కుంది విన్నవించితిమి
యేరీతి పరాకు నీకు ఇంకా రక్షించరాదా ॥
ఎనసి వైకుంఠములో ఇందిరకూడున్న నీకు
పెనగి గజము మొరవెట్టిన యట్టు
చనవుతో మా కోరికె సారె విన్నవించితిమి
విని శ్రీ వేంకటేశుండ వేగ రక్షించరాదా ॥

## 309. నీవు జగన్నాథుడవు

నీవు జగన్నాథుడవు నేనొక జీవుడనింతే
నీవలె అనుభవించ నేనెంత వాడను
వైకుంఠ పద మేడ వడి గోర నెంతవాడ
యీకడ నీదాసుడనౌటిది చాలదా
చేకొని నీ సాకార చింతయేడ నేనేడ
పైకొని నీ డాగు మోచి బ్రతికి చాలదా
సొంపుల నీయానంద సుఖమేడ నేనేడ
పంపుశ్రీవైష్ణవ సల్లాపన చాలదా
నింపుల విజ్ఞాన మేడ నేదెలియనెంతవాడ
యింపుగా నీకథ వినుటిదియే చాలదా
కైవల్య మందు నీతో కాణాచియాడ నాకు
శ్రీ వేంకటాద్రి మీది సేవ చాలదా

యీవల శ్రీ వేంకటేశ నీవిచ్చిన విజ్ఞానమున
భావించి నిన్ను పొగడే భాగ్యమే చాలదా

## 310. నీవు దేవుడవు

నీవు దేవుడవు నేనొక జీవుడ
యీ విధి నిద్దరి కెంతంతరువు ॥
పొడమిన జగములు పుట్టెడి జగములు
గుడిగొనె మీరోమ కూపముల
యెడయక నీ రూపమేమని ధ్యానింతు
అడరి మీవాడ నేననుటే కాక ॥
మునుపటి బ్రహ్మలు ముందరి బ్రహ్మలు
మొనసి మీ నాభిని మొలచేరు
ఘనుడవు నిన్నేగతి నే తెలిసెద
అనువుగ మిము శరణనుటే కాక ॥
సహజానందము సంసారానంద-
మిహము పరముగా నిచ్చేవు
అహిపతి శ్రీ వేంకటాధిప నీకృప
మహిలో సేవించి మనుటే కాక ॥







## 311. అజ్ఞానులకివి

అజ్ఞానులకివి యరుహము లింతే
సుజ్ఞానులకివి చొర నేలయ్యా !
దైవము నమ్మిన దాసులకు
కావింపఁగ మరి కర్మము లేదు
దావతి జలనిధి దాఁటిన వారికి
వోవల మరియును వోడేఅయ్య!
గురుకృప గలిగిన గుణనిధికి
అరయఁబాప పుణ్యము మరిలేదు
విరసపుఁజీకటి వెడలిన వారికి
పరగ మరియు దీపం బేలయ్య!
జగము లెరుఁగు వైష్ణవులకును
తగిలెటి యపరాధంబులు లేవు
అగపడి శ్రీ వేంకటాధిపుఁగొలిచితే
యెగువ దిగువ మా కెదురేదయ్య !

## 312. అడుగరె ఈమాట

అడుగరె ఈమాట అతని మీరందరును
యెడయని చోటను యిగిరించు బ్రియము ॥
పొరపొచ్చ మగుచోట పొసగవు మాటలు
గరిమ నొరసితేను కలగు మతి
సరపులు లేనిచోట చలము వెగ్గలమౌను
నొరసి పెనగేచోట నుమ్మగిలు వలపు ॥
వొలసి నొల్లనిచోట వొనరపు నగవులు
బలిమిచేసేచోట పంతమురాదు
అలుకచూపేచోట అమరదు వినయము
చలివాసి వుండేచోట చెండిపడు పనులు ॥

నపుపులేనిచోట నమ్మికచాలదు పొందు
అనుమానమైనచోట అంటదు రతి
యనసినాడు వేంకటేశుడు నన్నింతలోనే
తనివిలేనిచోట దైవారు కోర్కులు ॥

## 313. అతని పాడెదను

**(పెద తిరుమలాచార్యుల రచన)**

అతని పాడెదను అది వ్రతము
చతురుని శేషాచల నివాసుని ॥

సనకాదులు ఏ సర్వేశుగొలిచిరి
అనిశము శుకుడెవ్వని దలచె
మును ధృవుడేదేవుని సన్నుతించె
ఘన నారదు డేఘనుని పొగడెను ॥

ఎలమి విభీషణు డేదేవుని శరణనె
తలచె భీష్ము డేదైవమును
బలు ప్రహ్లాదుని ప్రాణేశుడెవ్వడు
ఇలలో వశిష్ఠు డేమూర్తి దెలిసె ॥

పురిగొని వ్యాసు డేపురుషుని చెప్పెను
తిరముగ అర్జునుని దిక్కెవ్వడు
మరిగిన అలమేల్మంగపతి ఎవ్వడు
గరిమల శ్రీ వేంకటేశుడీతడు ॥

## 314. అదెచూడరయ్య

అదె చూడరయ్య పెద్ద హనుమంతుని
గుదిగొని దేవతలు కొనియాడేరయ్య ॥

ఉదయాస్తశైలములు ఒక జంగగా చాచె
అదివో ధృవమండల మందె శిరసు





చదివె సూర్యుని వెంట సారె మొగము ద్రిప్పుచు
ఎదుట ఈతని మహిమ యేమని చెప్పేమయ్య ॥

దండిగా బ్రహ్మాండము దాక తోకమీదికెత్తె
మెండగు దిక్కుల నిండా మేను వెంచెను
గుండు గూడ రాకాసుల కొట్టగ చేతులు చాచె
అండ ఈతని ప్రతాప మరుదరుదయ్యా ॥

దిక్కులు పిక్కటిల్లగ దేహరోమములు పెంచె
పక్కన లోకములకు ప్రాణమై నిల్చె
ఇక్కడ శ్రీ వేంకటేశు హితవరి బంటాయ
మిక్కిలి ఈతని లావు మేలు మేలయ్య ॥

## 315. అదెలంక సాధించె

అదెలంక సాధించె నవని భారము దించె
విదితమై ప్రతాపము వెలయించె నితడు ॥

రవివంశ తిలకుడు రాముడితడు
భూవిపుట్టె దశరథపుత్రుడితడు
భువుడెంచే తారక బ్రహ్మమీతడు
పవనజుకిచ్చినాడు బ్రహ్మపట్టమితడు ॥

బలువుడు సీతాపతి యితడు
తలకొన్న వాలిమర్దనుడితడు
విలసిల్లె ఏకాంగ వీరుడీతడు
చలమరి కోదండదీక్షా గురుడితడు

శరణాగత వజ్ర పంజరుడీతడు
సరిలేని అసురభంజకుడీతడు
వరదుడు శ్రీ వేంకటేశ్వరుడితడు
అరయ విజయనగరాధీశుడితడు ॥

## 316. అపుడేమనె నేమను

అపుడేమనె నేమను మనెను
తపమే విరహపు తాపమనె ॥
పవనజ యేమనె పడతిమరేమనె
అవనిజ నిను నేమను మనెను
రవికులేంద్ర భారము ప్రాణంబనె
ఇవల నెల్ల ధరియించే ననె ॥
యింకా నేమనె యింతి మరేమనె
కొంకక యేమని కొసరుమనె
బొంకుల దేహము పోదిది వేగనె
చింకవేట యిటు చేసెననె ॥
నను నేమనె ప్రాణము మన కొకటనె
తనకు నీ వలెనె తాపమనె
మనుకులేశ ప్రేమపు మనకూటమి
ఘనవేంకటగిరి గంటిననె ॥

## 317. అప్పులేని సంసారము

అప్పులేని సంసారము పాటేచాలు
తప్పులేని జీతమొక్క తారమైనచాలు
కంతలేని గుడిశొక్క గంపంతయినచాలు
చింతలేని అంబలొక్క చేరెడుచాలు
జంతగాని తరుణి యేజాతైననదెచాలు
వింతలేని సంపదొక్క వీసమైనచాలు
తిట్టులేని బతుకొక్క దినమైననదెచాలు
ముట్టులేని కూడొక్క ముద్దేచాలు





గట్టుచెడి మనుకంటే కొంచెము మేలైనచాలు
వట్టిజాలి బదుకుంటే వచ్చినంతచాలు
లంపటపడని మేలు లవలేశమేచాలు
రొంపికంబ మోకంటే రోయుటేచాలు
రంపపు కోరిక కంటే రతి శ్రీవేంకటపతి
పంపునవాతని కంటే భవమేచాలు

## 318. అహోబలేశ్వరుడు

అహోబలేశ్వరుడు అఖిలవందితుడు
మహినితనిగొలిచి మనుడికజనులు
మూడు మూర్తులకు మూలంబీతడు
వేడి ప్రతాపపు విభుడీతడు
వాడి చక్రాయుధ వరదుడీతడు
పోడిమిపురాణ పురుషుడీతడు
అసురుల కెల్ల కాలాంతకు డీతడు
వసుధ దివ్య సింహంబితడు
విసువని మేకాంగ వీరుడీతడు
దెసల పరాత్పర తేజంబితడు
నిగిడి శ్రీవేంకట నిలయుడీతడు
వొగివాయని శ్రీపతియితడు
సొగిసి దాసులకు సులభుడీతడు
తగు నిహపరముల దాతయు నితడు

## 319. అంతరంగమెల్ల శ్రీహరికి

అంతరంగమెల్ల శ్రీహరికి ఒప్పించకుంటె
వింత వింత విధముల వీడునా బంధములు ॥

మనుజుడై ఫలమేది మరి జ్ఞానియౌదాకా
తనువెత్తి ఫలమేది దయగలుగుదాకా
ధనికుడై ఫలమేది ధర్మము సేయుదాకా
వనిమాలి ముదిసితే పాసెనా భవము ॥

చదివియు ఫలమేది శాంతము కలుగుదాకా
పెదవెత్తి ఫలమేది ప్రియమాడుదాకా
మదిగలి ఫలమేది మాధవు దలచుదాకా
యెదుట తాను రాజైతే ఏలెనా పరము॥

పావనుడై ఫలమేది భక్తి కలిగిన దాకా
జీవించి ఫలమేది చింత దీరుదాకా
వేవేల ఫలమేది వేంకటేశు గన్నదాక
భావించి తా దేవుడైతే ప్రత్యక్షమౌనా ॥

## 320. అందరికి నెక్కుడైన

అందరికి నెక్కుడైన హనుమంతుడు
అందుకొనె సూర్యఫలమని హనుమంతుడు ॥

బల్లిదుడై లంకచొచ్చి బలురాకాసుల గొట్టి
హల్లకల్లోలము చేసె హనుమంతుడు
వొల్లనె రాముల ముద్దుటుంగరము సీత కిచ్చి
అల్లదె నిలుచున్నాడు హనుమంతుడు ॥

దాకొని యాకెముందర తన గుఱుతెరుగించి
ఆకారమటు చూపె హనుమంతుడు
చేకొని శిరోమణి చేతబట్టి జలనిధి
ఆకసాన దాటివచ్చె హనుమంతుడు ॥

కొంకకిట్టె సంజీవికొండ దెచ్చి రిపులకు
నంకకాడై నిలిచెను హనుమంతుడు





తెంకినే శ్రీవేంకటాద్రి దేవుని మెప్పించినాడు
అంకె కలశాపురపు హనుమంతుడు ॥

## 321. అందరిలోనా నెక్కుడు

అందరిలోనా నెక్కుడు హనుమంతుడు
కందువ మతంగగిరి కాడి హనుమంతుడు

కనక కుండలాలతో కౌపీనము తోడ
జనియించినాడు యీ హనుమంతుడు
ఘన ప్రతాపముతోడ కఠిన హస్తాలతోడ
పెనుతోక యెత్తినాడు పెద్ద హనుమంతుడు

తివిరి జలధిదాటి దీపించి లంకయెల్లా
అవల యివల సేసె హనుమంతుడు
వివరించి సీతకు విశ్వరూపము చూపుతా
ధ్రువమండలము మోచే దొడ్డ హనుమంతుడు

తిరమైన మహిమతో దివ్య తేజముతోడ
అరసిదాసుల గాచీ హనుమంతుడు
పరగ శ్రీవేంకటేశు బంటై సేవింపుచు
వరములిచ్చీ బొడవాటి హనుమంతుడు

## 322. ఆడరమ్మ పాడరమ్మ

ఆదరమ్మ పాదరమ్మ అంగనలు చూడరమ్మ
వేడుక పరుషలెల్ల వీధి నుండరమ్మ ॥

అల్లదివో ఓగునూతుల ఔభళేశు పెద్దకోన
వెల్లిపాల నీటి జాలు వెడలే సోన
చల్లని మాకులనీడ సంగడి మేడలవాడ
ఎల్లగాగ నరసింహు దేగీ నింతితోడ ॥

సింగారపు మండపాల సింహాల మునిమందలు
అంగపు తెల్లగోపురము అదె మిన్నంద
చెంగట నాళువార్లు చేరి పన్నిద్దరు గొల్వ
సంగతి తా కొలువిచ్చీ జయనరసింహము ॥

కందువ శ్రీవేంకటేశు కల్యాణముల వేది
అందమై భూమికెల్ల ఆదికినాది
మందల పాలకొండ మలకు నట్టనడుమ
విందగు దాసుల తోడ విహరించీ దేవుడు ॥

## 323. ఆణికాడవట

ఆణికాడవట యంతటికి
జాణవు తెలియము సరిగొనవయ్యా ॥

ముంగిట చెమటల ముత్యపు పూసలు
అంగన లోలో నమ్మీనదె
ఇంగితంపు వెలలెరుగుదు వటవో
అంగడి బేహారి యవి గొనవయ్యా ॥

మొల్లమి మాచెలి మోవి మాణికము
అల్ల వెలకు మీ కమ్మీనదే
తొల్లి నీవు సూదులవాట్లచే
కొల్ల లాడితట కొనవయ్యా ॥

నిడుదల చూపుల నీలంబులు నీ-
వడిగినంతకే యమ్మీనదే
పడతిదె శ్రీవేంకటపతి నీ విదె
యెడయని కాగిట నిటుగొనవయ్యా ॥

## 324. ఆదిదేవ పరమాత్మా

ఆదిదేవ పరమాత్మా
వేద వేదాంత వేద్య నమో నమో ॥





పరాత్పరా భక్త భవభంజన
చరాచరలోకజనక నమో నమో ॥

గదాధరా శ్రీ వేంకటగిరి నిలయ
సదానంద ప్రసన్న నమో నమో ॥

## 325. ఇతడే యతడు

ఇతడే యతడు గాబోలేలిక బంటును నైరి
మితిలేని రాఘవుడు మేటి హనుమంతుడు ॥

జలధి బంధించి దాటె చలపట్టిరాఘవుడు
అలరి వూరకే దాటె హనుమంతుడు
అలుకతో రావణుని యదటణచెనతడు
తలచి మైరావణుని దండించె నితడు ॥

కొండ వెల్లగించె దొల్లి గోవర్ధనుడతడు
కొండతో సంజీవి నెత్తె కోరి యితడు
గుండు గరచె నహల్యకొరకు సీతాపతి
గుండు గరగగ పాడె కోరి యితడు ॥

అంజనాచలము మీద నతడు శ్రీవేంకటేశు
డంజనీతనయుడాయ అనిలజుడు
కంజాప్తకులరామఘనుడు తానును దయా -
పుంజమాయ మంగాంబుధి హనుమంతుడు ॥

## 326. ఇదిగాక సౌభాగ్యమిదిగాక

ఇదిగాక సౌభాగ్యమిదిగాక తపముమరి
యిదిగాక వైభవం బిక నొకటికలదా

అతివజన్మము సఫలమై పరమ యోగివలె
నిరత మోహాపేక్ష లన్నియు విడిచె

సతి కోరికలు మహా శాంతమై యిదెచూడ
సతత విజ్ఞాన వాసనవోలె నుండె
తరుణి హృదయము కృతార్థత పొంది విభుమీది
పరవశానంద సంపదకు నిరవాయ
సరసిజానన మనోజయమంది యింతలో
సరిలేక మనసు నిశ్చల భావమాయ
శ్రీ వేంకటేశ్వరుని చింతించి పరతత్వ
భావంబు నిజముగా పట్టె చెలియాత్మ
దేవోత్తముని కృపాధీనురాలై యిపుడు
లావణ్యవతికి నుల్లంబు దిరమాయ

## 327. ఇందిర వడ్డించ

ఇందిర వడ్డించ యింపుగను
చిందక యిట్లే భుజించవో స్వామి
అక్కాళ పాశాలు అప్పాలు వడలు
పెక్కైన సయిదంపు పేణులును
సక్కెర రాసులు సద్యోఘృతములు
కిక్కిరియ నారగించవో స్వామి
మీరిన కెళంగు మిరియపు తాళింపు
గూరలు కమ్మని కూరలును
సారంపు పచ్చళ్ళు చవులుగనిట్టే
కూరిమితో చేకొనవో స్వామి
పిండివంటలును పెరుగును పాలు
మెండైన పాకాలు మెచ్చి మెచ్చి
కొండల పొడవు కొరిదివ్యాన్నాలు
వెండియు మెచ్చవే వేంకటస్వామి





## 328. ఈడగుపెండ్లి

ఈడగు పెండ్లి ఇద్దరిఁజేసేము
చేడెలాల ఇది చెప్పరుగా ॥
పచ్చిక బయళ్ళ పడతి యాడగా
ముచ్చట కృష్ణుడు మోహించి
వెచ్చపు పూదండ వేసి వచ్చెనట
గచ్చుల నాతని కానరుగా ॥
ముత్తెపు ముంగిట ముదిత నడువగా
ఉత్తముడే చెలి వురమునను
చిత్తరువు వ్రాసి చెలగివచ్చె నౌళ -
జొత్తుమాని ఇటు చూపరుగా ॥
కొత్త చవికతో కొమ్మ నిలిచితే
పొత్తున తలబాలు వోసెనట
ఇత్తల శ్రీ వేంకటేశుడు నవ్వుచు
హత్తి సతిఁగూడె నని పాడరుగా ॥

## 329. ఈతడు తారక బ్రహ్మా

ఈతడు తారకబ్రహ్మా మితడు మా దేవుడు
కౌతుకాన చెప్పే వినగదరే వో జనులు ॥
రాముడు యిందీవరశ్యాముడు నానాసార్వ -
భౌముడు షోడశకళాసోముడు
దోమటి రాక్షసులను తుత్తుమురు సేసినాడు
కామిత ఫలము లిచ్చి కాచినాడు సురల ॥
పూర్ణుడు నీలమేఘవర్ణుడు దానమున వి -
స్తీర్ణుడు వాహన సుపర్ణుడు

ఆర్ణవము దాటి రావణాదుల గెలిచినాడు
నిర్ణయించి చెప్పరాదు నేడీతని మహిమ ॥
వరుడు సీతకు పరాత్పరుడు కోదండ దీక్షా
గురుడు దివ్యామోఘశరుడితడు
నిరతి శ్రీవేంకటాద్రి నెలవై యుండేటివాడు
సరి భరత లక్ష్మణ శత్రుఘ్న సహితుడు ॥

## 330. ఈపెకు ఇతడు తగు

ఈపెకు ఇతడు తగు ఇతనికి ఈపెతగు
చూపులకు పండుగాయ శోభనము నేడు
పిలువరె పెండ్లికూతురు పెండ్లిపీట మీదికి
చెలగీ తానెదురు చూచీ దేవుడు
బలువుగా యిద్దరికి బాసికములు కట్టరే
కలిమెల్ల మెరసీ సింగారించరే
ఆతల తెచ్చి పెట్టరే ఆ పెండ్లి కూతురును
ఈతడె జంట శోభన మిద్దరికిని
కాతరాన బువ్వానకు గక్కన వెట్టరె మీరు
రేతిరి నుండియు వేగించరే మీరు
పానుపులు పరచరే బలునాగవల్లి నేడు
పూనితెర వేయరే పొలతులాల
ఆనుక శ్రీ వేంకటేశుడలమేలు మంగయును
లోననే భూకాంతయును లోలులైరి తాము

## 331. ఉన్నమంత్రా లిందు సరా

ఉన్నమంత్రా లిందు సరా వొగి విచారించుకొంటే
విన్నకన్నవారి కెల్ల విష్ణునామమంత్రము ॥





పరగ బుచ్చకాయల బరసి పోదు మంత్రము
గరిమ ముట్టంటు లేని ఘనమంత్రము
వరుసనెవ్వరువిన్నా వాడిచెదని మంత్రము
అరయ నిదొక్కటే పో హరినామమంత్రము ॥
యెజాతివారి కైన ఎంగిలిలేని మంత్రము
వోజ దప్పితే జెడక వుండేమంత్రము
తేజాన వొకరి కిస్తే దీరిపోనిమంత్రము
సాజమైనదిదే పో సత్యమైన మంత్రము ॥
యిహము పరము దానే యియ్యజాలిన మంత్రము
సహజమై వేదాలసారమంత్రము
బహునారదాదు లెల్ల పాటపాడిన మంత్రము
విహితమయిన శ్రీవేంకటేశుమంత్రము ॥

## 332. ఎటువంటి మోహమో

ఎటువంటి మోహమో ఎట్టి తమకమొగాని
తటుకునను దేహమంతయు మరచె చెలియ ॥
పలుకు తేనెల కొసరి పసిడి కిన్నెర మీటి
పలుచనెలుగున నిన్ను పాడి పాడి
కలికి కన్నీరు బంగారు పయ్యెద నొలుక
తలయూచి తనలోనె తలవంచు చెలియ ॥
పడతి నీవును తాను పవళించు పరపుపై
పొడము పరితాపమున పొరలి పొరలి
జడిగొన్న జవ్వాది జారు చెమటల దోగి
ఉడుకు నూరుపుల నుసురుసురాయె చెలియ ॥
తావిజల్లెడి మోముదమ్మి కడు వికసించె
లో వెలితి నవ్వులను లోగి లోగి

శ్రీ వేంకటేశ లక్ష్మీకాంత నినుగలసి
ఈ వైభవము లందె ఇదివో చెలియ ॥

### 333. ఎదుటనున్నాడు వీడె

ఎదుట నున్నాడు వీడె ఈబాలుడు
మదితెలియమమ్మ ఏమరులోకాని ॥
పరమ పురుషుడట పసులగాచెనట
సరవులెంచిన విన సంగతాయిది
హరియె తానట ముద్దులందరికి జేసెనట
ఇరవాయనమ్మ సుద్దులేటివో గాని ॥
వేదాలకొడయడట వెన్నలు దొంగిలెనట
అదించి విన్నవారికి నమ్మికా యిది
ఆదిమూల మీతడట ఆడికెల చాతలట
కాదమ్మ ఈ సుద్దులెట్టికతలో కాని ॥
అల బ్రహ్మతండ్రియట యశోదకు బిడ్డడట
కొలదొకరికి చెప్పకూడునా యిది
తెలిపి శ్రీ వేంకటాద్రి దేవుడై నిలిచెనట
కలదమ్మ తనకెంతో కరుణో కాని ॥

### 334. ఎంత కాలమో కదా

ఎంతకాలమో కదా యీదేహధారణము
చింతా పరంపరల చిక్కువడ వలసే
వడిగొన్న మోహంబు వలల తగులైకదా
కడలేని గర్భనరకము లీదవలసె
నడిమి సుఖములచేత ననుపు సేయక కదా
తొడరి హేయపు దిట్టి దూరాడ వలసే





పాపపుంజములచే పట్టువడక కదా
ఆపదలతోడి దేహము మోవవలసె
చూపులకు లోనైన సుఖము కానక కదా
దీపన భ్రాంతిచే తిరుగాడ వలసే
హితుడైన తిరువేంకటేశు కొలువక కదా
ప్రతిలేని నరక కూపమున బడవలసే
అతని కరుణామృతంబబ్బకుండక కదా
బతిమాలి నలుగడల పారాడవలసే

### 335. ఎంతనేరుపరి ఈ లేమ

ఎంత నేరుపరి ఈ లేమ
దొంతిపెట్టే సంతోషముల ॥
వెలది సెలవులను వెన్నెలగాసీ
చెలులు నీ సుద్దులు చెప్పగను
తలపోతలనే దండలు గుచ్చీ
నెలకొని ఎదుటను నీ వుండగను ॥
తెఅవ పెదవులను తేనెలు చిందీ
మరి నీవాడిన మాటలను
నెఱిశ్రీవేంకట నిలయ కూడితివి
జఱసీ నీతో జాణ తనముల ॥

### 336. ఒక్కడే ఏకాంగ వీరుడుర్వికి

ఒక్కడే ఏకాంగ వీరుడుర్వికి దైవమౌనా
యెక్కడా హనుమంతుని కెదురా లోకము ॥
ముందట నేలెడి పట్టమునకు బ్రహ్మాయినాడు
అందరు దైత్యులచంపి హరిపేరైనాడు

అంది రుద్రవీర్యము తానై హరుడైనాడు
యెందునా హనుమంతుని కెదురా లోకము ॥
చుక్కలు మోవ పెరిగి సూర్యుడు తానైనాడు
చిక్కుపాతాళము దూరి శేషుడైనాడు
గక్కన వాయుజుడై జగత్ప్రాణుడైనాడు
ఎక్కువ హనుమంతుని కెదురా లోకము ॥
జలధి పుటమెగసి చంద్రుడు తానైనాడు
మలసి మేరువుపొంత సింహమైనాడు
బలిమి శ్రీవేంకటేశు బంటై మంగాంబుధిని
ఇల ఈ హనుమంతుని కెదురా లోకము ॥

## 337. కడుపెంత తాకుడుచు

కడుపెంత తా కుడుచు కుడుపెంత దీనికై
పడని పాట్ల నెల్ల పడి పొరల నేల ॥
పరుల మనసునకు ఆపదలు కలుగగచేయు
పరితాపకరమైన బ్రతుకేల
సొరిది ఇతరుల మేలుచూచి సైపగలేక
తిరుగు చుండే కష్ట దేహమది ఏల ॥
ఎదరికైప్పుడు చేయు హితమెల్ల తనదనుచు
చదివి చెప్పనియట్టి చదువేల
పొదిగొన్న యాసతో బుంగుడై సతతంబు
సదమదంబై పడయు చవులు తనకేల ॥
శ్రీవేంకటేశ్వరుని సేవారతికి గాక
జీవన భ్రాంతిపడు సిరులేల
దేవోత్తముని యాత్మతెలియనొల్లక పెక్కు
త్రోవలేగిన దేహి దొరతనం బేల ॥





## 338. కానరటేపెంచరటే

కానరటె పెంచరటె కటకటా బిడ్డలను
నేను మీవలెనే కంటి నెయ్యమైన బిడ్డని ॥
బాయిట పారవేసిన పాలు వెన్నలును
చేయి పెట్టకుందురా చిన్నిబిడ్డలు
మీయిండ్లు జతనాలు మీరుసేసికొనక
పాయక దూరేరేలే ప్రతిలేని బిడ్డని ॥
మూసిన కాగుల నేయీ ముంగిటి పెరుగులూ
ఆసపడకుందురా ఆడేబిడ్డలు
వోసరించి మోసపోక వుండలేక మీరు
సేసేరింతేసి దూరు చెప్పరాని బిడ్డని ॥
చొక్కమైన కొప్పెరల జున్నులు జిన్నులును
చిక్కిన విడుతురా చిన్నిబిడ్డలు
మిక్కిలి పూజలు సేసి మెచ్చించ తగదా
యెక్కువైన తిరువేంకటేశుడైన బిడ్డని ॥

## 339. కేశవదాసి నైతి

కేశవదాసి నైతి గెలిచితి నన్నిటాను
యీ శరీరపు నేరాలికనేల వెదక ॥
నిచ్చలు కోరికలియ్య నీనామమే చాలు
తెచ్చి పునీతుచేయ నీతీర్థమే చాలు
పచ్చిపాపాలణచ నీ ప్రసాదమేచాలు
యెచ్చు కొందు వుపాయాలు ఇకనేల వెదక ॥
ఘనుని చేయగను నీ కైంకర్యమే చాలు
మొనసి రక్షించను నీ ముద్రలే చాలు

మనిపి కావగ తిరుమణి లాంఛనమే చాలు
యెనసెను దిక్కుదెస ఇకనేల వెదక ॥
నెలవైన సుఖమియ్య నీ ధ్యానమేచాలు
అల దాపుదండకు నీ యర్చనే చాలు
యిలపై శ్రీ వేంకటేశ యిన్నిటా మాకు కలవు
యెలమి నితరములు యికనేల వెదక ॥

## 340. కొలనిలోన

కొలనిలోన మును గోపికలు
మొలకనవ్వులతో మ్రొక్కిరి నీకు ॥
పిరుఁదులు దాఁటిన పించెపు టలకల
తురుములు వీడఁగఁ దొయ్యలులు
అరిది నితంబము లందునె దాఁచుక
మురిపెపుఁగరముల మొక్కిరి నీకు ॥
నిద్దపు మానము నెలఁతలు లోఁగుచు
గద్దరి తొడలనె కట్టుచును
ముద్దటుంగరంబుల కరములతో
ముద్దులు గునియుచు మొక్కిరి నీకు ॥
పాలిండ్ల పెనుభారంబుల కర
మూలపు మెఱుఁగులు ముంచఁగను
వేలపుఁబ్రియముల వేంకటేశ నిను
మూలకుఁనిలుచుచు మొక్కిరి నీకు ॥

## 341. ఘుమ్మనియెడి శ్రుతి

ఘుమ్మని యెడి శ్రుతికూడగను
కమ్మని నేతులు కాగగ చెలగె ॥





నీల వర్ణుడని నీరజాక్షుడని
బాలుని నతివలు పాడేరో
పాలు పిదుకుచును బానల కాగుల
సోలి పెరుగు త్రచ్చుచుఁజెలరేగె ॥
మందరధరుడని మాధవుడని గో –
విందుని పాడేరు వెలదు లిదే
నంద వ్రజమున నలుగడ నావుల
మందల పేయల మంచిరవముల ॥
వేంకటపతియని వేదనిలయుడని
పంకజనాభుని పాడేరు
అంకుల చేతను అలరు రవంబుల
బింకపు మాటల బృందావనమున ॥

## 342. చాలుఁజాలును

చాలుఁజాలును భోగసమయమున మైమఱపు
పాలుపడునట యేఁటి బ్రదుకురా వోరి ॥
ఇందుముఖి నినుఁగౌగిలించి లోపలి జగము
కందునని నీ బిగువుఁగౌఁగిలే వదలె
పొందైన వారితోఁ బొసఁగఁ గౌఁగిటఁ జేర్పఁ
బొందు గాదట యేఁటి పొందురా వోరి ॥
నెలఁత నీవాలుఁగన్నులు మూసి జగమెల్లఁ
గలయఁ జీఁకటైన గక్కనను వదలె
వలచి నంగనలు తమ వలసిన విలాసముల
వలను నెరపనిదేఁటి వలపురా వోరి ॥
కొమ్మ నీ వురము పై గోరుదివియుచు నాత్మ
నిమ్మెష ననుఁదాక నిద్దరినిఁదాకె

దిమ్మరివి కోనేటితిమ్మ నీపైఁబ్రియము
కుమ్మరించని దేఁటి కోర్కిరా వోరి ॥

## 343. చిత్తజ గురుడ ఓ

చిత్తజగురుడ ఓ శ్రీనరసింహ
బత్తిసేసేరు మునులు పరికించవయ్య ॥
సకలదేవతలును జయవెట్టుచున్నారు
చకితులై దానవులు సమసిరదె
అకలంకయగు లక్ష్మి అటు నీ తొడపై నెక్కె
ప్రకటమైన నీ కోపము మానవయ్య ॥
తుంబురు నారదాదులు దొరకొనిపాడేరు
అంబుజాసనుండభయ మడిగీనదె
అంబరవీధినాడేలు అచ్చరలందరు గూడి
శంబర రిపు జనక శాంతము చూపవయ్యా ॥
హత్తి కొలిచేరదె యక్షులును గంధర్వులు
చిత్తగించు పొగడేరు సిద్ధ సాధ్యులు
సత్తుగ నీ దాసులము శరణు జొచ్చితిమిదె
ఇత్తల శ్రీ వేంకటేశ ఏలుకొనవయ్యా ॥

## 344. చిరంతనుడు శ్రీవరుడు

చిరంతనుడు శ్రీవరుడు
పరమంభవ్యం పావనం
వేదమయుడు కోవిదుడమలుడు పరు
డాదిమ పురుషుడు మహా మహుడు
యేదెస నేమని యేది తలచినన
ఖేదమ వాద మఖిల సమ్మతం
నిఖిలమయుడు మునివరదు దధికుడు
మఖ ముఖ శుకాభిమ తరతుడు





శిఖరం శివం సుశీలన మతిశయ
ముఖరం ముఖ్యం మూలమిదం
అనేక ప్రదుడానాది నిధనుడు
ఘనుడీ తిరువేంకట విభుడు
దినం దినం సముదితర వికోటిభ-
జనం సిద్ధాంజనం ధనం

## 345. చూడచూడ నింతలోనె

చూడచూడ నింతలోనె శుక్రవారమునాడు
ఆడనీడ విభవాలె అమరే దేవునికి ॥
మేటిపాల జలధిలో మీగడలంటెనొ గానీ
మీటనె దొంగిలినట్టి వెన్నలంటెనో
నూటుకాకాశగంగ(మ) నురుగంటెనో యనగ
ఆటల కర్పూరకాపు అమరే దేవునికీ ॥
శిశువులు దెచ్చునాడు చీకటియంటెనో గాని
మసలక కరిగాసె మదమంటెనో
సుసరాననీలికాసె సొగసంటెనో యనగ
అసుదై పుణుగుకాపు అమరే దేవునికీ
పరమతేజంబైన ప్రభలుచల్లెనో గాని
వురము శ్రీసతియున్న వొరపులివి
అరిది శ్రీ వేంకటేశు అలమేలుమంగ తోడ
అరలేక సొమ్ములెల్ల అమరే దేవునికి ॥

## 346. చూడ పిన్నవాడు గాని

చూడ పిన్నవాడు గాని జూటుదనాల నెక్కుడు
యేడ చూచినా తాను యీ విట్ఠలుండే ॥
గోవులలో విహరించే గోవిందుడు పెక్కు
వావుల గోపికలకు వల్లభుడు

చేవమీరి ముద్దుల శ్రీకృష్ణుడు
యేవల్లజూచినాను యీ విట్ఠలుడే ॥
రాసక్రీడలలోని రాజీవాక్షుడు
ఆస పదారువేల పెండ్లాడినవాడు
బాసతో రుక్మిణీ సత్యభామాసమేతుడు
యీ సుద్దుల వెలసీ నీ విట్ఠలుడే ॥
వింత మధురాంగనల వేడుకకాడు
చెంత కొలని సతుల సిగ్గులవాడు
కాంత లక్ష్మీపతి వేంకటేశ్వరుడు
యింతటా వినోదించీ నీ విట్ఠలుడే ॥

## 347. చూడవయ్య నీ సుదతి

చూడవయ్య నీ సుదతి విలాసము
వేడుక కాడవు విభుడవు నీవు ॥
పున్నమి వెన్నెల పోగులు పోసి
సన్నపు నవ్వుల జవరాలు
వన్నెల కుంకుమ వసంతమాడీ
ఇన్నిటా కళలతో ఈ మెరుగుబోడి ॥
పాటించి తుమ్మెద పౌజులు దీర్చీ
కాటుక కన్నుల కలికి యిదే
సూటిజక్కవల జోడలరించీ
నాటకపుగతుల నాభిసరసి ॥
అంగజు రథమున హంసలు నిలిపి
కంగులేని ఘన గజగమన
ఇంగితపు శ్రీ వేంకటేశ నిన్నెనసె
పంగెన సురతపు పల్లవాధరి ॥





## 348. జవ్వాది మెత్తినది

జవ్వాది మెత్తినది తన
జవ్వనమే జన్నె వట్టినది ॥
ముద్దుల మాటలది చెక్కు -
టద్దముల కాంతి నలరినది
గద్దరి చూపులది తన -
వొద్ది చెలియ మీద నొరగున్నది ॥
పుత్తడిబోలినది తన
చిత్తము నీ సొమ్ము చేసినది
గుత్తపు గుబ్బలది అల
చిత్తజుని లెక్క సేయనిది ॥
ఎమ్మెలు యెఱగనిది తన
కెమ్మోవి చిరునవ్వు కెరలున్నది
కమ్మకొనగ వెంకటరాయా నీ
కమ్మని కౌగిట కలశున్నది ॥

## 349. తగుదువమ్మ

తగుదువమ్మ నీ వందపుమరుతండ్రికి
మొగిదచ్చి నమృతము మోవి నుంది గాన ॥
కోమలి నీ జవ్వనము కొలదివెట్టగరాదు
ప్రేమమున మీద మీద పెరిగీ గాన
ఆమని నీ సింగార మంత యింత అనరాదు
వేమారు నీ చూపు వెల్లివిరిసీ గాన ॥
తొయ్యలి నీ వొరపులు తులదూచి చెప్పరాదు
నెయ్యపు నీ తురుమిదె నిక్కీ గాన
చయ్యన నీ సొబగు లిచ్చట నియమించరాదు
అయ్యన నీ పిరుదున కలవి లేదు గాన ॥

వనిత నీ భావమింక వర్ణించి పలుకరాదు
కొన నీ పాదములు చిగురులు గాన
తనరు నీ భాగ్యము తలచ నలవి కాదు
ఘనుడు శ్రీ వేంకటేశు కలసితివి గాన ॥

## 350. తత్తాతిగుడి ధింధిం

తత్తాతిగుడి ధింధిం తకధింధిం
తిత్తి తిత్తితి తితి తితి తితి ॥
దానవదన వితానదాన సం -
ధాన రుధిర నిజ పాన మిదం
నానా భూత గణానాం గానం
దీన జనానాం తిత్తితి తితి ॥
విమత దనుజమత విభవపరిభవిత
సమధికం తవ శౌర్య మిదం
ప్రమదా భవ్యం ప్రమాదాభరణం
తిమిర నిరసనం తిత్తితి తితి ॥
తిరువేంకటగిరి దేవనిధానం
పరమామృతరస భాగ్యమిదం
కరుణావరణం కమలా ఘటనం
తిరొ తిరొ తిత్తితి తితి తితి ॥

## 351. తనకేడ

తనకేడ చదువులు తనకేడ శాస్త్రాలు
మనను చంచలబుద్ధి మానీనా ॥
జడ్డు మానవుఁడు చదువఁ జదువ నాస
వడ్డివారుఁగాక వదలీనా





గుడ్డికుక్క సంతకుఁబోయి తిరిగిన
దుడ్డుపెట్లేకాక దొరకీనా ॥
దేవదూషకుఁడై తిరిగేటి వానికి
దేవతాంతరము తెలిసీనా
శ్రీవేంకటేశ్వరు సేవాపరుఁడుఁగాక
పావనమతియై పరగీనా ॥

## 352. తలమేల కులమేల

తలమేల కులమేల తపమే కారణము
యెలమి హరిదాసులు యేజాతియైన నేమి
కాకమువల్లఁ బుట్టదా ఘనమైన యశ్వత్థము
దాకొని గుల్లలోఁ బుట్ట దా ముత్తెము
చౌకైన విషలతనె జన్మించదా నిర్విషము
యే కడ మహానుభావు లెందు పుట్టిరేమి
చిడిపిరాళ్లఁ బుట్టనా చెలుపైన వజ్రములు
పుడమి నీగల వల్లఁ బుట్టదా తేనె
వెడఁగు బిల్లి మేనను వెళ్ళదాయనా జవ్వాది
వుడివోని పుణ్యు లెందు నుదయించి రేమి
పంకములోఁ బుట్టదా పరిమళపు దామెర
పొంకపుఁ గీటములందు పుట్టదా పట్టు
కొంకక శ్రీ వేంకటేశుఁ గొలిచిన దాసులు
సంకె లేని జ్ఞాను లెందు జనియించి రేమి

## 353. తానే కాకెవ్వరు

తానే కాకెవ్వరు మాకు దాతయు దైవము తన-
లోన బెట్టుకొని మాకు లోనైనవాడు

చదివించి కూడువెట్టి జారకుండ నిల్లుగట్టి
బెదరులేని బుద్ది పిన్న నాడె చెప్పి
యెదిరి నడిగి ద్రవ్యమిది గొమ్మనుచునిచ్చి
పదిలమై తమ్ము బాలించువాడు
మోహవియోగమ్ము మోహానురాగమ్ము
దేహ విభాగంబు దెలిపిన కలికి
ఐహికమున వేంకటాధీశుడై సర్వ
దేహ రక్షకుడై తిరుగుచున్నాడు

## 354. తిరువీధు లేగీని

తిరువీధు లేగీని దేవతలు జయవెట్ట
హరి వాడె పెండ్లికొడుకై ప్రతాపమున
కనకపు కొండవంటి ఘనమైన రథముపై
దనుజమర్దనుడెక్కె తరుణులతో
వినువీధిపడెగెలు వేవేలు కుచ్చులతోడ
పెనగొనగ కదలె భేరులు మ్రోయగను
వరుసచంద్రసూర్యులవంటి బండికండ్లతోడ
గరుడధ్వజుడొరసీ కడు దిక్కులు
పరగువేదరాసులే పగ్గాలు పట్టితియ్యగ
సరుగ దుష్టుల గొట్టి జయము చేకొనెను ॥
ఆటలు పాటలు వింటా నలమేల్మంగయు తాను
యీటుల శ్రీ వేంకటేశుడెదురులేక
వాటపుసింగారముతో వాకిట వచ్చి నిలిచీ
కోటాన కోటి వరాలు కొమ్మని ఇచ్చుచును ॥

## 355. తిరొతిరొ జవరాల

తిరొతిరొ జవరాల తిత్తి తిత్తి ఈ
తరలమైన నీ తారహార మదురే ॥





ధిమి ధిమ్మి తోంగ తొంగ దిద్ధిమిక్కి ఆరే
మమారే పాత్రారావు మజ్జా మజ్జా
కమలనాభుని తమకపుటింతి నీకు
అమరె తీరుపు ఇదె అవధరించగదో ॥
ఝుక జక్క జంఝుం ఝణకిణాని
ప్రకటపు మురువొప్పె భళాభళా
సకల పతికి సరసపు కొమ్మ నీ
మొకసిరి మెరసె చిమ్ముల మురిపెముల ॥
మాయిమాయి అలమేలు మంగనాచ్చారి మతి
బాయని వేంకటపతి పట్టపురాణి
మ్రోయ చిరుగజ్జెల నీ మ్రోతలానేని
సోయగమైన నీ సొలపు చూపమరె ॥

## 356. తుద సమస్తమును

తుద సమస్తమును దుర్లభమే
అదెసులభుడు మా హరి యొక్కడే
సురలును నరులును సొంపగు సిరులును
వొరసిన నిన్నియు నుపాధులే
నిరుపాధికుడును నిజకరుణానిధి
అరయగనిదె మా హరియొకడే
అందరి యీవులు అఖిల కర్మములు
అందగరాని ప్రయాసములే
యిందిరా రమణి నేసిన సేవిది
చెందరు సుజనులు చెప్పంగలరే
యితరోపాయము లేవి చూచినా
శ్రుతివిరహితములు శూన్యములే

రతిశ్రీవేంకట రమణునిమతియిది
హితపరిపూర్ణం బిదియేకటే

### 357. తెలియ చీకటికి

తెలియ చీకటికి దీపమెత్తక పెద్ద -
వెలుగులోపలికి వెలుగేల ॥
అరయ నాపన్నునికి అభయమీ్మవలెగాక
ఇరవైన సుఖిని కావనేల
వరతపోయెడివాని వడితీయవలెగాక
దరివాని తివియంగ తానేల ॥
ఘనకర్మారంభుని కట్లు విడవలెగాక
ఎనసిన ముక్తుని గావనేల
అనయము దుర్బలునికి అన్నమిడవలెగాక
తనిసిన వానికి తానేల ॥
మితిలేని పాపకర్మికి తా వలెగాక
హితవెఱుగుపుణ్యునికి (తా) నేల
ధృతిహీను కృపచూచి తిరువేంకటేశ్వరుడు
తతి కావకుండిన తానేల ॥

### 358. తొల్లింటి వలెగావు తుమ్మెదా

తొల్లింటి వలె గావు తుమ్మెదా ఇంక
వొల్లవుగా మమ్మునో తుమ్మెదా ॥
తోరంపు రచనల తుమ్మెదా కడు
దూరేవు గొందులే తుమ్మెదా
దూరినా నెరగవు తుమ్మెదా మమ్ము
వోరగా చూడకు వో తుమ్మెదా ॥





తొలి ప్రాయపు మిండ తుమ్మెదా కడు
తొలిచేవు చేగలే తుమ్మెదా
తొలకరి మెరుగునే తుమ్మెదా ఇంక
ఉలికేవు మముగని వో తుమ్మెదా ॥
దొరపు వేంకటగిరి తుమ్మెదా మా
తురుమేల చెనకేవు తుమ్మెదా
దొరకే నీ చనవులు తుమ్మెదా ఇంక
ఒకులెరింగిరిగద వో తుమ్మెదా ॥

### 359. దిబ్బలు వెట్టుచు

దిబ్బలు వెట్టుచు దేలిన దిదివో
ఉబ్బు నీటిపై నొక హంస ॥
అనువున కమల విహారమె నెలవై
ఒనరి యున్నదిదె ఒక హంస
మనియెడి జీవుల మానస సరసుల
వునికి నున్నదిదె ఒక హంస ॥
పాలు నీరు వేర్పఱచి పాలలో
నోల లాడెనిదె యొక హంస
పాలుపడిన యీ పరమహంసముల
ఓలి నున్న దిదె యొక హంస ॥
తడవి రోమ రంధ్రంబుల గ్రుడ్లను
ఉడుగక పొదిగీనొక హంస
కడు వేడుక వేంకటగిరి మీదట
నొడలు పెంచె నిదె యొక హంస ॥

### 360. దేవదుందుభులతోడ

దేవదుందుభులతోడ తేట తెల్లమైనాడు
సేవించరో యిదే వీడే సింగారదేవుడు ॥

బంగారుమేడలలోన పన్నీట మజ్జనమాడి
అంగముతడి యొత్తగా నదె దేవుడు
ముంగిట పులుకడిగిన ముత్తెము వలె నున్నాడు
కుంగని రాజసముతో కొండవంటి దేవుడు ॥
కాంతులు మించిన మాణికపు తోరణము కింద
అంతట కప్పురము చాతుకదె దేవుడు
పొంతల నమృతమే పోగైనట్టున్నవాడు
సంతతము సంపదల సరిలేని దేవుడు ॥
తట్టుపుణుగు నించుక దండిసొమ్ము లెల్లాబెట్టి
అట్టె అలమేల్మంగ నరుత గట్టి
నెట్టన నమ్మినవారి నిధానమై వున్నావాడు
పట్టపు శ్రీ వేంకటాద్రిపతియైన దేవుడు ॥

## 361. దేహినిత్యుడు

దేహినిత్యుడు దేహములు అనిత్యాలు
ఈహల నామనసా ఇది మరువకు మీ ॥
గుది పాతచీర మాని కొత్తచీర గట్టినట్టు
ముదిమేను మాని దేహి మొగి గొత్త మేనిమోచు
అదన చంపగలేవు ఆయుధమ్ము లీతని
కదిసి అగ్నియు నీరు గాలియు చంపగలేవు ॥
యీతడు నరకువడడు యీతడగ్ని కాలడు
యీతడు నీట మునుగడు యీతడు గాలిబోడు
చేతనుడై సర్వగతుడౌ చెలియించదేమిటను
యీతల ననాది యీతడిరపు గదలడు ॥
చేరికానరానివాడు చింతించరానివాడు
భారపు వికారాల పాసిన వాడీ ఆత్మ





ఆరయ శ్రీ వేంకటేశునాధీన మీతడని
సారము తెలియుటే సత్యం జ్ఞానము ॥

## 362. దొరకునా యితని కృప

దొరకునా యితని కృప తుది పదంబు
అరిది విభవము లొల్లమనినా పొదలు
సొంపలర నితడు కృప జూచుటరుదనికాక
యింపు సామాన్యమా ఇతని కరుణ
లంపటము ఘనమైన లక్ష్మీకటాక్షములు
సంపదలు తోడనే చల్లు వెదలాడు
తగనితనిపై భక్తి తగులుటరుదనికాక
వగుట సామాన్యమా ననిచి యితడు
జగదేక హితములుగ సరసతలు సౌఖ్యములు
దిగులువాయగ నితడు దిప్పుదీరాడు
తిరువేంకటాద్రి సిద్ధించుటరుదనికాక
మరుగదను నిచ్చునా మరియొకరిని
యిరవైన భోగములు యిష్ట సామ్రాజ్యములు
విరివిగొని యితని దయ వెంటనే తిరుగు

## 363. ధారుణీ పతికిని

ధారుణీ పతికిని తలంబ్రాలో బహు
దారా రతునకు తలంబ్రాలో
హేమ వర్ణునకు యిందిరాపతికి
దామోదరునకు తలంబ్రాలో
సామజ భయ రక్షకునకు తులసీ
ధామునకు హరికి తలంబ్రాలో

కలికి రుకిమిణికి కడు దమకించి
తలదైవనకు తలంబ్రాలో
మలసి సత్యభామకు పతి పంకజ
దలనేత్రునకును తలంబ్రాలో
తిరు వేంకటపతి దినపెండ్లిగల
తరుణుల పతికి తలంబ్రాలో
యిరవుగ బాయక యిందిర నురమున
ధరియించువారికి తలంబ్రాలో

## 364. నమామ్యహం

**(పెద తిరుమలాచార్య సంకీర్తన)**

నమామ్యహం మానవసింహం
ప్రమదాంక మహోబల నరసింహం ॥
దానవ దైత్య విదారణ సింహం
నానాయుధకర నరసింహం
భూ నభోంతరాపూరిత సింహం
ఆనన వహ్ని లయాంతక సింహం ॥
ప్రళయనృసింహం బహుముఖ సింహం
సలలిత గరుడాచల సింహం
కులిశనఖర ముఖ ఘోషిత సింహం
తిలకిత బహు రవిదీపిత సింహం ॥
శాంత నృసింహం శౌర్య నృసింహం
సంతత కరుణా జయసింహం
కాంతం శ్రీవేంకటగిరి సింహం
చింతిత ఘన సంసిద్ధి నృసింహం ॥





## 365. నందనందన వేణునాద

నందనందన వేణునాద వినోద, ము
కుంద కుంద దంతహాస గోవర్ధనధర ॥
రామరామ గోవింద రవిచంద్రలోచన
కామకామకలుష వికారవిదూర
ధామ ధామ విభవత్ప్రతాపరూప దనుజ ని-
ర్ధామధామకరణ చతుర భవభంజన ॥
కమల కమలావాస కమలారమణ దేవో-
త్తమ తమోగుణ సతత విదూర
ప్రమదత్ప్రమదాను భవ భావకరణ
సుముఖ సుధానంద శుభరంజనా ॥
పరమ పరాత్పర పరమేశ్వర
వరద వరదామల వాసుదేవ
చిరచిర ఘన నగ శ్రీవేంకటేశ్వర
నరహరినామ పన్నగ శయనా ॥

## 366. నాటికినాడే నాచదువు

నాటికి నాడే నాచదువు
మాట లాడుచును మరచేటి చదువు ॥
ఎనయ నీతని ఎఱుగుటకేపో
వెనకవారు చదివిన చదువు
మనసున నీతని మరచుట కేపో
పనివడి యిప్పటి ప్రౌఢలచదువు ॥
తెలిసి యితనినే తెలియుటకే పో
తొలుత గృతయుగాదుల చదువు

కలిగిన యీతని కాదననే పో
కలియుగంబులో కలిగిన చదువు ॥
పరమని వేంకటపతి గనుటకె పో
దొరలగు బ్రహ్మాదుల చదువు
సిరుల నితని మరచెడి కొరకేపో
విరసపు జీవుల విద్యల చదువులు ॥

## 367. నానా దిక్కుల నరులెల్లా

నానా దిక్కుల నరులెల్లా
వానలలోననె వత్తురు గదలి ॥
సతులు సుతులు పరిసరులు బాంధవులు
హితులు కొలువగా ఇందరును
శతసహస్రయోజనవాసులు సు-
వ్రతములతోడనె వత్తురు కదలి ॥
ముడుపులు జాళెలు మొగి తలమూటలు
కడలేని ధనము కాంతులును
కడు మంచిమణులు కరులు తురగములు
వడిగొని చెలగుచు వత్తురు కదలి ॥
మగుటవర్ధనులు మండలేశ్వరులు
జగదేకపతులు చతురులును
తగు వేంకటపతి దరుశింపగ బహు
వగల సంపదల వత్తురు కదలి ॥

## 368. నారాయణాయ నమో నమో

నారాయణాయ నమో నమో
నానాత్మనే నమో నమో
ఈ రచనలనే ఎవ్వరు తలచిన
ఇహపరమంత్రములిందరికి ॥





గోవిందాయ నమో నమో గోపాలాయ నమో నమో
భావజగురవే నమో నమో ప్రణవాత్మనే నమో నమో
దేవేశాయ నమో నమో దివ్యగుణాయ నమో నమో
ఈ వరుసలనే ఎవ్వరు తలచిన ఇహ పరమంత్రము లిందరికి ॥
దామోదరాయ నమో నమో ధరణీశాయ నమో నమో
శ్రీ మహిళా పతయే నమో నమో శిష్టరక్షణే నమో నమో
వామనాయ తే నమో నమో వనజాక్షాయ నమో నమో
ఈ మేరలనే ఎవ్వరు తలచిన ఇహపరమంత్రము లిందరికి ॥
పరిపూర్ణాయ నమో నమో ప్రణవగ్రాయ నమో నమో
చిరంతనా శ్రీ వేంకటనాయక శేషశాయినే నమో నమో
నరకధ్వంసే నమో నమో నరసింహాయ నమో నమో
ఇరవుగ నీగతి నెవ్వరు దలచిన ఇహపరమంత్రము లిందరికి ॥

## 369. నాలం వా తవ

నాలం వా తవ నయవచనం
చేలంత్యజతే చేటీ భవామి
చల చల మమ సంసద్ఘటనేకిం
కులిశ హృదయ బహుగుణ విభవ
పులకిత తను సంభృత వేదనయా
మలినం వహామి మదం త్యజామి
భజ భజతే ప్రియ భామాం సతతం
సుజన స్త్వం నిజ సుఖ నిలయ
భుజరేఖారతి భోగి భవసి కిం
విజయీభవ మద్విధిం వదామి
నయనయమా మను నయన విధంతే
ప్రియకాంతాయాం ప్రేమభవమ్

భయహర వేంకటపతే త్వం మ
త్ప్రియో భవసి శోభితా భవామి

## 370. నిద్దిరించీ పాల జలనిధి

నిద్దిరించీ పాల జలనిధి వలెనే
వొద్దిక రమణునికి వొత్తరె పాదములు
వేగుదాక చిత్తగించి విద్దె లెల్లనాదరించి
బాగుగా కృపారసము పంచి పంచి
యేగతి పవళించెనో యెట్ల భోగించెనో
యోగీంద్ర వరదుని నూచరె వుయ్యాలను
వాలుకన్నుల రెప్పల వడ దాకి తనుతావి
చాలుకొన్న నూర్పుకలు చల్లి చల్లి
నీలవర్ణపు గుణము నెరపుచునొకయింత
కాలము కన్నుల దిప్పీ కప్పరే దోమతెర
సరగున యోగనిద్ర చాలించి లోకమెల్ల
కరుణించదలచి వేంకటగిరిపై
అరుదుగ సకలలోకారాధ్యుడాయె మించి
విరివినాల వట్టాలు విసరరే సతులు

## 371. నిమిషమెడతెగక

(చిన తిరుమలాచార్య సంకీర్తన)

నిమిషమెడతెగక హరి నిన్ను తలచి
మమత నీ మేదనే మరపి బ్రతుకుటగాక ॥
నిదురచే కొన్నాళ్ళు నేరముల కొన్నాళ్ళు
ముదిమిచే కొన్నాళ్ళు మోసపోయి
కదిసి కోరినను గతకాలంబు వచ్చునే
మది మదినె యుండి ఏమరక బతుకుట గాక ॥





కడు తనయులకు కొంత కాంతలకు నొక కొంత
వెడయాసలకు కొంత వెట్టిసేసి
అడరి కావలెననిన అందు సుఖమున్నదా
చెడక నీ సేవలే సేసి బతుకుటగాక ॥
ధనమువెంట తగిలి ధాన్యంబునకు తగిలి
తనవారి తగిలి కాతరుడైనను
కను కలిగి శ్రీ వేంకటనాథ కాతువే
కొనసాగి నిన్ను నే కొలిచి బతుకుటగాక ॥

## 372. నీ కథామృతము

నీ కథామృతము నిరత సేవన నాకు
చేకొనుట సకలసుఖసేవనంబటు గాన ॥
ఇదియె మంత్రరాజము నాకు నేప్రొద్దు
నిదియె వేదసంహిత పాఠము
ఇదియె బహుశాస్త్రమెల్ల చదువుట నాకు
ఇదియె సంధ్య నాకిదియె జపమటు గాన ॥
ఇదియె బ్రహ్మవిద్యోపదేశము నాకు
ఇదియె దుఃఖవిరహితమార్గము
ఇదియె బహులోకహిత భేషజము నాకు
ఇదియె వుపనిషద్వాక్యపద్ధతి గాన ॥
ఇదియె దానఫలమియ్యజాలును నాకు
ఇదియె తపవిరహిత కర్మము
ఇదియె తిరువేంకటేశ్వరుని సంస్మరణ
ఇదియె యిదియె యిన్నియును నటు గాన ॥

## 373. నీడల చూపులు

నీడల చూపులు నీకేలే యీ
వాడక వాడెడి వడ నీకేలే ॥

నిలుపుల నటనలు నీకేలే, యీ
నిలుగుల నడపులు నీకేలే
నెలవుల కరఁగులు నీకేలే, యీ
కులికెడి నును సిగ్గులు నీకేలే ॥

నెఱుల చెదరులివి నీకేలే, యీ
నెఱవగు చదురులు నీకేలే
నెఱతనపు సిరులు నీకేలే, యిదె
చెఱఁగున మూసెదు సఖి నీకేలే ॥

నిక్కపు బొంకులు నీకేలే
నిక్కల గంటివి నీకేలే
నిక్కితి వొరపుల నీకేలే, యిదె
దక్కె వేంకటోత్తముఁడింకేలే ॥

## 374. నీవనగ నొకచోట

నీవనగ నొకచోట నిలిచివుండుటలేదు
నీవనుచు కనుగొన్న నిజమెల్ల నీవె ॥

తన యాత్మవలెనె భూతముల యాతుమలెల్ల
అనయంబు కనుగొన్న యతడే నీవు
తనుకన్నతల్లిగా తగ నితర కాంతలను
అనఘుడై మదిచూచు నతడే నీవు ॥

సతత సత్యవ్రతాచార సంపన్నుడై
అతిశయంబుగ మెలగు నతడే నీవు
ధృతి దూలి ద్రవ్యంబు తృణముగా భావించు
హతకాముకుండైన యతడే నీవు ॥

మోదమున సుఖదుఃఖములు నొక్కరీతిగా
ఆదరింపుచునున్న యతడే నీవు





వేదోక్తమతియైన వేంకటాచలనాథ
ఆదియును అంత్యంబు అంతయును నీవె ॥

## 375. నీవు తురగము మీద

నీవు తురగము మీద నేర్పుమెరయ
వేవేలు రూపములు వెదచల్లితపుడు

పదిలముగ నిరువంక పసిడి పింజలయంప
పొదల తరకసములొరపులు నెరపగా
గదయు శంఖంబు చక్రము ధనుః ఖడ్గములు
పదివేలు సూర్య బింబములైన వపుడు

సొరిది శేషుని పెద్దచుట్టు పెనుగే వడము
సిరిదొలక నొకచేత చిత్తగించి
దురమునకు తొడవైన ధూమకేతువు చేత
నిరవైన బల్లెమై ఏచెనందపుడు

కరకజడతో రమాకాంత జయలక్ష్మియై
తొరలి కౌగిటనిన్ను తొడికిపట్టి
చరచెవెను వేంకటస్వామి నిను గెలువమని
మెరుగు కుచకుంభముల మిసిమితో నపుడు

## 376. నీవె మాకు దిక్కు

నీవె మాకు దిక్కు నినే తలతుము
కావు మా నేర మెంచక కరుణానిధి

నెట్టన సూర్యుని లోని నెలకొన్న తేజమా
గట్టిగా చంద్రునిలోని కాంతి పుంజమా
పుట్టి రక్షించే యజ్ఞ పురుషుని ప్రకాశమా
వొట్టుగా దేవతలలో వుండిన శక్తి

సిరులు మించిని యట్టి జీవులలో ప్రాణమా
గరిమ వేదములలో గల యర్ధమా
పరమ పదమునందు పాదుకొన్న బ్రహ్మమా
చరాచరములలో సర్వాధారమా
జగములో వెలిగేటి సంసార సుఖమా
నిగిడిన మంత్రముల నిజ మహిమా
మిగుల శ్రీ వేంకటాద్రి మీది నున్న దైవమా
ముగురు వేల్పులలోని మూలకందమా

## 377. నీవేమి సేతువయ్యా

నీవేమి సేతువయ్యా నీవు దయానిధి వందువు
భావించలేని వారి పాప మింతే గాని
పరమపదమొసగి పాపమడచేనని
చరమశ్లోకము నందు చాటితివి తొలుతనె
నిరతిని భూమిలోన నీ వల్ల తప్పులేదు
పరగ నమ్మిన వారి పాప మింతే కాని
నీ పాదములకు నాకు నెయ్యమైన లంకెని
యేపున ద్వయార్ధమున నియ్యకొంటివి తొలుత
దాపుగా నీ వల్ల నింక తప్పులేదు యెంచిచూచి
పై పై నమ్మిన వారి పాపమింతే కాని
బంతి పురాణమును భక్త సులభుడనని
అంతరాత్మ లీమాట ఆడితివి తొలుతనే
ఇంతట శ్రీ వేంకటేశ యేమి సేతువయ్యా నీవు
పంతాన నమ్మిన వారి పాపమింతే కాని

## 378. నేడే నాగవెల్లి

నేడే నాగవెల్లి నేడే ఇల్లునింపులు
పోడిమి గోవిందపతి భోగించీ నిదివో ॥





అల్లదే దేవుని రథ మల్లదే గరుడ ధ్వజ –
మెల్ల లోకములు గెల్చి యేగీనదే
ఇల్లిదే లక్ష్మీ భూము లిద్దరు దేవుళ్ళు
చల్లేరు శాసలు తాము సరికి బేసికిని ॥
సేనాపతి అల్లవాడె చేరి దేవతలు వారె
శ్రీ నారాయణుడు చెలగీ నదే
ఆనుక అడుగడుగుకు ఆరగించీ వీధులను
వానలుగా అందరికి వరము లొసగుచు ॥
దేవదుందుభులు మ్రోసె దిక్కులెల్లాచల్లనాయె
శ్రీ వేంకటేశుడితడే చిత్తగించీని
సేవించరో భావించరో జీవులాల బ్రతుకుడు
వేవేలు శోభనముల వేడుకకాడితడు ॥

## 379. నేడె పెళ్ళివేళ

నేడె పెళ్ళి వేళ నేడె నాగవల్లి
ఆడుచు సోబాన పాడునరే చెలులు
కనకాంబరుడతడు కనక కుచగిరి యీకే
కొనబుల నిద్దరికి గూడె పొంతనము
వనజ నాభుడతడు వనజలోచని యీకే
ఘనమైన కంకణాలు కట్టరె చెలులూ
నీల వర్ణుడితడు నీల కుంతలి యీకే
చాలు కొని యిద్దరికి జంట తగును
అలరైన శంఖధరు డతడికే కంబుకంఠి
యీలీల నారతులు యెత్తరె చెలులూ
జలధిశాయి అతడు జలధికన్నిక యీకే
కలిగే నిద్దరికి నొక్క కైవాడము

అలరు శ్రీ వేంకటేశు డతడికే మహాలక్ష్మి
వెలయగల సిరి దీవించరె చెలులూ

## 380. నేనెందువోయే

నేనెందువోయే తానెందువోయీ రానీలే రానీలే రానీలే ॥
మీనైన నాటి తన మిడుకెల్ల దిగవలె కానీలే కానీలే కానీలే ॥
తలచూపేనాటి తలపెల్ల దిగవలె తలచనీ తలచనీ తలచనీవే ॥
కిరియైననాటి తన కిటుకెల్లదిగవలె తిరుగనీ తిరుగనీ తిరుగనీవే ॥
హరియైననాటి అదటెల్ల దిగవలె జరగనీ జరగనీ జరగనీవే ॥
వడుగైననాటి(తన) వస విడువంగవలె తడవకు తడవకు తడవకువే॥
కలుషించే నాటి కడమెల్ల దిగవలె అలుగనీ అలుగనీ అలుగనీవే॥
సతిబాసేనాటి చలమెల్ల దిగవలె తతిగానీ తతిగానీ తతిగానీవే ॥
ముసలైన నాటి ముసుపెల్ల దిగవలె విసుగనీ విసుగనీ విసుగనీవే॥
మానైననాటి మదమెల్ల దిగవలె పోనీవే పోనీవే పోనీవే ॥
కలికైననాటి గజరెల్ల దిగవలె చెలగనీ చెలగనీ చెలగనీవే ॥
వేడుకతో నాటి వేంకటపతి నన్ను కూడనీ కూడనీ కూడనీవే ॥

## 381. నేనే పో ఘనుడను

నేనే పో ఘనుఁడను నీ కంటెను
దానవారి నీవు నాకు దైవమవు గాన
నేరుపున నాకైతే నీ దిక్కుగలదు గాని
చేరి నీకావల దిక్కు చెప్పి చూపఁగలదా
ఆరయ నీవైతే నాకు నాధారముగలవు గా
నూరకే నీకాధారము వున్నదా యెక్కడను
నిన్నుఁ గొల్చిన సలిగె నేఁడు నాకుఁ గద్దు గాని
సన్నుతి నీకు నొకరి సలిగున్నదా





పెన్నిధి నిన్నుఁదలఁచే పేరు నాకుఁగద్దు గాని
వున్నదా నీకుఁదలఁచ నొకరిపేరైనను
ఈవులెల్ల నాకైతే నియ్యఁగలవుగాక
ఆవల నీ కీవులియ్య నన్యు లున్నారా
శ్రీ వేంకటేశ నాకు జీవాంతరాత్మవు నీవు
భావించనంతరాత్మ యప్పటి నీకు నున్నదా ?

## 382. నే నొక్కడ లేకుండితే

నే నొక్కఁడ లేకుండితే నీ కృపకుఁ బాత్ర మేది
పూని నావల్లనే కీర్తిఁ బొందేవు నీవు
అతి మూఢులలోన నగ్రేసరుఁడ నేను
ప్రతిలేని ఘనగర్వ పర్వతమను
తతిఁబంచేంద్రియముల ధనవంతుఁడను నేను
వెతకి నా వంటివాని విడువఁగఁ జెల్లునా
మహిలో సంసారపు సామ్రాజ్య మేలేవాఁడ నేను
యిహమునఁ గర్మవహి కెక్కితి నేను
బహుయోని కూపసంపదఁదేలేవాఁడ నేను
వహించుక నా వంటి వానిఁదేనోపేవా
భావించి నావంటి నీచుఁ బట్టి కాచినప్పుడుగా
యే వంక నీ కీర్తి గడు నెంతురు భువి
నా వల్ల నీకుఁ బుణ్యము నీ వల్లనే బ్రదుకుదు
శ్రీ వేంకటేశుఁడ యింత చేరెఁజుమ్మీ మేలు

## 383. నేలమిన్ను ఒక్కటైన

నేల మిన్ను ఒక్కటైన నీబంటు వొక్క –
వేలనే యక్షుని తెగవేసెగా నీ బంటు ॥

ఉంగరమెగరవేసి, యుదధిలో బడకుండ
నింగికిచేయిచాచె నీ బంటు
చంగున జలధిదాటి జంబుమాలి నిలమీద
కుంగదొక్కి పదముల కుమ్మెగా నీ బంటు ॥
వెట్టగా రావణు రొమ్మువిరుగ చేతనే గుద్దె
నిట్టతాడువంటి వాడు నీ బంటు
దిట్టయై మందులకొండ తేజమున నడురేయి
పట్టపగలుగ తెచ్చె బాపురే నీ బంటు ॥
అలర నన్నియు జేసి అజునిపట్టానకు
నిలుచున్నాడదివో నీ బంటు
బలువేంకటేశ ఈ పవననందనుడు
కలిగి లోకములెల్ల కాచెగా నీ బంటు ॥

## 384. పదియారు వన్నెల

పదియారు వన్నెల బంగారు కాంతులతోడ
పొదలిన కలశాపుర హనుమంతుడు ॥
ఎడమ చేతబట్టె నిదివో పండ్లగొలి
కుడిచేత రాకాసిగుంపుల గొట్టె
తొడిబడ నూరుపులతో తూరుపు మొగమైనాడు
పొడవైన కలశాపుర హనుమంతుడు ॥
తొక్కె అక్షకుమారుని తుంచి యడగాళ్ళ సంది
నిక్కించెను తోక ఎత్తి నింగి మోవను
చుక్కలు మోవ పెరిగి సుతువద్ద వేదాలు
పుక్కిటబెట్టె కలశాపుర హనుమంతుడు ॥
గట్టి దివ్యాంబరముతో కవచకుండలాలతో
పట్టపు శ్రీ వేంకటేశు బంటు తానాయె





అట్టె వాయువునకు అంజనిదేవికిని
పుట్టినాడు కలశాపుర హనుమంతుడు ॥

## 385. పరమ పాతకుడ

పరమ పాతకుడ భవ బంధుడ శ్రీ
హరినిను దలచనే నరుహుడనా
అపవిత్రుడనే నమంగళుడ కడు
నపగత పుణ్యుడ నలసుడను
కపట కలుష పరికర హృదయుడనే
నపవర్గమునకు అరుహుడనా
అతిదుష్టుడ నే నధిక దూషితుడ
హత వివేక మతి నదయుడను
ప్రతిలేని రమాపతి నినుదలచే
నతులగతికి నే నరుహుడనా
అనుపమ విషయ పరాధీనుడనే
ననంత మోహ భయాతురుడ
విను తింపగ తిరు వేంకటేశఘను
లనఘులుగాక నే నరుహుడనా

## 386. పరమయోగీశ్వరుల

పరమయోగీశ్వరుల పద్ధతి ఇది
ధరణిలో వివేకులు తలపోసుకొనుట ॥
మొదల నాత్మజ్ఞానము తెలిసి పిమ్మట
హృదయములోని హరినెరుగుట
వుదుటైన ఇంద్రియాల నొడిసి వంచుకొనుట
గుదిగొన్న తనలో కోరికెలుడుగుట ॥

తనపుణ్యఫలములు దైవము కొసగుట
పనివడి అతనిపై భక్తి సేసుట
తనివితో నిరంతర ధ్యానయోగ పరుడౌట
మనసుతో ప్రకృతి సమ్మంధము మరచుట ॥
నడుమ నడుమ విజ్ఞానపుకథలు వినుట
చిడుముడి నాచార్యసేవ సేయుట
ఎడయక శ్రీవేంకటేశు పై భారమువేసి
కడువైష్ణవుల కృప కలిగి సుఖించుట ॥

## 387. పరమాత్ముని

పరమాత్ముని నోరcబాడుచును ఇరు
దరులు గూడcగ దోసి దంచీ మాయ ॥
కొలcది బ్రహ్మాండపుc గుందెనలోన
కులుకు జీవులను కొలుచునించి
కలికి దుర్మోహపు రోకలివేసి
తలcచి తనువులను దంచీమాయ ॥
తొంగలి రెప్పల రాత్రులుcబగలును
సంగడి కన్నులుగా సరిcదిప్పుచు
చెంగలించి దిక్కులనే చేతులూచుచు
దంగుడు బియ్యాలుగా దంచీమాయ ॥
అనయము తిరువేంకటాదీశ్వరుని
పనుపడి తనలోc బాడుచును
వొనరి విన్నాణి జీవులనెడి బియ్యము
తనర నాతనికియ్య దంచీమాయ ॥

## 388. పరుల సేవలు చేసి

పరులసేవలు చేసి బ్రతికేరటా
సిరివరుదాసులు సిరులందు టరుదా ॥





కోరి వొక నరునిcగొలిచినవారలు
ధీరులై సలిగెలc దిరిగేరట
కూరిమి బ్రహ్మాండకోటులేలెడివాని-
వార లింతట జనవరులౌ టరుదా ॥
చేకొన్న తుమ్మిదచేపడ్డ కీటము-
లాకడ తుమ్మిదలయ్యీనట
శ్రీకాంతునిపాదసేవకులగువార-
లేకులజులయినా నెక్కుడౌ టరుదా ॥
ధరణీశునాజ్ఞల తమదేశములందు
సిరులనాణెపుముద్ర చెల్లీనట
తిరువేంకటాద్రి శ్రీదేవుని ముద్రలు
ధరియింపగా నింతట చెల్లుటరుదా ॥

## 389. పలుమరు వుట్ల

పలుమరు వుట్ల పండుగను
చిలుకు చిడుక్కని చిందగను ॥
ఊళ్ళ వీధుల వుట్ల కృష్ణుడు
తాళ్ళు తెగిపడ తన్నగను
పెళ్ళు కఠిల్లు పెఠిల్లు చిఠిల్లని
పెళ్ళుగ మ్రోసె పెనురవము ॥
బంగరు బిందెల పాలు పెరుగులు
ముంగిట నెగయుచు మోదగను
కంగు కళింగు కఠింగు ఖణింగని
రంగు మీరు పెను రవములై ॥
నిగ్గగ వేంకట నిలయుడుట్టి పా-
లగ్గలిక పగుల నడువగను

భగ్గు భగిల్లని పరమామృతములు
గుగ్గిలి పదనుగ కురియగను ॥

### 390. పలువిచారములేల

పలువిచారము లేల పరమాత్మ నీవునాకు
కలవు కలవు ఉన్న కడమ లేమిటికి ॥
నీ పాదముల చెంత నిబిడమైతే చాలు
యే పాతకములైన ఏమిసేసును
యేపార నీ భక్తి ఇంత గలిగిన చాలు
పైపై సిరులచ్చుట పాదుకొని నిలుచు ॥
సొరిది నీ శరణము జొచ్చితినంటే చాలు
కరుణించి యప్పుడట్టే కాతువు నీవు
సరుస నీ ముద్రలు భుజముల నుంటేచాలు
అరుదుగా చేతనుండు అఖిలలోకములు ॥
నేరక వేసినచాలు నీ మీద ఒక పువ్వు
కోరిన కోరికలెల్ల కొనసాగును
మేరతో శ్రీవేంకటేశ మిమ్ము గొలిచితి నేను
యేరీతి నుండినగాని యిన్నిటా ఘనుడను ॥

### 391. పంకజాక్షులు

పంకజాక్షులు సొలసి పలికి నగగాను
యింకా నారగించుము ఇట్ల నే అయ్యా
కలవంటకములు పులుగములు దుగ్ధాన్నములు
పలు దెరగులైన అప్పముల గములు
నెలకొన్న నేతులును నిరతంపు చక్కెరలు
గిలు కొట్టుచును ఆరగించవయ్యా





పెక్కువగు సైదంపు పిండివంటల మీద
పిక్కటిలు మెఱుగు బొడి బెల్లములును
వొక్కటిగ కలుపుకొని వొలుపు పప్పులతోడ
కిక్కిరియ నిటు ఆరగించవయ్యా
కడు మధురమైన మీగడ పెరుగులను మంచి
అది యాల వూరు గాయల రుచులతో
బడి బడిగ నవకంపు పళ్లెరంబుల తోడ
కడు నారగించు వేంకట గిరీంద్రా

### 392. పొడైన ఎరుకతో

పొడైన ఎరుకతో బంధమోక్షము లొక్క
గాడి గట్టుట తెలివి గానకే కాదా ॥
భావించి నిను పరబ్రహ్మమని వేదములు
వేవేలు విధుల మొరవెట్టగాను
కేవలపు నిన్ను తక్కిన దైవముల గూర్చి
సేవింపుటిది తప్పు సేయుటే కాదా ॥
సరిలేని నిను నుపనిషద్వాక్యములె పరా
త్పరుడవని నలుగడల పలుకగాను
వరుసతో పెక్కుదైవముల సంగడి నిన్ను
తొరల కొలుచుట మహాద్రోహమేకాదా ॥
ఎందుజూచిన పురాణేతిహాసములు నీ
చందమే అధికమని చాటగాను
కందర్ప జనక వేంకటగిరి స్వామీ నీ-
కందు వెఱగనిది యజ్ఞానమే కాదా ॥

### 393. పాపపుణ్యముల

పాపపుణ్యముల పక్వమిదెరుగను
నా పాలిటి హరి నమో నమో ॥

మానసవాచక మతకర్మంబుల
తానకముగ నీ దాసుడను
పూని త్రిసంధ్యల భోగభాగ్యముల
నానాగతులను నమో నమో ॥
వలనుగ జాగ్రత్ స్వప్నసుషుప్తుల
యిలలో నీకే హితభటుడ
వెలుపల లోపల వేళావేళల
నళినాక్షా నీకే నమో నమో ॥
పుట్టక తొలుతను పుట్టిన మీదట
అట్టె నీ శరణాగతుండ
గట్టిగ శ్రీ వేంకటపతి నీ కృప
నట్టనడుమైతి నమో నమో ॥

## 394. పాపినైన నాపాల గలిగి తోవ

పాపినైన నాపాలఁ గలిగి తోవ
చూపుమన్న నెందుఁ జూపరు
ధృతిదూలి జగమెల్లఁ దిరిగి వేసరితి
యితరామయముల కేఁగియేఁగి వేసరితి
గతిమాలి పరులపైఁ గనలి వేసరితి
మతిమాలి కులవిద్య మాని వేసరితి
విసిగి యాచారంబు విడిచి వేసరితి
పసచెడి ప్రియములు పలికి వేసరితి
కొసరి ద్రవ్యముపైఁ గోరి వేసరితి
కసుగంది లోలోనె కాఁగి వేసరితి
కోవిదులగువారిఁ గొలిచి వేసరితి
దైవములందరిఁ దడవి వేసరితి





శ్రీవేంకటేశుని సేవ మాని పట్టి
సేవలన్నియు నేఁ జేసి వేసరితి

## 395. పాలదొంగవద్ద వచ్చి

పాలదొంగ వద్ద వచ్చి పాడేరు తమ
పాలిటిదైవమని బ్రహ్మాదులు ॥
రోల గట్టించుక పెద్దరోలలుగా వాపోవు
బాలునిముందర వచ్చి పాడేరు
ఆలకించి వినుమని యంబరభాగమునందు
నాలుగు దిక్కుల నుండి నారదాదులు ॥
నోరనిండా జొల్లుగార నూగు ధూళిమేనితో
పారేటిబిడ్డని వద్ద పాడేరు
వేరులేని వేదములు వెంట వెంట చదువుచు
చేరిచేరి యింతనంత శేషాదులు ॥
ముద్దులు మోమునగార మూలమూలలదాగే
బద్దుల బాలునివద్ద పాడేరు
అద్దివో శ్రీ తిరువేంకటాద్రీశు డితడని
చద్దికి వేడికి వచ్చి సనకాదులు ॥

## 396. పుట్టు భోగులము

పుట్టు భోగులము నేము భువి హరిదాసులము
నట్టనడిమి దొరలు నాకియ్యవలెనా ॥
పల్లకీలు నందలాలు పడివాగె తేజీలు
వెల్లవిరి మహాలక్ష్మీ విలాసములు
తల్లి యాకె మగనినే దైవమని కొలిచేము
వొల్లఁగే మాకే సిరులు వొరులియ్యవలెనా ॥

గ్రామములు రత్నములు గజముఖ్య వస్తువులు
ఆమనిభూకాంతకు నంగభేదాలు
భామిని యాకె మగని ప్రాణధారి లెంకలము
వోమి మాకాతఁడే యిచ్చీ వొరులియ్యవలెనా ॥
పసగల పదవులు బ్రహ్మనిర్మితములు
వెస బ్రహ్మతండ్రి శ్రీవెంకటేశుఁడు
యెసఁగి యాతఁడే మమ్మునేలి యిన్నియునిచ్చె
వొసగిన మా సొమ్ములు వొరులియ్యవలెనా ॥

## 397. పుట్టెది దింతా

పుట్టెది దింతా బూటకంబులే
గట్టిమాయ హరి కానగ నీదు
ముక్కున నున్నది ముందటప్రాణము
యెక్కడ నమ్మేదిక తనువు
చుక్కలు మోచీ చూపులెదుటనే
నెక్కొను మతికిని నిలుకడ యేది
నాలుక నున్నది నానారుచులును
వేలా వేళకు వెరవేది
తోలున నున్నది దొరకని బ్రతుకిది
కాలంబెటువలె గడపేది
ఆతుమనున్నది అఖిల జ్ఞానము
ఘాతల నెటువలె గనియేది
శ్రీ తరుణీ పతి శ్రీ వేంకటపతి
ఆతని కొలిచితిమి అడ్డంబేది

## 398. పుడమి నిందరి

పుడమి నిందరిబట్టె భూతము కడు
పొడవైన నల్లని భూతము





కనిసివోడ మింగెది భూతము
పునుకవీపు పెద్ద భూతము
కనలి కవియు చీకటి భూతము
పొనుగు సోమపు మోము భూతము
చేటకాళ్ళ మించిన భూతము
పోటుదారల పెద్ద భూతము
గాటపు జడల బింకపు భూతము
జూటరి నల్లముసుగు భూతము
కెలసి బిత్తలేతిరిగేటి భూతము
పొలుపుదాంట్లు పెద్ద భూతము
బలుపు వేంకటగిరి పయి భూతము
పులుగుమీది మహా భూతము

## 399. పులకల మొలకల పున్నమ

పులకల మొలకల పున్నమ తోడనె కూడె
అలివేణి నీపతితో ఆడవే వసంతము ॥
మాటలు తీగెలు వారె మక్కువలు చిగిరించె
మూటల కొద్దీ నవ్వులు మొగ్గలెత్తెను
వాటపు జవ్వనానకు వసంతకాలమువచ్చె
ఆటదానవు పతితో ఆడవే వసంతము ॥
చెమట రసములూరె సిగ్గులు పూవక పూచె
తిమురు తరి తీపుల తేనెలుబ్బెను
క్రమమున తమకము గద్దియ మదనుండెక్కె
అమర నీపతితోడ ఆడవే వసంతము ॥
కదు గోరితాకులు కాయము కాయలుగాచె
బడినే కెమ్మోవిని పండు పండెను

ఎడలేక శ్రీ వేంకటేశుడిట్టె నిన్ను గూడె
అదరి నీపతి తోనె ఆడవె వసంతము ॥

## 400. పూజలందరుచేసేదే

పూజలందరుచేసేదే పుష్పయాగము
ఆజి నర్జునుడు చేసినది పుష్పయాగము ॥
మొదల శ్రీసతి చేతి మోహన కమలమే
పొదల నీ కెపుడును పుష్పయాగము
గుదిగొన మిమ్మిద్దరి గూడించే మరువిరులు
పొదిగి పూజించిన పుష్పయాగము ॥
మాలాకారుడిచ్చిన మధురలో పూదండ
పోలింప నీకు నదె పుష్పయాగము
కేలితో నారదుడొసగిన పారిజాతము
భూలోకమున నీకు పుష్పయాగము ॥
తొరలి అలమేల్మంగ తురుమున విరులే నీకు
పొరసి నీవురముపై పుష్పయాగము
సిరులతో మునులెల్ల శ్రీవేంకటాద్రీశ నీకు
పొరి పొరి జేసేరు పుష్పయాగము ॥

## 401. పెట్టని కోటిందరికి

పెట్టని కోటిందరికి పెండ్లి కొడుకు బొమ్మ
బెట్టీ నసురులకెల్ల పెండ్లికొడుకు
పెల్లగించి భూమెత్తి పెండ్లికొడుకు వాడె
పిల్ల గ్రోవిరాగాల పెండ్లికొడుకు
పెల్లైన యీవుల పెండ్లికొడుకు వాడె
పిల్ల దీపు పెన్నుద్ది పెండ్లికొడుకు





పించపు శిరసు పొగ పెండ్లికొడుకు గుం
పించి కోపగించీ పెండ్లికొడుకు
పెంచకప్పుడే పెరిగే పెండ్లికొడుకు వల
పించే చక్కని సిరి పెండ్లికొడుకు
పెంట పెరుగుల దొంగ పెండ్లికొడుకు భూమి
పెంటి పోతుల గూరిచె పెండ్లికొడుకు
పెంటులేని వేంకటగిరి మీదను వాడే
పెంట వెట్టుకున్న వాడు పెండ్లికొడుకు

## 402. పెరిగినాడు చూడరో

పెరిగినాడు చూడరో పెద్ద హనుమంతుడు
పరగి నానా విద్యల బలవంతుడు ॥
రక్కసుల పాలికి రణరంగ శూరుడు
వెక్కసపు ఏకాంగ వీరుడు
దిక్కులకు సంజీవి తెచ్చిన ధీరుడు
అక్కజమైనట్టి ఆకారుడు ॥
లలిమీరిన యట్టి లావుల భీముడు
బలు కపికుల సార్వభౌముడు
నెలకొన్న లంకా నిర్ధూమధాముడు
తలపున శ్రీరాము నాత్మారాముడు ॥
దేవకార్యముల దిక్కువరేణ్యుడు
భావింపగల తపః ఫల పుణ్యుడు
శ్రీవేంకటేశ్వర సేవాగ్రగణ్యుడు
సావధానుడు సర్వశరణ్యుడు ॥

## 403. పొలయలుక

పొలయలుక నిద్దరలు భోగించ దొరకొంటి
అలరవడి మేల్కొనవె అఖిలేశ్వర

తరుణిమైనపుడె పరితాపసూర్యుడు వొడిచె
వరుస చెలి కన్ను కలువలు మొగిసెను
మరుని సాయకపు తామరలు వికసించె
కరుణతో మేల్కొనవె కమలేశ్వర

కాంతనిట్టూర్పులను గాలియును నగ్నియును
వంత చెమటల వాన వరుణుండును
వింతలుగ నిన్ను సేవింతుమని యున్నారు
పంతమున మేల్కొనవె పరమేశ్వర

ఒడికముగ చెలిలోన నుదయరాగము వొడమె
వెడలెనదె పలుకు గోవిల రవములు
పడతి గూడితివి రవి పరవశంబికనైన
కడగి మేల్కొనవె వేంకటరమణుడ

## 404. బండి విరిచి పిన్నపాపలతో

బండి విరిచి పిన్నపాపలతో నాడి
దుండగీడు వచ్చె దోబూచి ॥

పెరుగు వెన్నలు ప్రియమున వే-
మరు ముచ్చిలించు మాయకాడు
వెరవున్నా (పున?) దన విధము దాచుకొని
దొరదొంగ వచ్చె దోబూచి ॥

పడుచు గుబ్బెత పరపుపై పోక
ముడి కొంగు నిద్రముంపునను
పడియు తా (?) వద్ద పవళించినట్టి
తొడుకుదొంగ వచ్చె దోబూచి ॥

గొల్లపల్లెలో యిల్లిల్లూచొచ్చి
కొల్లలాడిన కోడెకాడు





యెల్లయినా వేకంటేశుడు ఇదె
తొల్లిటిదొంగ వచ్చె దోబూచి ॥

## 405. బంగారు మేడలలోన

బంగారుమేడలలోన పరమాత్ముడువాడే
సింగారాలు మీద మీద సేయరే చెలులు ॥

తట్టుపుణుగులనూనె తగ నిండా నంటుకొని
గట్టిగా కస్తూరి అట కలివెట్టి
మట్టులేని పన్నీట మజ్జన మాడె నిదె
వెట్టదీర నిందరును విసరరే చెలులు ॥

కప్పురంపు గందవొడి కదునిట్టె మెత్తుకొని
కొప్పుదువ్వి ముడిచెను గొజ్జంగలెల్లా
తెప్పలుగా నించుకొనె తిరుమేన సొమ్ములెల్లా
దప్పిదీర విడెమీరే తలకొని చెలులు ॥

అలమేలు మంగను వురమందు నిట్టెనించుకొని
తులసిదండలుమోచె నిలువునను
చెలరేగి ఆరగించె శ్రీవేంకటేశ్వరుడు
కొలువున్నాడు మోహాలు గుప్పరే చెలులు ॥

## 406. భారకు డతడే

భారకు డతడే బంధువుడతడే
చేరితి మతనినే చెంచెల మేలా

చెనకు నాయుధము చేత కలిగితే
ఘన నిర్భయుడై కడగీ నట్ల
అనంతాయుడు ఆతుమ నుండగ
వెనుగొని యెందుకు వెఱవగ నేలా

భువినొక రాజును పొందుగ కొలిచిన
యివల నచ్చికం బెరగడట
భువన రక్షకుడే పొదిగొని యేలగ
వివరించి యొరుల వేడగనేలా
తోవ నిదానము దొరికిన యప్పుడే
యేవిధములు మరి యెంచడట
శ్రీ వేంకటపతి చేకొని కావగ
భావన నితరో పాయము లేలా

## 407. భారమై వేపమాను

భారమై వేపమాను పాలు పోసి పెంచినాను
తీరని చేదే కాక తియ్య నుండేనా
పాయదీసి కుక్కతోక బద్దలు వెట్టి బిగిసి
చాయ కెంతకట్టినాను చక్క నుండేనా
కాయపు వికారమిది కలకాలము చెప్పినా
పోయిన పోకలేకాక బుద్ధివినీనా
ముంచి ముంచి నీటిలోన మూల నానబెట్టుకొన్న
మించిన గొడ్డలినేడు మెత్తనయ్యీనా
పంచ మహాపాకాల బారిబడ్డ చిత్తమిది
దంచి దంచి చెప్పినాను తాకి వంగీనా
కూరిమితో తేలు తెచ్చి కోకలోన బెట్టుకొన్నా
సారె సారె కుట్టుగాక చక్కనుండేనా
వేరులేని మహిమల శ్రీ వేంకట విభుని కృప
ఘోరమైన ఆస మేలు కోరసోకినా

## 408. భోగీంద్రులనుమీరు

భోగీంద్రులనుమీరు పోయిరండు
వేగన మీదటి విభవాలకు॥





హరుడ పోయిరా అజుడ నీవును బోయి
తిరిగి రా మీదటి తిరుణాళ్ళకు
సురలు మునులును భూసురలు పోయిరండు
అరవిరి నిన్నాళ్ళ అలసితిరి ॥
జముడ పోయిరా శశియు నీవును పోయి
సుముఖుడవై రా సురల గూడి
గుములై దిక్పతులు దిక్కులకు పోయిరండు
ప్రమదాన నిన్నాళ్ళు బడలితిరి ॥
నారద సనక సనందనాదులు
భూరి విభవముల పోయి రండు
దూరముగా పోకిట్టే తొరలి వేంకటగిరి
చేరి నన్నిట్లనే సేవించుడీ ॥

## 409. మతంగ పర్వతమాడ

మతంగ పర్వతమాడ మాల్యవంతము నీడ
అతిశయిల్లిన పెద్ద హనుమంతుడితడా
యీతడా రాముని బంటు యీతడా వాయు సుతుడు
ఆతత బలాఢ్యు డందురాత డితడా
సీతను వెదకి వచ్చి చెప్పిన యాతడ డితడా
ఘాతల లంకలోని రాక్షసవైరి యితడా
అంజనా సుతుడితడా అక్షమర్దనుడితడా
సంజీవనికొండదెచ్చె సారె నితడా
భంజించె కాలనేమిని పంతమున నితడా
రంజిత ప్రతాపకపిరాజ సఖుడితడా
చిరంజీవి యీతడా జితేంద్రియుడితడా
సురలకుపకార చుట్ట మీతడా

నిరతి శ్రీ వేంకటాద్రిని విజయనగరములో
నరిది వరములిచ్చీ నందరికి నితడా

## 410. మత్స్య కూర్మ వరాహ

మత్స్య కూర్మ వరాహ మనుష్యసింహ వామనా
యిచ్చ రామ రామ రామ హితబుద్ధికలికి
నన్నుగావు కేశవా నారాయణ మాధవ
మన్నించు గోవింద విష్ణు మధుసూదన
వన్నెల త్రివిక్రమా వామనా శ్రీధరా
సన్నుతించె హృషీకేశ సారెకు పద్మనాభ ॥
కంటిమి దామోదర సంకరుషణ వాసుదేవ
అంటేజాలు ప్రద్యుమ్నుడా అనిరుద్ధుడా
తొంటే పురుషోత్తమ అధోక్షజ నారసింహమా
జంటవాయకు మచ్యుత జనార్ధన ॥
మ్రొక్కేము వుపేంద్ర హరిమోహన శ్రీకృష్ణరాయ
యెక్కితి శ్రీవేంకట మిందిరానాధ
యిక్కువ నీ నామములు యివియే నాజపములు
చక్కగా నీ దాసులము సర్వేశ అనంత ॥

## 411. మనసిజ సముద్ర

మనసిజ సముద్ర మధనమిదె
కనుగొను మింతటకాంతుడ నీవు ॥
సతిచింతామతి జలనిధి తరువగ
అతి గరళపు విరహము వొడమె
తతి నాపిమ్మట తమకపు కోర్కుల
లతల కల్పకపు లాకలు వొడమె ॥





పొలతి కూరిములు పొంగులు పొంగగ
పులకల తారలు వొడమెనవె
ఫలమై సాత్త్వికభావపు చంద్రుడు
నిలువున వొడమగ నేరుపులలరె ॥
సుదతి తానె నీ చొక్కపు కాగిట
అదనున నిందిరయై పొడమె
కదిసిన శ్రీవేంకటపతి నీదెస
అధరామృతమయ్యతివకు పొడమె ॥

## 412. మరలి మరలి జయమంగళము

మరలి మరలి జయమంగళము
సొరిదినిచ్చలును శుభమంగళము ॥
కమలారమణికి కమలాక్షునకును
మమతల జయజయమంగళము
అమరజననికిని అమరవంద్యునకు
సుమాహూర్తముతో శుభమంగళము ॥
జలధికన్యకును జలధిశాయికిని
మలయుచును శుభమంగళము
కలిమికాంత కాకలికి విభునికిని
సులువుల యారతి శుభమంగళము ॥
చిత్తజు తల్లికి శ్రీ వేంకటపతికి
మత్తిల్లిన జయ మంగళము
యిత్తల నత్తల యిరువురకాగిటి
జొత్తుల రతులకు శుభమంగళము ॥

## 413. మఱి యెందూ గతిలేదు

మఱి యెందూ గతిలేదు మనుప నీవే దిక్కు
జఱసి లక్ష్మి నీ శరణమె దిక్కు

భవ సాగరంబులో పడి మునిగిన నాకు
తివిరి నీ నామమను తేపయె దిక్కు
చివికి కర్మంబనెడి చిచ్చు చొచ్చిన నాకు
జవళి నాచార్య కృపాజలధియె దిక్కు
ఘన మోహ పాశములు గాలి బొయ్యెడినాకు
కొనల నీపాద చింత కొమ్మయె దిక్కు
కనలి మనసనెడి ఆకసమున నున్న నాకు
కనుకొనగ నీ దాస్య గరుడడె దిక్కు
మరిగి సంసారమనెడి మంటి కిందడి నాకు
ధర భక్తి యను బిల ద్వారమె దిక్కు
యిరవైన శ్రీ వేంకటేశ యిన్నిటానాకు
నరుదైన నీవంతరాత్మవే దిక్కు

## 414. మర్దమర్ద

మర్ద మర్ద మమబంధాని
దుర్దాంత మహాదురితాని ॥
చక్రాయుధ రవిశతతేజోంచిత
సక్రోధ సహస్ర ప్రముఖా
విక్రమక్రమా విస్ఫులింగకణ
నక్రహరణ హరినవ్యకరాంకా ॥
కలిత సుదర్శన కఠిన విదారణ
కులిశ కోటి భవ ఘోషణా
ప్రళయానల సంభ్రమ విభ్రమకర
రళితదైత్యగళ రక్తవికిరణా ॥
హితకర శ్రీ వేంకటేశ ప్రయుక్త
సతతపరాక్రమ జయంకర





చతురోహం తే శరణం గతోస్మి
ఇతరాన్ విభజ్య ఇహ మాం రక్ష ॥

## 415. మఱచితిమంటే

మఱచితిమంటే మరిలేదు
తఱితో తలచవో దైవము మనసా
పుట్టుచు నున్నది పోవుచు నున్నది
పట్టపు జీవులె ప్రపంచము
నట్ట నడుమనే నరహరి నామము
గుట్టున తలచవో గొన కొని మనసా
పొద్దు వొడుచునదె పొద్దు కుంగునదె
తిద్దిన జగముల దిన దినము
అద్దపు నీడల అంతర్యామిని
వొద్దనె తలచవో వొనరగ మనసా
లోపల వెలుపల లోగొని వున్నది
శ్రీపతి మహిమల సృష్టియిదే
యేపున శ్రీ వేంకటేశ్వరు డితడే
దాపని నమ్ముచు తలచవో మనసా

## 416. మంగళము గోవిందునకు

మంగళము గోవిందునకు జయమంగళము గరుడ ధ్వజునకు
మంగళము సర్వాత్మునకు ధర్మ స్వరూపునకూ జయ జయ
ఆదికి నాదైన దేవునకు అచ్యుతునకంభో జనాభునకు
ఆది కూర్మంబైన జగదాధార మూర్తికిని
వేద రక్షకునకును సంతత వేదమార్గ విహారునకు బలి
భేదికిని సామాది గానప్రియ విహారునకు

హరికి పరమేశ్వరునకును శ్రీధరునకు కాలాంతకునకును
పరమ పురుషోత్తమునకును బహు బంధ దూరునకు
సురముని స్తోత్రునకు దేవాసుర గణశ్రేష్ఠునకు కరుణా
కరునకును కాత్యాయనీనుత కలితనామునకు
    పంకజాసన వరదునకు భవ పంక విచ్ఛేదునకు భువునకు
    శంకరునకు అవ్యక్తునకు ఆశ్చర్య రూపునకు
    వేంకటాచల వల్లభునకును విశ్వమూర్తికి నీశ్వరునకును
    పంకజా కుచ కుంభ కుంకుమ పంకలోలునకు

## 417. మందరధర మధుసూదన

మందరధర మధుసూదన
నందగోపనందనా ॥
    నరసింహ గోవింద నవనీతానంద
    హరిముకుంద నయనారవింద
    కరివరద గరుడగమనరూప
    గురుచాపా యదుకులదీపా ॥
భవదూర భయహర పరిపూర్ణామృత
భవనపాలన సురపాలన
భువనభూషణ పరమపురుష పురాతన
నవభోగా కరుణాయోగా ॥
    పంకజాసననుత భవ్యనిర్మలపాద -
    పంకజ పరమ పరాత్పర
    వేంకటశైలనివేశ శు-
    భంకరా క్షేమంకరా ॥

## 418. మాధవ భూధవ

మాధవా భూధవ మదన జనక
సాధు రక్షణ చతుర శరణు శరణు





    నారాయణాచ్యుతానంత గోవిందశ్రీ
    నారసింహ కృష్ణ నాగశయన
    వరాహ వామన వాసుదేవ మురారి
    శౌరి జయ జయతు శరణు శరణు
పుండరీకేక్షణ భువన పూర్ణగుణ
అండజ గమన నిత్య హరి ముకుంద
పండరి రమణ రామ బలరామ రామకృష్ణ
చండ భార్గవరామ శరణు శరణు
    దేవదేవోత్తమ దివ్యావతార నిజ
    భావ భావనా తీత పద్మనాభ
    శ్రీవేంకటాచల శృంగారమూర్తి నవ
    సావయవ సారూప్య శరణు శరణు

## 419. మాయా మోహము

మాయామోహము మానదిది
శ్రీయచ్యుత నీచిత్తమే కలది
    యెంత వెలుఁగునకు నంతేచీఁకటి
    యెంత సంపదకు నంతాపద
    అంతటా నౌషధ మపథ్యమును సరి
    వింతే మిగిలెను వేసటే కలది
చేసినకూలికి జీతమునకు సరి
పూసినకర్మభోగము సరి
వాసులజన్మము వడి మరణము సరి
ఆసల మిగిలిన దలపే కలది
    మొలచినదేహము ముదియుటకును సరి
    తలఁచినదైవము తనలోను

యిలలో శ్రీవేంకటేశ నీ కరుణ
గలిగినమాకెల్ల ఘనతే కలది

### 420. మిన్నకవేసాలుమాని

మిన్నకవేసాలుమాని మేలుకోవయ్య
సన్నల నీ యోగనిద్రచాలు మేలుకోవయ్యా ॥
ఆవులు పేయలకుగా నరచీ పిదుకవలె
గోవిందుడా ఇక మేలుకొనవయ్య
ఆవలీవలి పడుచులు ఆటలుమరిగివచ్చి
త్రోవగాచుకున్నారు ప్రొద్దున మేలుకోవయ్య ॥
వాడల గోపికలెల్లా వచ్చి నిన్ను ముద్దాడ
కూడియున్నారిదే మేలుకొనవయ్యా
తోడనే యశోద గిన్నెతో పెరుగువంటకము
ఈడకు తెచ్చిపెట్టె నింక మేలుకోవయ్య ॥
పిలిచీ నందగోపుడు పేరుకొని అదె, కన్ను-
కొలుకులు వచ్చి (ఇంక) మేలుకొనవయ్య
అలరిన శ్రీ వేంకటాద్రిమీది బాలకృష్ణ
ఇల మా మాటలు వింటివింక మేలుకోవయ్య ॥

### 421. మూడే మాటలు

మూడే మాటలు మూడు మూండ్లు తొమ్మిది
వేడుకొని చదువరో వేదాంత రహస్యము
జీవ స్వరూపము చింతించి యంతటాను
దేవుని వైభవము తెలిసి
భావించి ప్రకృతి సంపదయుదియెఱుగుటే
వేవేలు విధముల వేదాంత రహస్యము





తనలో విజ్ఞానము తప్పకుండా తలపోసి
పనితో నందువల్ల భక్తి నిలిపి
మనికిగా వైరాగ్యము మఱవకుండుటే
వినవలసినయట్టి వేదాంత రహస్యము
వేడుకతో నాచార్య విశ్వాసము గలిగి
జాడల శరణాగతి సాధనముతో
కూడి శ్రీ వేంకటేశ్వరు గొలిచి దాసుడౌటే
వీడని బ్రహ్మానంద వేదాంత రహస్యము

### 422. మూలమూల నమ్ముడు

మూలమూల నమ్ముడు చల్ల ఇది
రేలు పగలు కొనరే చల్ల ॥
పిక్కటిల్లు చన్నుల గుబ్బెత వొకతి కదు
చక్కనిది చిలికిన చల్ల
అక్కున చెమటగార నమ్మీని ఇది
ఎక్కడ పుట్టదు కొనరే చల్ల ॥
వడచల్లు మేని జవ్వని వొకతి కదు
జడియుచు చిలికిన చల్ల
తడబడు కమ్మని తావులది మీ-
రెడయ కిపుడు కొనరే చల్ల ॥
అంకుల కరముల వొయ్యారొకతి కదు
జంకెనల చిలికిన చల్ల
వేంకటగిరిపతి వేడుకది
ఇంకానమ్మీ కొనరే చల్ల ॥

### 423. మెరుగువంటిది

మెరుగు వంటిది అలమేలుమంగ
అరిమురి నవ్వీని అలమేలుమంగ ॥

పలుచని యెలుగున పాడీ నీమీద పాట
మెలుపు కూరిమి నలమేలు మంగ
చెలులతో నీ సుద్ది చెప్పి చెప్పి కరగీని
అలయుచు సొలయుచు నలమేలుమంగ ॥
యీడుగా నీ రాకకు నెదురెదురు చూచీ
మేడమీద నుండి యలమేలు మంగ
వాడు మోముతో నీపై వలపు చల్లి చల్లి
ఆడీ నాట్యము సారె నలమేలు మంగ ॥
పేరుకొని పిలిచీని ప్రియములు చెప్పి చెప్పి
మేరమీర నిన్ను నలమేలు మంగ
యీరీతి శ్రీవేంకటేశ నిన్ను గూడె నేడు
ఆరితేరి నన్నిటాను అలమేలుమంగ ॥

## 424. మేలుకొనవే

మేలుకొనవే నీల మేఘ వర్ణుడా
వేల తప్పకుండాను శ్రీ వేంకటేశుడా
మంచముపై నిద్రదేర మల్లెల వేసేరు
మించి తురుము ముడువ మొల్లల వేసేరు
కంచము పొత్తారగించ కలువల వేసేరు
పించెపు చిక్కుదేర సంపెంగల వేసేరు
కలసిన కాకదేర గన్నేరుల వేసేరు
వలపులు రేగి విరజాజుల వేసేరు
చలువగా వాడుదేర జాజుల వేసేరు
పులకించ గురువింద పూవుల వేసేరు
తమిరేగ గోపికలు తామరల వేసేరు
చెమటార మంచి తులసిని వేసేరు





అమర శ్రీ వేంకటేశ అలమేలు మంగ నీకు
మమత పన్నీటిలో చేమంతుల వేసేరు

## 425. మేలుకో శృంగారరాయ

(పెద తిరుమలాచార్య సంకీర్తన)

మేలుకో శృంగారరాయ మేటి మదనగోపాల
మేలుకోవె నాపాలి మించిన నిధానమా ॥
సందడించే గోపికల జవ్వన వనములోన
కందువదిరిగే మదగజమవు
యిందుముఖి సత్యభామ హృదయ పద్మములోని
గంధము మరిగినట్టి గండు తుమ్మెద ॥
గతిగూడి రుక్మిణికౌగిటి పంజరములో
రతిముద్దుగులికేటి రాచిలుకా ॥
సతులు పదారువేల జంట కన్ను కలువలకు
ఇతవై పొడిమిన నా యిందు బింబమా ॥
వరుస కొలనిలోని వారి చన్ను కొండలపై
నిరతి వాలిన నా నీలమేఘమా
సిరినురమున మోచి శ్రీ వేంకటాద్రి మీద
గరిమ వరాలిచ్చే కల్పతరువా ॥

## 426. మొక్కరో పరుషలు

మొక్కరో పరుషలు మోహన మూర్తికి
వెక్కసమగు శ్రీ వేంకట పతికి
హరి రథమదె ముందరి నొగలదివో
గరుడు ధ్వజ మదె ఘంటలవే
సరి దిరిగేటి కాంచన చక్రములవే
తిరువీధుల నే తెంచీ నిదివో

తేరు పడగలవే తెల్ల గొడుగులవే
తోరణంబులవే సారథి వాడే
ధీరతకట్టిన దివ్య హయములవే
మేరువు వలనే మెరసీ నిదివో
పసిడి కుండలవే పట్టు కుచ్చులవే
వెస నడుమ వాడే శ్రీ వేంకటేశుడు
యొసగి యురమునను యిదె అలమేల్మంగ
వసుధ పెండ్లికొడుకు వచ్చీనిదివో

## 427. యజ్ఞమూర్తి యజకర్త

యజ్ఞమూర్తి యజకర్త యజ్ఞభోక్త విన్నిటాను
యజ్ఞాది ఫలరూప మటునీవై వుండవే
పరికించ జీవులకు ప్రాణమవైన నీకు
నిరతిప్రాణ ప్రతిష్ఠ నేము సేసే మా
మరిగి మా పూజలంది మమ్ము గాచుట కొరకు
హరి నీ మూర్తి ప్రాణమావహించవే
జగతికి నీపాద జలమే సంప్రోక్షణ
జిగి నీకు సంప్రోక్షణ సేయు వారమా
పగటున నన్ను నీవు పావనము సేయుటకు
అగు పుణ్య తీర్థముల అభిషేక మందవే
వేదములు తెచ్చిన శ్రీ వేంకటేశ నేమునీకు
వేద మంత్రముల పూజానిధి సేసే మా
యీ దెస నీదాసులమైన మముగాచుటకొరకు
వేదమూర్తి యిందే విచ్చేసి ఉండవే

## 428. యోగి భోగి నటనం

యోగి భోగి నటనం కురు వుల్లాసాననమోహన
సాగరోద్భవ కన్యకాపతి సారస శ్రీ వేంకటగియోగి





లీలా నక్షత్ర జాలాధి కరండ
మాలాత్రై విక్రమాకార యోగి
హాలాహలకర కోలాహలకర
శూలాధాయుధవంద్య పరిపూర్ణ యోగి
కాళీవినుత ప్రహేళి చరితాహి
మౌళి ఘనసార విన్యస్త యోగి
గరుడ పక్షి వాహ గమన విహారి
గురునాగశైలేశ గోరక్కురే
మురళీనాద శృంగ మోహన మురారిరే
కరుణానంద సాగర శాయిరే
పరమ శ్రీ వేంకటపతి యవతార
నరరూప గోపికానాథ గోరక్కురే

## 429. రచ్చ కెక్కివితివి

రచ్చకెక్కివితివి పండరంగి విఠలా
వచ్చితీరే వింతలోనె పండరంగి విఠలా
గుట్టుగల దొరవని కొసరి కూడినంతనే
రట్టు నవ్వేవు పండరంగి విఠలా
మట్టుమీరి తమకపు మాటలనే నీ వలపు
బట్ట బయలు సేసేవు పండరంగి విఠలా
తతి నీవున్నచోటికి దగ్గర వచ్చినంతనే
రతికూడితివి పండరంగి విఠలా
గతియైన శ్రీ వేంకటనాథ యేలితివి
పతివై కోవెల కుంట్ల పండరంగి విఠలా

## 430. రమణుడు పిలిచీని

రమణుడు పిలిచీని రావే చెలియ నీవు
తమకమె వలె గాక తరుణులకు ॥

తలపుకొలది మంచితనమే వలె గాక
చలపాదితనమేల సరసులకు
వెలలేని మాటల వినయమె వలెగాక
సొలపు వెంగము లేల సుగుణలకు ॥

కోటిసేయ వలపులు కుమ్మరించవలెగాక
నీటుతో గర్వములేల నేర్పరులకు
మేటిసరసము లాడి మెఱయగవలె గాక
జూటుదనము లేటికి సొంపుదొరలకును ॥

నయగారితనమున నవ్వు నవ్వవలెగాక
రయమున దాగనేల రసికులకు
నియతి నన్నేలినాడు నేడు శ్రీవేంకటేశుడు
క్రియతో వేసరనేల కిమ్ముల దేవుళ్లకు ॥

## 431. రాధా మాధవ

రాధా మాధవ రతి చరితమితి
బోధావహం శృతి భూషణం

గహనే ద్వావపి గత్వా గత్వా
రహసి రతిం ప్రేరయతి సతి
విహర తః స్తదా విల సంతౌ
విహత గుహాశౌ వివశౌ తౌ

అవనత శిరసావృతి శుభగం
వివిధాలాపైర్వివ శయతి
జనయతి పవనే సపదివికారం
వనితా పురుషౌ జనితారౌ

వనకుసుమ విశద వరవాస నయా
ఘనసార రజో గంధైశ్చ





జనయితి పవనే సపది వికారం
వనితాపురుషౌ జనితారౌ

యేవం విచరన్ హేలా విముఖః
శ్రీ వేంకటగిరి దేవోయం
పావనరాధా పరిరంభసుఖ
శ్రీవైభవ సుస్థిరో భవతి

## 432. రామభద్ర రఘువీర

రామభద్ర రఘువీర రవివంశ తిలక నీ
నామమే కామధేనువు నమో నమో ॥

కౌసల్యానందవర్ధన ఘనదశరథసుత
భాసుర యజ్ఞరక్షక భరతాగ్రజ
రాసికెక్క కోదండ రచన విద్యా గురువ
వాసితో సురలు నిను వడి మెచ్చేరయ్యా ॥

మారీచసుబాహు మర్దన తాటకాంతక
దారుణవీరశేఖర ధర్మపాలక
కారుణ్య రత్నాకర కాకాసుర వరద
సారెకు వేదవిదులు జయవెట్టేరయ్యా ॥

సీతారమణ రాజశేఖర శిరోమణి
భూతలపుటయోధ్యాపుర నిలయా
యీతల శ్రీవేంకటాద్రి నిరవయిన రాఘవా
ఘాత నీ ప్రతాపమెల్ల కడునిండెనయ్యా ॥

## 433. రామ రామ రామకృష్ణ

రామ రామ రామకృష్ణ రాజీవలోచన నీకు
దీము వంటి బంటననే తేజమే నాది ॥

వారధి దాటి మెప్పించ వాయుజడనే గాను
సారె చవుల మెప్పించ శబరిగాను
బీరాన సీత నిచ్చి మెప్పించ జనకుండగాను
ఏరీతి మెప్పింతు నన్నెట్లా గాచేవో ॥
ఘనమై మోచి మెప్పించ గరుడుడనే గాను
కొన కామసుఖమిచ్చు గోపిక గాను
వినుతించి మెప్పించ వేయినోళ్ళ భోగిగాను
నిన్నెట్లు మెప్పించు నన్ను గాచే దెట్లా ॥
నవ్వుచు పాడి మెప్పించ నారదుడనే గాను
అవ్వల ప్రాణమీయ జటాయువు గాను
ఇవ్వల శ్రీ వేంకటేశ యిటునీకె శరణంటి
అవ్వల నా తెరువిదే రక్షించే దెట్లా ॥

## 434. రామా ధశరథరామా

రామ దశరథరామా నిజ సత్య-
కామ నమో నమో కాకుత్థ్సరామ ॥
కరుణానిధి రామ కౌసల్యానందన రామ
పరమ పురుష సీతాపతిరామ
శరధి బంధన రామ సవన రక్షక రామ
గురుతర రవివంశ కోదండ రామ ॥
దనుజహరణ రామ దశరథసుతరామ
వినుతామర స్తోత్ర విజయరామ
మనుజావతారా రామ మహనీయ గుణరామ
అనిలజప్రియ రామ అయోధ్యరామ ॥
సులలితయశరామ సుగ్రీవ వరద రామ
కలుష రావణ భయంకర రామ





విలసిత రఘురామ వేదగోచర రామ
కలిత ప్రతాప శ్రీ వేంకటగిరి రామ ॥

## 435. రారా చిన్నన్న

రారా చిన్నన్న రారోరి చిన్నవాడ
రారా ముద్దులాడ రారోరి బాలకృష్ణ
కింది చూపుల గిలిగించి ఆలమంద గొల్లెతల మరిగించి
సందడి వలపించి జవరాండ్ల పూర విందు వైనట్టి వేడుకకాడ
కొదలు మాటలనె గొణగుచు భూమి సుదతుల శిగ్గులు చూరాడి
చిదుగుచేతలనె చెనకుచు ముద్దు పెదవి చవులు చూపిన జాణకాడ
కలికి తనముననె కరిగించికాచె చెలుల కాకిటనె చెలగి
లలనామణియైన లకిమమ్మ కలసుక శ్రీ వేంకటనాథుడైవాడ

## 436. రావే కోడల

రావే కోడల రట్టడి కోడలా
పోవే పోవే అత్తయ్యా పొందులు నీతో చాలును
రంకెలు వేయుచు రాజలెదుట నీవు
పొంకు కొసరులేని కోడలా
పంకజ ముఖినీవు పలుదొడ్డ వారింట్ల
అంకెల తిరిగేవు అత్తయ్యా
యీడాడ నలుగురినీ గురుమగలతో
కూడి సిగ్గులేని కోడలా
వాడకు పదుగురి వలపించుకొని నీవు
ఆడడ తిరిగేవు అత్తయ్యా
బొడ్డున బుట్టి బూపనికే నిను
గోడ్డేరు తెస్తినే కోడలా

గుడ్డము పై నున్న కోనేరాయని
అడ్డగించు కొంటి వత్తయ్యా

## 437. లక్ష్మీ కళ్యాణము

లక్ష్మీ కళ్యాణము లీలతో పాడే మిదే నేము
లక్ష్మీ నారాయణు లేలలయును నీవును
చూపులు చూపులు మీకు సూసకము బాసికము
పూపచన్ను గుబ్బలివే పూజ గుండలు
తీపుల మోవి తేనెలు తీరని మధు పర్కములు
దాపుగ పెండ్లాడరయ్య తగు తగు మీకును
మాటలు మాటలు మీకిద్దరికి మదన మంత్రములు
మేటి తలంబ్రాలు మీలో మించు నవ్వులు
గాటమైన పులకులు కప్పుర వసంతాలు
నీటున పెండ్లాడ రయ్య నెరవేరే మీకును
కౌగిలి కౌగిలి మీకు కందువ పెండ్లి చవికె
పాగిన కోరికలే పావకోళ్ళు
ఆగిన శ్రీ వేంకటేశ అలమేలు మంగా నీవు
వీగక పెండ్లాడరయ్య వేడుకాయ మీకును

## 438. లెండో లెండో

లెండో లెండో మాటాలించరో మీరు
కొండలరాయనినే పేర్కొన్న దిదె జాలి ॥
మితిమీరె చీకట్లు మేటితలపరులాల
జతనము జతనము జతనము జాలోజాలి
యితవరులాల వాయించే వాద్యాలకంటె
అతిఘోషముల తోడ ననరో జాలి ॥





గాములు వారెడి పొద్దు కావలి కాండ్లాల
జాము జాము దిరుగరో జాలో జాలి
దీమనపు పారివార దీవె పంజులు చేపట్టి
యేమరక మీలో మీరు యియ్యరో జాలి ॥
కారుకమ్మె నదురేయి గడచె గట్టికవార
సారెసారె పలుకరో జాలోజాలి
యీ రీతి వేంకటేశుడిట్టె మేలుకొన్నాడు
గారవాన నిక మాన కదరో జాలి ॥

## 439. వచ్చెను అలమేలుమంగ

("భజన సంప్రదాయ పద్ధతి" నుండి)

వచ్చెను అలమేలు మంగ ఈ
పచ్చల కడియాల పణతి చెలంగ ॥
బంగారు చేదివిటీలు పూని
శృంగారవతులు వేవేలు రాగా
రంగైన వింజామరలు వీవ
మాంగల్యలీల సొంపగు జవరాలు ॥
పలుకుల తేనియు లొలుక చెంత
చిలుకలు కలకల పలుక రవల
గిలుకు పావలు ముద్దుగులుక మేటి
కలికి చూపుల మొనలు తళుకని చిలుక ॥
రంభాది సతులెల్ల చేరి ఎదుట
గంభీర గతులను మీర నటనా
రంభములను మేలుకోరి కొలువ
అంభోజాక్షుడౌ వేంకటేశు నొయ్యారి ॥

## 440. వట్టి లంపటాల

వట్టి లంపటాల బడి వడ బొరలుట కంటే
వొట్టినవిరతి నూరకుండు టే సుఖము
పాపము మానినయట్టి బదుకొక్కటె సుఖము
కోపము విడిచినట్టి గుణ మొక్కటి సుఖము
చేపట్టి గురుబుద్ధి సేసేటిదే సుఖము తీ
దీపుల బడనియట్టి దినమే సుఖము
మహి చంచలము లేని మనసొక్కటి సుఖము
సహజాచారముతోడి జన్మమొక్కటి సుఖము
యిహపర సాధపు యెన్ని కొక్కటి సుఖము
బహుళపుటాస కంటె పరిపాటి సుఖము
పరుల పీడించితేని పసి దొక్కటి సుఖము
గరిమ నిజముతోడ గలమాటలే సుఖము
ధరశ్రీ వేంకటేశు దాసాను దాసుడయి
సరవితో నడచేటి శాంతమే సుఖము

## 441. వద్దేగొల్లెత

వద్దే గొల్లెత వదలకువే నీ
ముద్దు మాటలకు మొక్కేమయ్యా ॥
ఏలే ఏలే ఏలే గొల్లెత
నా లాగెరగవ నన్నునేచేవు
చాలు చాలునిక చాలు నీ రచనలు
పోలవు బొంకులు పోవయ్యా ॥
కానీ కానీ కానీ (లే) గొల్లెత
పోనీలే నీ వెందువోయినను





మాని మాని పలుమరు చెనకుచు మా-
తో నిటు సొలయక తొలవయ్యా ॥
రావా రావా రావా గొల్లెత
శ్రీ వేంకటగిరి చెలువుడను
నీవె నీవె నను నించితి కౌగిట
కైవసమైతిని కదవయ్యా ॥

## 442. వన నిధి కురిసిన

వన నిధి కురిసిన వానలివి మతి
లేని పనుల భారములు
అడవుల వెన్నెల లారిడి బదుకులు
తడతాకుల పరి తాపములు
వొడలొసగిన హరి నొల్లక యితరుల
బడి బడి దిరిగిన బంధములు
కొండల నునుపులు కొనకొన మమతలు
అండల కేగిన నదవదలు
పండిన పంటలు పరమాత్ము విది
బండయి తిరిగిన బడలికలు
బచ్చన రూపులు పచ్చల కొలపులు
నిచ్చల నిచ్చల నెయ్యములు
రచ్చల వేంకట రమణుని గొలువక
చచ్చియు చావని జన్మములు

## 443. వలచి వచ్చితి నేను

వలచి వచ్చితి నేను వానికిగాను
నెలవై మీ గొల్లవాడనే తానుండునంట ॥

చెందమ్మి కన్నులవాడు చేతిపిల్లగోవివాడు
ఇందువచ్చె కంటిరా ఏమిరే అమ్మా
మందల పసువులవాడు మకరాంకములవాడు
ఎందు నున్నాడు చెప్పరే ఏలదాచేరమ్మ ॥
నెమలిపించమువాడు నీలమేఘకాంతివాడు
రమణుడాతడు మొక్కేను రమ్మనరమ్మా
జమళి చేతులవాడు సంకుచక్రములవాడు
అమర మీపాల చిక్కునట చూపరమ్మా ॥
పచ్చపైడిదట్టివాడు పక్షివాహనపువాడు
ఇచ్చినాడు నాకుంగరము ఇదివో అమ్మా
చెచ్చెర కోనేటివాడు శ్రీవేంకటేశ్వరుడు
వచ్చినన్ను కూడినాడు వాడు ఓయమ్మా ॥

### 444. వలదన నొరులకు

వలదన నొరులకు వసమటవే
తలచినట్ల నిది దైవమె చేసె ॥
తరుణి కుచములను తామర మొగుడలు
విరిసేనో యని వెరపునను
సరగునపతి నఖ చంద్రశకలములు
దరులగలుగ నివి దైవమె చేసె ॥
పొలితి వదనమను పున్నమ చంద్రుడు
బలిమి నెగయునని భయమునను
మెలుత చికుర ధమ్మిల్లపు రాహువు
తలజెదరగ నిది దైవమె సేసె ॥
వనితకు వాడునో వలపు తాపమున
తనులతిక యనుచు తమకమున





ఘన వేంకటపతి కౌగిట చెమటల
తనివి దీర్చనిది దైవమె సేసె ॥

### 445. వలపుల సొలపుల

వలపుల సొలపుల వసంత వేళ యిది
సెలవి నవ్వకువే చెమరించీ మేను ॥
శిరసు వంచకువే సిగ్గులు వడకువే
పరగ నిన్నతడు తప్పక చూచీని
విరులు దులుపకువే వెసదప్పించుకోకువే
సిరులనీ విభుడిట్టే సేసవెట్టీని ॥
చేయెత్తి యొడ్డుకోకువే చేరి యానపెట్టకువే
చాయల నాతడు నీ చన్ను లంటిని
ఆయములు దాచకువే అట్టే వెరగందకువే
మోయనాడీ సరసము మోహాన నీ విభుడు ॥
పెనగులాడకువే బిగువు చూపకువే
ఘన శ్రీ వేంకటేశుడు కౌగిలించీని
అనుమానించకువే అలమేల్మంగవు నీవు
చనవిచ్చి నిన్ను నేలె సమ్మతించీ యాతడు ॥

### 446. వలపులు వలపులు

వలపులు వలపులు వయాళి
చలమరి మరుడును సమేళి ॥
నెలతమోమునకు నీ కనుచూపులు
నిలుపున ముత్తెపు నివాళి
కొలదికి మీరిన గురు కుచములకును
తొలకు నీ మనసు దువాళి ॥
వనిత నిండు జవ్వన గర్వమునకు
ఘనమగు నీరతి కరాళి

వెనక ముందరల వెలది మేనికిని
పెనగు గోరికొన పిసాళి ॥
పడతి కోరికల భావంబునకును
కడు కడు నీ తమి గయాళి
చిడిముడి మగువకు శ్రీ వేంకటపతి
విడువని కూటపు విరాళి ॥

## 447. వలెననువారిదె

వలెనను వారిదె వైష్ణవము యిది
వలపు దేనెవో వైష్ణవము ॥
కోరిక లుడుగుచు గుఱి నిన్నిటిపై
వైరాగ్యమెపో వైష్ణవము
సారెకు కోపము చలమును తనలో
వారించుటవో వైష్ణవము ॥
సుడిగొను దేహపు సుఖదుఃఖములో
వడి చొరనిదె పో వైష్ణవము
ముడివడి యింద్రియముల కింకరుడై
వడబడ నిదె పో వైష్ణవము ॥
వుదుటున తన సకలోపాయంబులు
వదలుట పో నిజవైష్ణవము
యెదుటను శ్రీవేంకటేశ్వరు నామము
వదనము చేర్చుట వైష్ణవము ॥

## 448. వందేహం జగద్వల్లభం

(పెద తిరుమలాచార్య సంకీర్తన)

వందేహం జగద్వల్లభం దుర్లభం
మందరధరం గురుం మాధవం భూధవం ॥





నరహరిం మురహరం నారాయణం పరం
హరి మచ్యుతం ఘన విహంగవాహం
పురుషోత్తమం పరం పుండరీకేక్షణం
కరుణాభరణం కలయామి శరణం ॥
నందనిజనందనం నందకగదాధరం
యిందిరానాథ మరవిందనాభం
యిందురవిలోచనం హితదాసవరదం, ము
కుందం యదుకులం గోపగోవిందం ॥
రామనామం యజ్ఞరక్షణం లక్షణం
వామనం కామినం వాసుదేవం
శ్రీమదావాసినం శ్రీ వేంకటేశ్వరం
శ్యామలం కోమలం శాంతమూర్తిం ॥

## 449. వాడల వాడల వెంట

వాడల వాడల వెంట వసంతము
జాడతో చల్లేరు నీపై జాజర జాజర జాజ ॥
కలికి నవ్వులె నీకు కప్పుర వసంతము
వలచూపు కలువల వసంతము
కులికి మాటాడినదె కుంకుమ వసంతము
చలమున చల్లె నీపై జాజర జాజర జాజ ॥
కామిని జంకెన నీకు కస్తూరివసంతము
వాముల మోహపు నీటి వసంతము
బూమెల సరసముల పుప్పొడి వసంతము
సామజ గురుడ నీపై జాజర జాజర జాజ ॥
అంగన అధరమిచ్చే అమృత వసంతము
సంగడి శ్రీవేంకటేశ సతిగూడితి

ముంగిటి రతి చెమట ముత్తేలవసంతము
సంగతాయెనిద్దరికి జాజర జాజర జాజ ॥

## 450. వాడల వాడల వెంట

వాడల వాడల వెంట వాడెవో వాడేవో
నీడ నుండి చీరలమ్మే నేత బేహారి
పంచ భూతములనెడి పలువన్నె నూలు
చంచలపు గంజివోసి చరిసేసి
కొంచెపు కండెల నూలి గుణముల నేసి
మంచి మంచి చీరలమ్మే మారు బేహారి
మట మాయముల తన మగువ పసిడి నీరు
చిటిపొటి యలుకల జిలికించగా
కుటిలంపు జేతలు కుచ్చులుగా గట్టి
పట వాళి చీరలమ్మే బలు బేహారి
మచ్చిక కర్మ మనేటి మైల సంతలోన
వెచ్చపు కర్మధనము వెలువ చేసి
పచ్చడాలుగా గుట్టి బలు వేంకటపతి
ఇచ్చు కొలదుల నమ్మే ఇంటి బేహారి

## 451. వాడివో కంటిరటరే

వాడివో కంటిరటరే వన్నెలవాడు
పైడి మోలముకటారు పరుజులవాడు ॥
పెద్దకిరీటమువాడు పీతాంబరమువాడు
వొద్దిక కౌస్తుభమణి వురము వాడు
ముద్దుల మొగమువాడు ముత్తేల నామమువాడు
అద్దిగో శంఖచక్రాల హస్తాలవాడు ॥





అందిన కటిహస్తము అభయహస్తమువాడు
అందెల గజ్జెల పాదాలమరువాడు
కుందణంపు ఈ మకరకుండలంబులవాడు
కందువ బాహుపురుల కడియాలవాడు ॥
నగవు చూపులవాడు నాభికమలమువాడు
మొగపుల మొలనూళ్ళ మొలవాడు
చిగురు మోవివాడు శ్రీవేంకటేశుడు
తగు నలమేల్మంగ తాళిమెడవాడు ॥

## 452. వాడె వేంకటేశుడనే వాడే వీడు

వాడె వేంకటేశుడనే వాడే వీడు
వాడి చుట్టుకైదువ వలచేతివాడు ॥
కారిమారసుతుని చక్కని మాటలకు చొక్కి
చూరగా వేదాలగుట్టు చూపినవాడు
తీరని వేడుకతో తిరుమంగైయాళువారి
ఆరడి ముచ్చిమికూటికి ఆసపడ్డవాడు ॥
పెరియాళువారిబిడ్డ పిసికి పై వేసిన
విరుల దండల మెడవేసినవాడు
తరుణి చేయివేసిన, దగ్గరి, బుజము చాచి
పరవశమై చొక్కి పాయలేని వాడు ॥
పామరుల దనమీది పాటలెల్లా పాడుమంటా
భూమికెల్లా నోర నూరి పోసినవాడు
మామకూతురలమేలుమంగ నాంచారియుదాను
గీముగానే వేంకటగిరి నుండేవాడు ॥

## 453. వాడెవో ప్రహ్లాద వరదుడు

వాడెవో ప్రహ్లాద వరదుడు
వాడెవో భక్తవత్సలుడు ॥

కోరదవడలతోడ కోటి సూర్యతేజముతో
హార కేయూరాది భూషణాంబరాలతో
చేరి బ్రహ్మాదు లెల్లాను సేవలు సేయగాను
మేర మీరిన సిరుల మేడలో నున్నాడు ॥

తెల్లనిమేనితోడ తీగెనవ్వుల తోడ
చల్లని గందముల వాసనలతోడ
పెల్లుగా నారదాదులు పేరుకొని నుతించగా
వెల్లవిరి కొలువై వేడుక నున్నాడు ॥

సంకుచక్రములతోడ జంట పూదండలతోడ
పొంకపు నానావిధ భోగములతో
అంకపు శ్రీవేంకటాద్రి నహోబలమునందు
అంకెల నేపొద్దూ నెలవై తానున్నాడు

## 454. విజాతులన్నియు వృధా వృధా

విజాతులన్నియు వృధా వృధా
అజామిళాదుల కదియే జాతి ॥

జాతిబేధములు శరీర గుణములు
జాతి శరీరముతోడనే చెడు
ఆతుమ పరిశుద్ధం బెప్పుడును అది నిర్దోషం బనాది
యీతల హరి విజ్ఞానపు దాస్యంబిది యొక్కటే పో సుజాతి ॥

హరి యిందరిలో నంతరాత్ముడిదె
ధరణి జాతిబేధము లెంచిన
పరమ యోగు లీభావ మష్టమదము భవవికారమని మానిరి
ధరణిలోన పరతత్వజ్ఞానము ధర్మమూలమే సుజాతి ॥

లౌకికవైదిక లంపటులకు నివి
కైకొను నవశ్య కర్తవ్యంబులు





శ్రీకాంతుడు శ్రీ వేంకటపతి సేసిన సంపాద మిందరికి
మేకొని యిన్నియు మీరినవారికి మీ నామమే పో సుజాతి ॥

## 455. విడువుము మనసా

విడువుము మనసా వీరిడి చేతలు
తడయక శ్రీహరి తలచవో యికను

నానాడే యెనబది నాలుగు లక్షల
యోనుల వెడలితి నొక్కడనే
ఆనిన భోగములు అందలివేపో
కానము యిక నేమి గడియించేము

నలుగడనటు పదునాల్గు లోకములు
వెలయ జొచ్చితిని వేదలితిని
కలిగిన దేదో కలుగని దేదో
తెలియ దేమిటికి తిరిగేమో

భువిలో చేసితి పుణ్యము పాపము
కవిసియా ఫలము గైకొంటిని
యివల శ్రీ వేంకటేశుడు యింతలో
తవిలి యేలగా ధన్యుడనైతి

## 456. విభుడ వింతటికి

విభుడ వింతటికి వెరవుతో ననుగావు
అభయ హస్తముతోడి ఆదిమూలమా

పలు లంపటాలచేత పాటుబడి పాటుబడి
అలసితిగావవే వో ఆదిమూలమా
చలమరి యితర సంసార భ్రాంతి చిక్కితిన
న్నలరించి గావవే వో ఆదిమూలమా

యెంతకైన ఆసలచే యేగేగి వెసరితి
అంతకోప గావవే వో ఆదిమూలమా
సంతల చుట్టరికాల జడిసితినిక గావు
అంతరాత్మ నా పాలి ఆదిమూలమా
రంట దిప్పునింద్రియాల రవ్వైతి కావవేవో
అంటిన శ్రీ వేంకటాద్రి ఆదిమూలమా
గెంటక ముమ్మాటికిని నీకే శర–
ణంటి కావవే వో ఆదిమూలమా

## 457. విభుని వినయములు

విభుని వినయములు వినవమ్మా నిను
నభయం బడిగీ నయ్యో తాను ॥
రహస్యమున శ్రీరమణుడు పంపిన
విహరణ లేకలు వినవమ్మా
అహిపతి శయనంబతి తాపంబై
బహువేదన కగపడెనట తాను ॥
ఆదిమపతి నీయడుగుల కెరగిన –
వేదాంత రచన వినవమ్మా
నీదయగానక నిమిషమె యుగమై
ఖేదంబున నలగీనట తాను ॥
కింకరుడట నీకినుక సేతలకు
వేంకటపతిగతి వినవమ్మా
సంకెలేక నీచనవున జగములు
కొంకకిపుడె చేకొనెనట తాను ॥

## 458. విరహపురాజదె

విరహపు రాజదె విడిదికి రాగా
సిరుల జేసెనిదె సింగారములు ॥





నెలత నుదుటిపై నీలపు కురులనె
తొలుతనె గట్టెను తోరణము
మొలక చెమటలనె ముత్యపుముగ్గులు
అలరిచె మదనుండదె చెలిమేన ॥
దట్టముగ చింతా లతనే వడి
బెట్టి చప్పరము పెనగొనగా
పట్టినమై తావులు పరిమళములు
కట్టించెను చెంగట వలరాజు ॥
విందగు వేంకట విభుని ప్రేమచే
పొందగు బెట్టెను బోనాలు
ఇందువదనకి ఇందిరా విభునికి
కందుదేర నలుకలు చవిజేసె ॥

## 459. వీడుగదె శేషుడు

వీడుగదే శేషుడు శ్రీవేంకటాద్రి శేషుడు
వేడుక గరుడనితో బెన్నుద్దె శేషుడు ॥
వేయి వడిగెలతోడ వెలసిన శేషుడు
చాయమేని తళుకువజ్రాల శేషుడు
మాయని శిరసులపై మాణికాల శేషుడు
యే యెడ హరికి నీడై యేగేటి శేషుడు ॥
పట్టపు వాహనమైన బంగారు శేషుడు
చుట్టు చుట్టుకొనిన మించుల శేషుడు
నట్టుకొన్న రెండు వేలునాలుకల శేషుడు
నెట్టన హరిపొగడ నేరుపరి శేషుడు ॥
కదిసి పనులకెల్ల కాచుకున్న శేషుడు
మొదల దేవతలెల్లా మొక్కే శేషుడు

అదె శ్రీవేంకటపతి కలమేలు మంగకును
పదరక యే పొద్దూ పానుపైన శేషుడు ॥

### 460. వీడెవో యిదె

వీడెవో యిదె వింతదొంగ
వేడిపాలు వెన్న వెరజిన దొంగ
వెలయనీట ఒప్పువేసేటి దొంగ
తలగాన నీక దాగు దొంగ
తలకక నేలదవ్వేటి దొంగ
తెలిసి సందెకాడ దిరిగేటి దొంగ
అడుగుకిందలోక మడచేటి దొంగ
అదరి తల్లికినైన నలుగుదొంగ
అడవిలో నెలవై యున్న దొంగ
తొడరి నీలికాసెతో నుండు దొంగ
మోసమింతుల జేయు ముని ముచ్చు దొంగ
రాసికెక్కిన గుఱ్ఱంపు దొంగ
వేసాల కిటువచ్చి వేంకటగిరి మీద
మూసిన ముత్యమై ముదమందు దొంగ

### 461. వీధుల వీధుల

వీధుల వీధుల విభుడేగేనిదె
మోదము తోడుత మొక్కరో జనులు ॥
గరుడ ధ్వజమదె కనకరథంబదె
అరదముపై హరి అలవాడే
ఇరుదెసలనున్నారు ఇందిరయు భువియు
పరగ పగ్గములు పట్టరో జనులు ॥





ఆడేరదివో అచ్చరలెల్లరు
పాడేరు గంధర్వ పతులెల్ల
వేడుకతో వీడె విష్వక్సేనుడు
కూడి ఇందరును కొలువరో జనులు ॥
శ్రీ వేంకటపతి శిఖరముచాయదె
భావింప బహువైభములవె
గోవింద నామపు ఘోషణలిడుచును
దైవం బితడని తలచరో జనులు ॥

### 462. వెదకిన నిదియే

వెదకిన నిదియే వేదార్థము
మొదలు తుదలు హరిమూలంబు ॥
మునుకొని అవయవములు యెన్నైనా
పనివడి శిరసే ప్రధానము
యెనలేని సురలు యెందరు కలిగిన
మనుపటి హరియే మూలంబు ॥
మోవని యింద్రియములు యెన్నైనా
భావపు మనసే ప్రధానము
యీవల మతములు యెన్నికలిగినా
మూవురలో హరి మూలంబు ॥
యెరవగు గుణములు యెన్ని కలిగినా
పరమ జ్ఞానము ప్రధానము
యిరవుగ శ్రీ వేంకటేశ్వరు నామమే
సరవి మంత్రముల సారంబు ॥

### 463. వెనకేదో ముందరేదో

వెనకేదో ముందరేదో వెఱ్ఱి నేను, నా
మనసు మరులు దేర మందేదొకో ॥

చేరి మీదటి జన్మము సిరులకు నోమేగాని
ఏరూపై పుట్టుదునో ఎఱగ నేను
కోరి నిద్రించపరచుకొన నుద్యోగింతుకాని
సారె లేతునో లేవనో జాడ తెలియ (నేను) ॥
తెల్లవారినప్పుడెల్లా తెలిసినతినసేకాని
కల్లయేదొ నిజమేదో కాన నేను
వల్లచూచి కామినుల వలపించేగాని
మొల్లమై నామేను ముదిసిన దెరగ ॥
పాపాలుచేసి మరచి బ్రదుకు చున్నాడగాని
వైపుగ చిత్రగుప్తుడు వ్రాయుటెఱగ
ఏపున శ్రీవేంకటేశు నెక్కడో వెదకేగాని
నాపాలిదైవమని నన్నుగాచు టెరగ ॥

## 464. వేదములు నుతించగ

వేదములు నుతించగ వేడుకలు దైవారగ
ఆదరించీ దాసుల మోహన నారసింహుడు ॥
నెఱుల జడలతోడ నిక్కు కర్ణములతోడ
కుఱచ కొమ్ములతోడ కోఱలతోడ
వుఱక సిరి దొడపైనుంచుక సింహాసనాన
మెఱసీ ప్రతాపములు మేటి నారసింహుడు ॥
నిడుపమీసాలతోడ నిట్టూరుపులతోడ
మిడిగుడ్లతో తెల్లని మేని తోడ
ఒడల సొమ్ములు వెట్టి ఒడ్డోలగమైవుండి
కడుమంచి వరాలిచ్చీ ఘననారసింహుడు
చిలుకు గోళ్లతోడ సెలవినవ్వులతోడ
బలు జిహ్వతోడ యోగ పట్టెముతోడ





అలరి శ్రీవేంకటాద్రి అహోబలగిరిని
అలప్రహ్లాదుని గాచె ఆది నారసింహుడు ॥

## 465. వేదములే నీ నివాసమట

(పెద తిరుమలాచార్య రచన)

వేదములే నీ నివాసమట విమలనారసింహ
నాదప్రియా సకలలోకపతి నమో నమో నరసింహా ॥
ఘోరపాతక నిరుహరణ కుటిలదైత్యదమన
నారాయణ రమాధినాయక నగధర నరసింహా
నీ రూపము ఇంత అంతయని నిజము తెలియరాదు
ఈరీతి త్రివిక్రమాకృతి నేచితి నరసింహ ॥
గోవింద గుణగణరహిత కోటి సూర్య తేజ
శ్రీవల్లభ పురాణపురుష శిఖనఖ నరసింహ
దేవా మిము బ్రహ్మాదులకును తెలియనలవికాదు
భావించగ ప్రహ్లాదు నెదుట పరగితి నరసింహ ॥
దాసపరికర సులభ తపన చంద్రనేత్ర
వాసవ సురముఖము మునిసేవిత వందిత నరసింహ
భాసురముగ శ్రీవేంకటగిరిని పాయనిదైవమ వటుగాన
ఓసరకిపుదు ఏగితివిట్ల అహోబల నరసింహ ॥

## 466. వేదం బెవ్వని

వేదం బెవ్వని వెదకెడిని
ఆదేవుని కొనియాడుడీ
వేంకటమణా గోవిందా సంకట హరణా గోవిందా ।
గోవిందా హరి గోవిందా వేంకటరమణా గోవిందా ॥
అలరిన చైతన్యాత్మకు డెవ్వడు
కలడెవ్వడెచట కలడనిన

తలతుర్వెనిని తను వియోగదశ
యిలనాతని భజియించుడీ
కడగి సకల రక్షకుడిందెవ్వడు
వడినింతయు నెవ్వని మయము
పిడికిట తృప్తులు పితరులెవ్వనిని
తడవిన ఘనుడాతని గనుడీ
కదసి సకల లోకంబుల వారలు
యిదివో కొలిచెద రెవ్వనిని
త్రిదశ వంద్యుడగు తిరువేంకటపతి
వెదకి వెదకి సేవించుడీ

## 467. వేవేలచందాల వాడు

వేవేలచందాల వాడు విఠలేశుడు
భావించ నలవిగాని పరమాత్ముడితడు ॥
సతతము రుక్మిణీ సత్యభామ నడుమ
రతికెక్కిన సింగారరాయడితడు
చతురత సనకాది సంయమీంద్రులమతి
నతిశయిల్లేటి పరమానందమితడు ॥
దేవతలకెల్లాను దిక్కు దెసై వెలుగొంది
తావుకొన్నయట్టి ఆధారమితడు
మూవంకగొల్లెతలు మున్ను సేసినతపము
కైవసమై ఫలించిన ఘనభాగ్యమితడు ॥
వరముతో యశోద వసుదేవాదులకు
పరగిన కన్నుల పండుగితడు
సిరులు మించిన యట్టి శ్రీవేంకటాద్రిమీది
నిరతి దాసుల పాలి నిధానమితడు ॥





## 468. శరణం బితడే

శరణం బితడే సకలము నాకును
వెరవున మనసా విడువవో యితని
అభయం బొసగేటి అతడెవ్వడు మును
యిభ రక్షకుడతడెవ్వడు
వుభయ విభూతల కొడయంబెవ్వడు
ప్రభువతడే నాపాలి దేవుడు
శరణాగతులకు సరి దాపెవ్వడు
యిరవుగ శ్రీపతి యెవ్వడు
అరిది దుష్టదైత్య హంతకుడెవ్వడు
పరమును నతడే నాపాలి దేవుడు
ఆది శంఖ చక్రాయుధు డెవ్వడు
యేదెస పూర్ణుడెవ్వడు
వేదమయుడు శ్రీ వేంకట పతియై
పాదాయనిదె నాపాలి దేవుడు

## 469. శ్రీపతి పురనాయక

(చిన తిరుమలాచార్య రచన)

శ్రీపతి పురనాయక జయ
చింతితాభీష్ట దాయక ॥
ఉన్నతోన్నత విగ్రహ దాసోపరిస్థానుగ్రహ
సన్నుతామర సుగ్రహా సామవేద పరిగ్రహా ॥
జానకీ ప్రియకారక శివ సాధితాఖిల తారక
మానుషాహిత మారక మామకాఘ నివారక ॥
శ్రీ వేంకట నాధరూపక సంచిత రఘుకుల దీపక
భావ సంతోష ప్రాపకాఅభంగ మంజుల చాపక ॥

## 470. శ్రీహరి నిత్యశేషగిరీశ

శ్రీహరి నిత్యశేషగిరీశ
మోహనాకార ముకుంద నమో ॥
దేవకీ సుత దేవ వామన
గోవిందా గోప గోపీనాథా
గోవర్ధనధర గోకులపాలక
దేవేశాధిక తే నమో నమో ॥
సామజావన శార్ఙపాణి
వామనా కృష్ణ వాసుదేవా
రామనామ నారాయణ విష్ణో
దామోదర శ్రీధర నమో నమో ॥
పురుషోత్తమ పుండరీకాక్ష
గరుడధ్వజ కరుణానిధి
చిరంతన అచ్యుత శ్రీవేంకటేశ్వర
నరమృగ తే నమో నమో ॥

## 471. శ్రీహరి చేసిన చిహ్నాలివి

శ్రీహరి చేసిన చిహ్నాలివి యీ
మోహము విడుచుట మోక్షమది
మలినంబేది మఱి గననేది
కలుషపు మలముల కాయమిది
కలిగిన దేది కడులేందేది
చలనపు మాయల జన్మమిది
తనిసిన దేది తనియని దేది
దిన దినమాకలి దీరదిది





కొనయిందేది గుఱి మొదలేది
పనిగొను కర్మపు బంధమది
నిండిన దేది నిండని దేది
కొండల పొడవుల కోరికది
అండనె శ్రీ వేంకటాధిపు శరణని
వుండుటే యిహ పర యోగమది

## 472. శోభనమే శోభనమే

శోభనమే శోభనమే
వైభవముల పావన మూర్తికి ॥
అరుదుగ మును నరకాసురుడు
సిరులతో చెరలు దెచ్చిన సతుల
పరువపు వయసుల పదారు వేలను
సొరిది పెండ్లాడిన సుముఖునికి ॥
చెందిన వేడుక శిశుపాలుడు
అంది పెండ్లాడగ నవగళించి
విందు వలెనె తావిచ్చేసి రుకుమిణి
సందడి పెండ్లాడిన సరసునికి ॥
దేవదానవులు ధీరతను
దావతిపడి వారిందరువగను
శ్రీవనితామణి చెలగి పెండ్లాడిన
శ్రీ వేంకటగిరి శ్రీనిధికి ॥

## 473. సకల బలంబులు

సకల బలంబులు నీవే సర్వేశ్వరనాకు
అకలంకంబగు సుఖమే అన్నిట నిదే నాకు

పొందుగ చక్రాంకితమే బుజబలమిదె నాకు
అందిన హరి నీ చింతే ఆత్మబలము నాకు
సందడి పేరు బలము కేశవనామము నాకు
యిందును నందును భవ భయమికలేదిదే నాకు
అంగపు తిరుమణులివి పంచాంగ బలమునాకు
సంగతి నీపై పాటలె సర్వ బలిమిదేనాకు
రంగుగ నీ గుణరాసులే రాసి బలమునాకు
యింగితగ నిహపరముల కెదురేదిదేనాకు
కనుకొను నీ విగ్రహమే గ్రహ బలిమిదెనాకు
విను నీ దాసుల సేవె వెనుబలి మిదెనాకు
తనరిన శ్రీ వేంకటపతి దైవబలమునాకు
ఘనమే చెప్పగ నింతట కలిగెబోయిదేనాకు

## 474. సకలము చదివిన

సకలము చదివిన శాస్త్రము లెరిగిన
సుకధ్రువాదులిటు చూపినది ॥
భవభవములకును ప్రకృతులు వేరే
భువి నామ రూపములు వేరే
యివలనీ దాస్యంబెప్పుడు వొకటే
కవిసిన నీమాయ గడచినది ॥
మతము మతమునకు మార్గమువేరే
అతి సంశయములు అవివేరే
గతి నీ శరణము గలిగినదొకటే
ఇతవగు మోక్షంబిచ్చేది ॥
జాతిజాతి యాచారము వేరే
ఆతల మోక్షం బదియొకటే





శ్రీతరుణీశ్వర శ్రీ వేంకటేశ్వర
చేతమాగురుడు చెప్పినది ॥

## 475. సకలశాంతి కరము

సకల శాంతి కరము సర్వేశ నీపై భక్తి సర్వేశ ।
ప్రకటమై మాకు నబ్బె బతికించు నిదియె సర్వేశ ॥
మనసులో పాపబుద్ధి మరియెంత దలచిన
నినుదలచినంతనే నీఱౌను
కనుగొన్న పాపములు కడలేనివైనాను
ఘనుడ నిన్ను జూచితే కడకు తొలగును ॥
చేతనంటి పాతకాలు సేనగానె చేసినాను
ఆతల నీకు మ్రొక్కితే నన్నియు బాయు
ఘాతలచెవుల వినగా నంటిన పాపము
నీతితో నీకథవింటే నిమిషాన బాయును ॥
కాయమున చేసేటి కర్మపు పాపములెల్ల
కాయపు నీముద్రలచే గ్రక్కున వీడు
యేయెడ వేంకటేశ యేయే పాతకమైన
ఆయమైన నీ శరణాగతిచే నణగు ॥

## 476. సకల సంగ్రహము

సకలసంగ్రహము సకలసంచయము
అకృతసుకృత మిది హరినామం ॥
సకల వేదశాస్త్రములసార మిది
సకల మంత్రరాజంబు నిది
సకల పురాణరసముల మధుర మిది
అకుటిల పావనం హరినామం ॥

సకలతత్వ సంశయఖండన మిది
సకల కర్మనిశ్చయము నిది
సకలవిధి రహస్య ప్రధాన మిది
అకారణహితం హరినామం ॥
సకల దేవతాస్వామిప్రియం బిది
సకలలోక రక్షణము నిది
ప్రకటం వేంకటపతి నామాంకిత-
మకించనధనం హరినామం ॥

## 477. సకలం హేసఖి

సకలం హేసఖి జానామి త
త్ప్రకట విలాసం పరమందధసే ॥
ఆలిక మృగమద మయ మషీకలనో
జ్జ్వలతాం హేసఖి జానామి
లలితం తవ పల్లవిత మనసి ని-
శ్చలతర మేఘ శ్యామందధసే ॥
చారుకపోల స్థల కరాంచిత వి
చారం హేసఖి జానామి
నారాయణ మహి నాయక శయనం
శ్రీరమణం తవ చిత్తేదధసే ॥
ఘన కుచ శైలా గ్రస్థిత విధుమణి
జనం హేసఖి జానామి
కనదురసా వేంకటగిరి పతే
ర్వినుత భోగసుఖ విభవం దధసే ॥

## 478. సచరా చర మిదే

సచరా చర మిదే సర్వేశ్వరుడే
పచరించి యీతని భావింపు మనసా





కదలెడి దింతయు కమలా రమణుని
సదరపు సత్యపు చైతన్యమే
నిదిరించెడి యీ నిశ్చేష్ట జగమును
వుదుటున నాతడు వుండే సహజమే
కలిగి వుండినదే కలదింతయు హరి
నలుగడ పరిపూర్ణపు గుణమే
మలసి లేనిదియు మహిమల నాతని
నిలుకడ గలిగిన నిర్గుణమే
జీవరాసులకు సృష్టియింతయును
శ్రీ వేంకటేశ్వరు చిత్తంబే
కైవల్య మేలోకపు టిహ పరము
భావింప నేర్చిన పరమ విధులకు

## 479. సముఖ ఎచ్చరిక

సముఖ ఎచ్చరిక వో సర్వేశ్వరా
అమరె నీకొలువు ప్రహ్లాద వరద ॥
తొడమీద కూచున్నది తొయ్యలి ఇందిరాదేవి
బడి చెలులు సోబాన పాడేరు
నడుమ వీణె వాయించీ నారదు డల్ల వాడె
అదరి చిత్తగించు ప్రహ్లాద వరదా ॥
గరుడోరగాదు లూడిగములు నీకు చేసేరు
ఇరుమేలా కొలిచేరు ఇంద్రాదులు
పరమేష్ఠి ఒకవంక పనులు విన్నవించీ
అరసి చిత్తగించు ప్రహ్లాదవరదా ॥
పొదిగొని మిమ్ము నిట్టే పూజించేరు మునులెల్ల
కదిసి పాడేరు నిన్ను గంధర్వలు

మదమున అహోబలమునను శ్రీ వేంకటాద్రిని
అదె చిత్తగించుము ప్రహ్లాదవరద ॥

## 480. సర్వేశ్వరుడే

సర్వేశ్వరుడే శరణ్యము
నిర్వాహకుడు యిన్నిటగాన
బలుదేవతలకు బ్రహ్మాదులకును
జలజనాభుడే శరణ్యము
అలరిన బ్రహ్మాండ మనిసిననాడును
నిలిపె నాతడు యిన్నిటి గాన
అనేక విధముల నిఖిల జీవులకు
జనార్దనుడే శరణ్యము
అనాధ నాథుడు అంతరాత్మకుడు
అనాధి పతియితడు అటుగాన
తగు నిశ్చలులగు తన దాసులకును
జగదేకపతే శరణ్యము
చిగురు చేవయగు శ్రీ వేంకటేశుడు
అగు వరములొసగు నటుగాన

## 481. సందడి సొమ్ముల తోడి

సందడి సొమ్ముల తోడి సాకారమిదె వీడె
యిందరు వర్ణించరే యీ రూపము
చుక్కలతో నాకాశము సూటై నిలువబోలు
నిక్కి రత్నాల జలధి నిటు కాబోలు
మిక్కిలి నానా వర్ణ మేఘపంక్తి కాబోలు
యిక్కడనే నిలుచున్నది యీ రూపము





నించిన పంచవన్నెల నీలగిరి కాబోలు
అంచల సంధ్యాకాల మది కాబోలు
చించకాతని మెరుగుల చీకటిది కాబోలు
యెంచగ నలవిగాదు యీ రూపము
పున్నమ నమాసయు పోగై నిలువబోలు
వున్నతి యోగీంద్రుల ఊహ కాబోలు
పన్నిన బ్రహ్మాండాల భరణిది కాబోలు
యిన్నిట శ్రీ వేంకటేశ యీ రూపము

## 482. సామాన్యమా పూర్వసంగ్రహంబగు

సామాన్యమా పూర్వసంగ్రహంబగుఫలము
నేమమున పెనగొనియె నేడు నీవనక ॥
జగతి ప్రాణులకెల్ల సంసార బంధంబు
తగుల బంధించు దురితంపు కర్మమున
మగుడ మారుకు మారు మగువ నీవురముపై
తెగికట్టి రెవ్వరో దేవుండ వనక ॥
పనిలేక జీవులను భవసాగరంబులో
మునుగ లేవగజేయు మోహదోషమున
పనిబూని జలధిలో పండబెట్టిరినిన్ను
వెనకెవ్వరో మొదలి వేలుపనక ॥
వుండనియ్యక జీవనోపాయమున మమ్ము
కొండలను గొబల తతిగొని తిప్పు ఫలము
కొండలను నెలకొన్న కోనేటిపతి వనగ–
వుండవలసెను నీకు ఓపలేననక ॥

## 483. సిరితొడపైనిడి

సిరితొడపైనిడి శ్రీ నరసింహుడు
యిరవుగ వరముల నిచ్చీని వాడే ॥

ఘన మగుకోరలు కరాళవదనము
చెనకుచు గొడసెటి జిహ్వయును
నినువుగ టమరలు నిటలలోచనము
వొనరగ కొలువై యున్నాడు వాడే ॥

చటులచక్రకరంబును శార్ఙకరంబును
అటు వరదాభయహస్తములు
పటుతర యోగపుపట్టబంధమును
కటితటి జెటగగ గడగీ వాడే ॥

పరపగు శేషునిపడగల నీడల
అరుదగు రవిచంద్రాంకముల
సిరులగద్దెపై శ్రీవెంకటేశుడు
పరిపూర్ణుడై పరగీ వాడే ॥

## 484. సింగార మూరితివి

సింగార మూరితివి చిత్తజ గురుడవు
సంగతి జూచేరు మిమ్ము సాసముఖా ॥

పూవుల తెప్పల మీద పొలతులు నీవు నెక్కి
పూవులు ఆకసము మోవ పూచి చల్లుచు
దేవదుందుభులు మ్రోయ దేవతలు కొలువగా
సావధానమగు నీకు సాసముఖా ॥

అంగరంగ వైభవాల అమర కామినులాడ
నింగి నుండి దేవతలు నిను చూడగా
సంగీత తాళవాద్య చతురతలు మెరయగా
సంగడి దేలేటి మీకు సాసముఖా ॥

పరగ కోనేటిలోన పసిడి మేడ నుండి
అరిది ఇందిరయు నీవు ఆరగించి





గరిమ శ్రీ వేంకటేశ కన్నుల పండువగాగ
సరవి నోలాడు మీకు సాసముఖా ॥

## 485. సుగ్రీవ నారసింహా

సుగ్రీవ నారసింహా సులభుడ వందరికి
అగ్రేసరుడ నీవు అవధారు దేవ ॥

సనకాదులొకవంక జయవెట్టుచున్నారు
ఎనసి సురలు చేతులెత్తి మొక్కేరు
మును లిరుమేలానుండి మునుకొని నుతించేరు
అనుపమాలంకార అవధారు దేవ ॥

గంగాది నదులెల్ల కడిగీ నీ పాదములు
పొంగుచు సప్తరుషులు పూజించేరు
సంగతి వాయుదేవుడు సరినాలవట్టమిడీ
అంగజ కోటిరూప అవధారు దేవా ॥

పరగ నారదాదులు పాడేరు నీ చరిత
పరమ యోగీంద్రులు భావించేరు
సిరులు మించినయట్టి శ్రీ వేంకటాద్రిమీద
అరుదుగ నున్నాడవు అవధారు దేవ ॥

## 486. సుముఖ మంగళము

సుముఖ మంగళము శుభమంగళము
శమదమగత తే జయమంగళము ॥

గంభీర గుణ కమలా రమణా
శంభురాణినుత సకల లోకయుత
మాం భజతే జయ మంగళం
అంభోధి శయన హరినయన ॥

కనకాంబర నిజ ఘన చరణాంబర
దనుజ శరణ హత దైత్యగణా
అనుపమ చరితా అనంత నిరత
సనకప్రియ తే జయ మంగళము ॥
చతుర్భుజాంగా సదయాపాంగా
గతన క్రాంబుజ కరచక్రా
శ్రిత శరణాగత శ్రీవేంకటపతి
చతుర నమో తే జయ మంగళము ॥

## 487. సువ్వి సువ్వి సువ్వని

సువ్వి సువ్వి సువ్వని
సుదతులు దంచెదరోలాల ॥
వనితలు మనసులు కుందెన చేసిటు
వలపులు తగనించోలాల
కనుచూపులనెడు రోకండ్లను
కన్నెలు దంచెదరోలాల ॥
బంగరు చెరగుల పట్టుపుట్టములు
కొంగులు తూలగ వోలాల
అంగనలందరు నతివేడుకతో
సంగడి దంచెదరోలాల ॥
ఘల్లు ఘల్లుమను కంకణరవముల
పల్లవ పాణులు వోలాల
అల్లన నడుములు అసియాడుచు సతు-
లొల్లనె దంచెదరోలాల ॥
కప్పురగంధులు కమ్మని పువ్వుల
చప్పరములలో నోలాల





తెప్పలుగా రతితేలుచు కోనే-
టప్పని పాడెదరోలాల ॥

## 488. సోదించిరిదియే

సోదించిరిదియే సురలును మునులును
ఆదికి అనాది హరినామం
అరిది వేద శాస్త్రార్థ సంగ్రహము
అరయగ నొకటే హరినామం
దురిత హరము భవ దుఃఖనాశనము
అరి భయంకరము హరినామం
సకల పుణ్య ఫలసార విహారము
అకలంకము శ్రీహరినామం
ప్రకటము సులభము పరమ పావనము
అకుటిలమిది శ్రీహరినామం
కందువ సదరము కైవల్యపదము
అందరికిది యే హరినామం
యెందును శ్రీ వేంకటేశ్వరు కరుణకు
అందుకోలేని హరినామం

## 489. హరి గొలిచియు మరి

హరి గొలిచియు మరి అపరములా
తిరముగ అతనినే తెలియుటగాక
పంకజనాభుని పాదములు తలచి
యింకా మరియొక ఇతరములా
అంకెల నతనినే అతని దాసులనే
కొంకక నిజముగ కొలుచుట గాక
పన్నగశయనుని బంట్లకు బంటై
కొన్నిటిపై మరి కోరికెలా

యిన్ని కోరికలు ఇవియే తనకని
కొన్నది కోలై కోరుట గాక
వీనుల వేంకట విభు నామామృత
మూనిన మతి మరియును రుచులా
తేనెలు కారెడి తీపులతని నుతి
నానా రుచులై ననుచుటగాక

## 490. హరినిన్ను పిలిచీని

హరినిన్ను పిలిచీని అదివో అమ్మా
తెరమరుగికనేల తియ్యవమ్మా ॥
చిత్తరు పతిమ వంటి చెలియా నీవు
ఇత్తల పతికి విడెమీయవమ్మా
కొత్తమెరుగు బోలిన కోమలీ నీవు
మొత్తమి కూరిమి పతి మోముజూడవమ్మా ॥
బంగారు బొమ్మవంటి పడతి నీవు
అంగవించి పతితో మాటాడవమ్మా
అంగజుశరము వంటి అతివె నీకు
నంగతన మదియేల నవ్వవమ్మా ॥
చంచుల చిగురువంటి జవ్వని నీవు
కొంచక శ్రీ వేంకటేశు కూడితివమ్మా
మించు తమ్మిలోని అలమేలుమంగా
ఎంచి ఇద్దరును మమ్ము ఏలరమ్మా ॥

## 491. హరీ నీప్రతాపమున

హరీ నీప్రతాపమున కడ్డమేది లోకమున
సరి వేరీ నీకు మరి సర్వేశ్వరా
నీవు నీళ్ళు నమిలితేనె నిండెను వేదములు
యీవల తలెత్తి తేనె ఇంద్ర పదవులు మించె





మోవమూతి గిరిపితే మూడు లోకాలు నిలిచె
మోవిబార నవ్వితేనె ముగిసి రసురులు
గోర గిరితే నీరై కొండలెల్ల తెగ బారే
మారుకొంటె బయటనే మడుగులై నిలిచే
చేరియడుగు వెట్టితే శిలకు ప్రాణము వచ్చె
కూరిమికావలె నంటె కొండ గొడుగాయెను
కొంగు జారినంతలోనె కూలెను త్రిపురములు
కంగి కమనించితేనె కలిదోషములు మానె
రంగుగ శ్రీ శరణంటే రక్షించితి దాసులను
ముంగిట శ్రీ వేంకటేశ మూలమవు నీవే

## 492. హరి నీ మయమే

హరి నీ మయమే అంతాను
అరసి నీకు శరణనియెద నేను
యెదుట నెవ్వరిక నే మాటాడిన
అది నీ ఘన నామాంకితమే
అదివో సకల శబ్దాఖ్యుడవని నిన్ను
పొదలి చదువులు పొగడీ గాన
యెవ్వరి పొగడని యెక్కడ నుండిన
నివ్వటిల్లనది నీ రూపే
నెవ్వదీర నిదె నిను విశ్వరూపుడు
యెవ్వల నని శ్రుతులెంచీగాన
భావన యిది నీ బ్రహ్మాత్మకమే
శ్రీ వేంకటేశ నాచింత యిదే
ఆవల నిను సర్వాంతర్యామెని
దేవ శాస్త్రములు తెలిపీ గాన

## 493. హరి నీ యనుమతో

హరి నీ యనుమతో అది నా కర్మమో
పరయే యిహమై భ్రమయించీని
కలుగదు శాంతము కట కటా బుద్ధికి
చలమున నింతా చదివినను
నిలువదు చిత్తము నీపై చింతకు
పలు సంపదలను బరగినను
తగులదు వైరాగ్య ధనమాత్మకును
వొగి నుపవాసము లుండినను
అగపడదు ముక్తి ఆసల నాసల
జగమింతా సంచరించినను
విడువదు జన్మము వివేకము ననే
జడిసి స్వతంత్రము జరపినను
యెడయక శ్రీ వేంకటేశ్వర నీవే
బడిగాచి విదె బ్రతికితి నేను

## 494. హరియే ఎరుగును

హరియే యెరుగును అందరి బ్రతుకులు
యిరవై యీతని యెరుగుటే మేలు ॥
వెనకటిబ్రహ్మలు వేవేలసంఖ్యలు
యెనసి బ్రహ్మాండము లేలిరట
పెనగొని వారల పేరులు మరచిరి
మనుజకీటముల మరెవ్వ డెరుగు ॥
ఆసదొల్లి మునులనంత కోట్లు
చేసిరి తపములు సేవలుగా





యేసిరు లందిరి యెరగ రెవ్వరును
వేసపునరులకు విధి యేదో ॥
కల వనేకములు కర్మమార్గములు
పలుదేవత లిటు పాటించిరి
బలిమి శ్రీ వేంకటపతికి మొరయిడి
వెలసిరి తుదనిదె వెర విందరికి ॥

## 495. హరి రసమ విహారి

హరి రసమ విహారి సతు
సరసోయం మమ శ్రమ సంహారీ ॥
దయా నివృత తనుధారీ సం-
శయాతిశయ సంచారీ
కయాప్యజిత వికారీ
క్రియా విముఖ కృపాణధారీ ॥
సదా మిథ్యా జ్ఞానీ సతు
మదాలి మతాభిమానీ
తదాశ్రిత సంధానీ సతు
తదా తదా చింతాశయనాని ॥
పరామృత సంపాదీ
స్థిరానందా స్వేదీ
వరాలాప వివాదీ శ్రీ
తిరువేంకటగిరి దివ్యవినోదీ ॥

## 496. హరికృష్ణ మేలుకొను

హరికృష్ణ మేలుకొను ఆదిపురుషా
తరవాత నా మోము తప్పకిటుచూడు

మేలుకొను నాయన్న మెల్లనే నీతోడి
బాలులదే పిలిచేరు బడినాడను
చాలునిక నిద్దరలు చద్దికూళ్ళ పొద్దు
వేలాయ నాతండ్రి వేగలేవే

కనుదెరవు నా తండ్రి కమలాప్తుడదయించె
వనిత మొక మజ్జనము వడిదెచ్చెను
మొనసి మీ తండ్రియిదె ముద్దాడ చెలగేని
దనుజాంతకుండ యిక దగ మేలుకోవే

లేవెనా తండ్రి నీలీల లిటు పొగడేరు
శ్రీ వేంకటాద్రిపతి శ్రీ రమణుడా
దేవతలు మునులు చెందిన నారదాదులు
ఆవలను పాడేరు ఆకసమునందు



## అన్నమయ్య పైన సంకీర్తనలు

### శరణంటిమాతని

**(పెద తిరుమలాచార్య రచన)**

శరణంటి మాతని సమ్మంధమున జేసి
మరిగించి మమునేలి మన్నించవే ॥

సకల వేదములు సంకీర్తనలు జేసి
ప్రకటించి నిను పాడి పావనుడైన
అకలంకుడు తాళ్ళపాకన్నమాచార్యుల
వెకలియై యేలిన శ్రీ వేంకట నిలయ ॥

నారదాది సనక సనందనాదులవలె
పేరుబడి నిన్నుపాడి పెద్దలైనట్టి





ఆరీతి తాళ్ళపాక అన్నమాచార్యుల
చేరి ఏలిన యట్టి శ్రీవేంకట నిలయ ॥

సామవేద సామగాన సప్తస్వరములను
బాముతో నీసతి నిన్నుపాడిన యట్టి
ఆము కొన్న తాళ్ళపాక అన్నమాచార్యుల
వేమరు మెచ్చిన శ్రీ వేంకట నిలయ ॥

### దినముద్వాదశి

దినము ద్వాదశినేడు తీర్థదివసము నీకు
జనకుండ అన్నమాచార్యుండ విచ్చేయవే ॥

అనంత గరుడ ముఖ్యులైన సూరి జనులతో
ఘన నారదాది భాగవతులతో
దనుజ మర్దనుండైన దైవశిఖామణితోడ
వెనుకొని యారగించ విచ్చేయవే ॥

వైకుంఠాన నుండి ఆళువారల లోపలనుండి
లోకపు నిత్యముక్తుల లోన నుండి
శ్రీకాంత తోడ నున్న శ్రీవేంకటేశుగూడి
ఈ కడ నారగించ నింటికి విచ్చేయవే ॥

సంకీర్తనము తోడ సనకాదులెల్ల పాడ
పొంకపు శ్రీవేంకటాద్రి భూమినుండి
లంకె శ్రీ వేంకటగిరి లక్ష్మీ విభుడు నీవు
అంకెల మాయింటి విందులారగించవే ॥

### హరియవతారమీతడు

**(చిన తిరుమలాచార్య రచన)**

హరియవతార మీతడు అన్నమయ్య
అరయ మా గురుడీతడు అన్నమయ్య ॥

వైకుంతనాధుని వద్ద వడిపాడుచున్నవాడు
ఆకరమై తాళ్ళపాక అన్నమయ్య
ఆకసపు విష్ణుపాదమందు నిత్యమై ఉన్నవాడు
ఆకడీకడ తాళ్ళపాక అన్నమయ్య ॥
క్షీరాబ్ధిశాయి నిట్టే సేవింపుచు నున్నవాడు
ఆరితేరి తాళ్ళపాక అన్నమయ్య
ధీరుడై సూర్యమండల తేజమువద్ద నున్నవాడు
ఆ రీతుల తాళ్ళపాక అన్నమయ్య ॥
ఈవల సంసారలీల ఇందిరేశుతో నున్నవాడు
ఆవటించి తాళ్ళపాక అన్నమయ్య
భావింప శ్రీ వేంకటేశు పాదములందె ఉన్నవాడు
హావభావమై తాళ్ళపాక అన్నమయ్య ॥

## హరియవతారమె

(పెద తిరుమలాచార్య రచన)

హరి యవతారమె ఆతం డితడు
పరము సంకీర్తన ఫలములో నిలిపె ॥
ఉన్నాడు వైకుంతమున ఉన్నాడు ఆచార్యునొద్ద
ఉన్నతోన్నత మహిమ అన్నమయ్య
ఉన్నవి సంకీర్తనలు ఒట్టుక లోకములందు
పన్నిన నారదాదులు పైపైపాడగాను ॥
చరియించు నొకవేళ సనకాదిమునులలో
హరిబాడు తాళ్ళపాక అన్నమయ్య
తిరమై యాళువారల తేజము తానై యుండు
గురుడానంత ముఖ్య ఘనుల సంగడిని ॥
శ్రీ వేంకటాద్రిమీద శ్రీపతి కొలువునందు
ఆవహించె తాళ్ళపాక అన్నమయ్య





దేవతలు మునులును దేవుండని జయవెట్ట
కోవిదుడై తిరుగాడీ కోనేటి దండను ॥

## అప్పని వరప్రసాది

(చిన తిరుమాలాచార్యుల రచన)

అప్పని వరప్రసాది అన్నమయ్య
అప్పసము మాకే కలడన్నమయ్య ॥
అంతటికి ఏలికైన ఆదినారాయణు తన
అంతరంగాన నిలిపిన అన్నమయ్య
సంతసాన చెలువొందే సనకసనందనాదు-
లంతటివాడు తాళ్లపాక అన్నమయ్య ॥
బిరుదు టెక్కెములుగా పెక్కు సంకీర్తనములు
హరిమీద విన్నవించె నన్నమయ్య
విరివిగలిగినట్టి వేదముల అర్థమెల్ల
అరసి తెలిపినాడు అన్నమయ్య ॥
అందమైన రామానుజాచార్యమతమును
అందుకొని నిలచినాడు అన్నమయ్య
విందువలె మాకును శ్రీ వేంకటనాథునిచ్చె
అందరిలో తాళ్ళపాక అన్నమయ్య ॥

## మంగళాశాసనమ్

శ్రియః కాంతాయ కాల్యాణనిధయే నిధయేర్థినామ్
శ్రీ వేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ 1
లక్ష్మీసవిభ్రమాలోక సుభ్రూవిభ్రమచక్షుపే
చక్షుషే సర్వలోకానాం వేంకటేశాయ మంగళమ్ 2
సర్వావయవ సౌందర్య సంపదా సర్వచేతసామ్
సదా సమ్మోహనాయాస్తు వేంకటేశాయ మంగళమ్ 3